వస్త్రప్రపంచానికే తలమానికం.



# చందన బ్రదర్స్

(A.C)

లేడీస్ & జంట్స్ క్లాత్ షోరూమ్

జగదాంబ సెంటర్

విశాఖపట్నం



ఉషాకిరణ్ మూవీస్

# ప్రేమాయణం లో పాత్రలూ సూత్రధారులూ

**జీ**వితమనే నాటకరంగవేదికమీద వేలాది పాత్రలు. ఈ పాత్రల్లో కొన్ని మీకు సజీవమై స్నేహ, కల్యాణ్‌ల 'ప్రేమాయణం'లో దర్శనం ఇస్తాయి.

ఈ 'ప్రేమాయణం'లో ఒక ముఖ్యపాత్ర కోటిరత్నమాల. సార్థక నామధేయురాలు. తను రిచ్‌అయినపుడు తన అలవాట్లూ రిచ్‌గా వుండాలంటుంది. ఆఖరికి కారుకు రంగు కూడా ఆర్నెల్లుకోసారి మార్చుకొని తన రిచ్‌నెస్ చూపిస్తేగానీ ఆవిడకు తృప్తి వుండదు. తనకున్న ఆస్తిపాస్తులను చూసుకొని ఎంత గర్వపడుతుందో, బీదరికాన్నిచూసి ఆవిడఅంతగానూ చీదరించుకొంటుంది. మరి, ఆవిడ తన ఏకైక ముద్దుపట్టి స్నేహ కోసం అలాటి ఇలాటి సంబంధం చూస్తుందా? జీవితాంతం తన కుమార్తె అష్టఐశ్వర్యాలతో తులతూగాలనేది ఆ తల్లికోరిక. ఆ కోరికతోనే ఎన్నో సంబంధాలు వెతికింది. ఒక సంబంధం చివరి వరకు వచ్చి తప్పిపోయింది. 'పోనీ, మహారాజులాటి మరో సంబంధం చూస్తానను' కొంది. ఈసారి... ఆవిడకు ఎదురైన సంబంధమూ అలాటిదే! మంచి సంబంధం అని మురిసిపోతున్న సమయంలో, తనకు కాబోయే అల్లుడు ఓ వంటలమ్మ కొడుకన్న చేదునిజం ఆమెకు తెలుస్తుంది. అంతకాలం ఆశల శిఖరాల మీద కాపురంపెట్టి, ఇష్టారాజ్యం పతాకాన్నిఎగరేసిన ఆ కోటీశ్వరురాలు ఆ నిజాన్ని ఎలా భరిస్తుంది? ఆ కన్నతల్లి గుండె చెరువయిపోదూ... సగటు కన్నతల్లి కోరికలు, ఆశలకు అచ్చమైన ప్రతి



బింబంలాటి ఈ కోటిరత్నమాల పాత్రను రమాప్రభ వున్నతంగా పోషించింది.



ఈ చిత్రంలో సూత్రధారిలాటి బ్రహ్మానందం గురించి ఎంతైనా చెప్పచ్చు. ఆయన కోటి రత్నమాల భర్త. ఓ పెద్ద ఆయిల్అండ్ గాస్ కంపెనీలో రీజినల్ మేనేజర్‌గా చేసి ఈ మధ్యే రిటైరయినారు. రిటైరయిన నాటినుంచే తనకు కష్టాలు ఆరంభమయినాయని ఆ పెద్ద మనిషి ఉద్దేశం. క్లబ్బుకు వెళ్లాలంటే వేళకు కారుండదు, ఇంటికొస్తే వడ్డించే భార్య మాటసరే, కనీసం వంటవాడూ వుండడు. 'అర్జెంటు పనేమీ లేదుగదా, ఇస్త్రీ బట్టలుకూడా ఎందుకూ' అని ఆఖరికి ఇంట్లో పనిచేసే పనిమనిషికూడా అనేస్తే ఆయనకు చిర్రెత్తుకు రాదూ? తను రిటైరయిన నాటినుంచి తనకు జరుగుతున్న అగౌరవాలకు భార్యే కారణమని, ఆమె కళ్లు తిరిగి నేలమీదకు దిగేంతవరకు ఇంటిముఖం చూడనని శపథం పట్టి క్లబ్బులో కాపురం పెట్టాడు. అదుగో, ఎదిగిన కూతురును ఇంట్లో వుంచుకొని ఇలా బాధ్యతారహితంగా ఇల్లు వదిలిపెట్టడం తప్పుకాదూ, అంటున్నారు మీరు! ఆగండాగండి... బ్రహ్మానందం సంగతి మీకు తెలీదు. ఆయన బాధ్యతెరిగిన తండ్రి. అందుకే కూతురు స్నేహకోసం తగిన సంబంధాన్నిచూశాడు. కానీ... దాన్ని భార్య కోటిరత్నమాల కొట్టి పారేసింది. తల్లిచూసిన వేరే డబ్బున్నవరుడి సంబంధాన్ని కాదని స్నేహ, తను కోరుకొనే వరుడితో పెళ్లి చేయించమని తండ్రిని కోరింది. కూతురు మనసెరిగిన తండ్రిగా బ్రహ్మానందం సరేనన్నాడు. ఎన్నో పాచికలు, పథకాలు వేశాడు. స్వయంగా వేషం వేసి ఎందరిచేతో వేయించి నేపథ్యంలోనే



వుండి నాటకాన్ని రక్తి కట్టించాడు. ఈ బ్రహ్మానందం పాత్రలో సత్యనారాయణ నటన ఈ ప్రేమాయణానికే ఆయువుపట్టు.

అవునూ... అసలు 'ప్రేమాయణం'లో ప్రేమికుల పాత్రేమిటి? అదీ చూద్దాం. కోటీశ్వరురాలు కోటిరత్నమాల కూతురే అయినా స్నేహావన్నీ ఆధునిక భావాలు. కాలేజీలో పరిచయం అయిన కల్యాణ్‌మీద మనసుపడి, ప్రేమలోనూ పడింది. దాన్నికల్యాణంగా రూపుదిద్దుకోవాలని నిర్ణయించుకొంది. ఆకాశాన్ని అంటే అంతస్థులో వుండే అల్లుణ్ని తెచ్చుకోవాలనే తల్లి కోరికా ఆ అమ్మాయికి తెలుసు. ప్రేమించే మనసుకు అది తెలీదు. కనుకనే- పేదవాడైనా ప్రేమించిన వాడినే పెళ్లాడాలని సాహసాలకు ఒడిగట్టింది. తల్లి మనసు కష్టపడినా, ప్రేమించే మనసుకు పేదరికం లేదనే ఆధునిక జీవిత సత్యాన్ని తల్లికి తెలియచెప్పాలని ఆశించిన స్నేహపాత్రను నూతన నటి జయశ్రీ పోషించింది.



స్నేహలాటికలవారి బిడ్డమనను కొల్లగొట్టిన పాత్ర కల్యాణ్‌ది. స్నేహతో ప్రేమలో పడేనాటికి అతనికి ఆమె వెనుకవున్న ఆస్తిపాస్తుల గురించి తెలీవు. ఎదురుగా కనిపించే కొండంత అందం, దాన్ని మరింతగా పదిలపర్చుకొన్న మంచి మనసు- ఇవే స్నేహలో కల్యాణ్‌కు కనిపించిన అందాలు. అవే అతనికి బంధాలయినాయి. ప్రేమలోపడ్డాడు. స్నేహను చేపట్టేందుకు ముఖానికి రంగువేసుకొని వేషం మార్చాడు, సాహసం చేశాడు... అవిశ్రాంతంగా శ్రమించి 'ఏకలవ్య' దీక్షతో లక్ష్యం సాధించే నేటికాలం కుర్రాళకు ప్రతీకలాటి కల్యాణ్‌పాత్రను నరేష్ ప్రశంసాత్మకంగా పోషించాడు.



ఈ 'ప్రేమాయణం'లో అన్నపూర్ణమ్మది ఓ జాలి కథ. భర్తనుపోగొట్టుకున్నా గుండె దిటవు చేసుకొని కొడుకు కల్యాణ్‌ను పోషించింది. ఆ ఇంటా ఈ ఇంటా వంటలు చేసి, అప్పడాలు అమ్మి ఆ తల్లి కొడుకును యం.బి.ఎ చదివించింది. కొడుకు చదువుతోబాటు, ప్రేమపాఠాలూ నేర్చుకొన్నాడని ఆ పిచ్చితల్లికి తెలీదు! తన ఆశలు ఏమిటో ఆమె ఎవ్వరికీ చెప్పలేదు. అలాటిది ఓరోజు- 'ఈ యువరాజావారు నాకు కాబోయే అల్లుడు' అంటూ తనకొడుకునే, కోటిరత్నమాల స్నేహితురాళ్లకు పరిచయం చేస్తొంటే- ఆ త్యాగమయి గుండె బద్దలయిపోయింది. అయినా, గుండెల్లో కడలిని మించిన ఆవేదన నింపుకొని కొడుకును అర్థం చేసుకొనే ప్రయత్నం చేసింది. కష్టాల కొలిమిలోకాల, పరిసితులతో రాజీపడి. జీవితాన్ని యథాతథంగా స్వీకరించగల సంయమనాన్ని సంతరించుకొన్న ఈ అన్నపూర్ణమ్మ పాత్రకు ప్రముఖ నటి కాంచన ప్రాణం పోసింది.





ఈ చిత్రంలో ఇవేకావు. మరెన్నో పాత్రలూ వున్నాయి. మచ్చుకు మరో పాత్ర- లావణ్యను చూడండి. కోటిరత్నమాలకు ఈవిడే క్లోజ్ ఫ్రెండ్. ఆమెతో సరితూగగల ఆస్తిపాస్తులూ వున్నాయి. పైగా అమెరికా నుంచి రానున్న కొడుకు హనుమంతరావు ఉరఫ్ హనీ కూడా వున్నాడు. ఆవిడ మీద కోపంవచ్చి వాళ్లాయిన ఆత్మహత్య చేసుకొన్నాడుగానీ హొటల్లో బేరర్‌గా చేరి ఆమెకు అవమానం తేలేదు. అంత భేషజం వున్న ఆ లావణ్యకు- అచ్చం హొటల్‌లో బేరర్‌గా చేస్తున్న బ్రహ్మానందం కూతురి సంబంధం ఎందుకు నచ్చుతుంది? ఆస్తికి అంతస్థుకేకాదు, ఆఖరికి వాటి ప్రదర్శనకు సైతం పెద్దపీట వేసే కొందరు శ్రీమ(ం)తుల బుద్ధులకు అద్దంపట్టే ఈ పాత్రలో మీకు వై.విజయ కనిపిస్తారు.






ఇక స్నేహితుడి కోసం ఏమైనా చేసే ప్రాణ మిత్రుడు జంబులింగం పాత్రలో కోట శ్రీనివాస రావు తన బాణీ తనదేనని నిరూపించుకొన్నారు. క్లబ్బులో పనిచేసే పకీరు పాత్రలో పి.యల్.నారాయణ ఆకట్టుకొంటారు. వైద్యం చేస్తూ రోగుల రోగాలు నయం చెయ్యటమేకాదు, వారికొచ్చిన సమస్యల్నీ ట్రీట్ చెయ్యగల డాక్టర్‌గా తంబు; స్వామి భక్తితో ఉడతాభక్తి సేవచేసే మేనేజర్‌గా మిశ్రో; అమ్మగారిదే రాజ్యం అయితే ఆవిడమాటకే తాళం వేసే వంటవాడు చలమయ్యగా పొట్టి ప్రసాద్... అంతెందుకు... నిత్యజీవితంలో మనకెదురయ్యే పలు మనస్తత్వాలు, వ్యక్తిత్వాలకు ప్రతిబింబాలవంటి పాత్రలెన్నో 'ప్రేమాయణం'లో ప్రముఖ నటీనటుల ద్వారా మీముందు నిలుస్తాయి.

ఈ 'ప్రేమాయణం'లోని పాత్రల్ని పలికించింది గణేష్‌పాత్రో. పాటల్ని చిలికింది వేటూరి సుందరరామమూర్తి. ఆ పాటలకు స్వరాలంకరణచేసింది యస్.పి. బాలసుబ్రహ్మణ్యం. పాత్రలను తెరమీదకు తెచ్చిన ఛాయాగ్రాహకుడు యం.వి. రఘు; పాత్రల చేత ఆటలాడించింది శివసుబ్రహ్మణ్యం, కూర్పు గౌతంరాజు, కళ: భాస్కరరాజు.



# ప్రేమాయణం

కథనల్లి, తెరమీద పాత్రలను, కథను నడిపించిన దర్శకుడు శ్రీధర్.

నిర్మాణ నిర్వహణ: అట్లూరి రామారావు.
నిర్మాత: రామోజీరావు.
ఈచిత్రం మయూరి విడుదల.


శ్రీధర్


గణేష్‌పాత్రో


యం.వి. రఘు


వేటూరి సుందరరామమూర్తి


యస్.పి. బాలసుబ్రహ్మణ్యం


గౌతంరాజు



శివసుబ్రహ్మణ్యం


భాస్కరరాజు


యస్.పి. శైలజ


అట్లూరి రామారావు




# అందాన్ని అందించడం ప్రకృతి సహజం.
# అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీ ముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.




కేమియో
బ్యూటీ సోప్

మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్త మలుపు ఇస్తుంది కేమియో



జయలక్ష్మి వారి ఉత్పాదన

ACIL/025/86-T




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మక్కీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయడం మంచిది.

1. సమీక్ష'' అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతురప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

### ఫిబ్రవరి 'చతుర' నవల అడవి

సమీక్షకుని పేరు: ....................................................

చిరునామా: ....................................................

....................................................

....................................................

....................................................

# చతుర ప్రపంచం

## ముత్యాల మాటలు

మంచి మాటలు చెప్పిన వాళ్లకు రాజులు అక్షర లక్షలిచ్చి విలువకట్టారని చదువుకున్నాం. సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ- అని నేస్తాలు మురిసిపోగా చూశాం. ఈ రెండు విషయాలనూ జోడిస్తే ఎలా వుంటుందంటే, అందుకు ప్రత్యక్ష ఉదాహరణ మాలీకేయీ.

ఇంగ్లాండ్‌కు చెందిన మాలీకేయీ అనే రచయిత్రి తను రాసిన 'ద ఫార్ పెవిలియన్స్' అనే సుదీర్ఘమైన రచన తాలూకు రాతప్రతిని తనకు హితుడూ, స్నేహితుడూ, అంతకు ముందు మధ్యవర్తి (ఏజెంటూ) అయిన పాల్ స్కాట్ అనే ఆయనకిచ్చి, ఆ పుస్తకంపై అతని అభిప్రాయాన్ని కోరింది. మూడురోజుల తరువాత ఆయన ఫోన్‌చేసి, ''ఈ పుస్తకాన్ని వర్ణించటానికి ఒకే ఒక్కమాట వుంది- శభాష్'' అని చెప్పాడుట.

ఆ తరువాత అమెరికా ప్రచురణకర్తలు ఈ పుస్తకాన్ని హెచ్చు మొత్తాన్నిచ్చి హక్కుల్ని కొనుక్కున్నారు. అప్పుడు పాల్‌స్కాట్ అమెరికాలో వున్నాడు. పాల్‌స్కాట్‌కు మాలీకేయీ ఈ విషయం ఫోన్‌చేసి చెప్పినప్పుడు వారి మధ్య సంభాషణ ఇలా జరిగింది-

''నీకోసం నువ్వు ఏమైనా ప్రత్యేకమైనవి కొనుక్కో, ఈ డబ్బుతో'' అన్నాడు స్కాట్.

''నాకు అవసరమైనవి ఏమిటంటారు?'' అని కేయీ ప్రశ్న.

''నీకోసం వజ్రాలు కొనుక్కో'' అని సలహా ఇచ్చాడు స్కాట్.

ఆ తరువాత స్కాట్ క్యాన్సర్‌కు గురయి, మరణానికి చేరువలో వున్నాడని తెలిసింది. అది విన్నప్పట్నించీ కేయీ ప్రతిరోజూ స్కాట్‌కు ట్రాన్స్ అట్లాంటిక్ ఫోన్‌కాల్స్ చేసి, అతనితో మాట్లాడసాగింది. ఇలా కొన్నిరోజులు గడిచాక ''మాలీ నువ్వీ ఫోన్ చేయటం మానుకో. నీ రచన ద్వారా వచ్చిన డబ్బంతా ఈ ఫోన్ల ఖర్చుకే కరిగిపోతుంది'' అని హెచ్చరించాడు స్కాట్.

''కానీ, నా డబ్బునెలా ఖర్చు చేయాలని అడిగినప్పుడు ఇది మీరు చెప్పిన పద్ధతే. మీరు నన్ను వజ్రాలు కొనుక్కోమన్నారు. మీ మాటలే నాకు వజ్రాలు'' అందిట మాలీకేయీ.



# చతుర కథలు



## పీడ

మన్మథరావుకు భార్యపైన ఎంతో నమ్మకం, తనని తప్ప పరపురుషుణ్ని కన్నెత్తి చూడదని గొప్పగా చెప్పుకుంటాడందరితో. అలాంటివాడు ఓరోజు పిడుగులాంటి వార్త విన్నాడు. తన చిరకాల మిత్రుడు కామరాజు ఈ మధ్య తన భార్యతో చనువుగా మసలుతున్నాడనీ, తను ఇంట్లో లేని సమయంలో వచ్చి భార్యతో చాలా సేపు బాతాఖానీ కొడుతున్నాడనీను. పైగా వాళ్ల నవ్వులు చుట్టుపక్కల ఇళ్లల్లోకి కూడా వినిపిస్తున్నాయని కంప్లయింట్లు రావడంతో ఇంకా మండిపడ్డాడు మన్మథరావు.

ఎలాగైనాసరే ఈ విషయంలో తాడోపేడో తేల్చుకోవాలనుకున్నాడు. రోజంతా కూర్చొని ఆలోచించీ ఆలోచించీ జుట్టంతా పీక్కున్నాడు. అయినా అయిడియారాలేదు. భార్య వనజాక్షిని పిసరంత కూడా అనుమానించాల్సిన అవసరం రాలేదు. 'కామరాజుకే ఓ డోసిస్తే సరి' అనుకున్నాడు చివరికి.

మర్నాడు ఇంటికొచ్చిన కామరాజును చూడ

గానే చేతిలో రివాల్వర్‌తో అతనిముందుకెళ్ళి, ''మరోసారి నాభార్య చుట్టూ తిరిగావంటే కాల్చి పారేస్తాను. రాస్కెల్!'' అన్నాడు గుడ్లురిమి చూస్తూ.

కామరాజేం తక్కువ తినలేదు. జేబులో దాచుకున్న పిస్టల్‌ని బయటికి తీసి, ''ఒరేయ్ ఫూల్! నీ భార్యకు నేనంటేనే ఇష్టం. అందుకే అలా ఉంటోంది నాతో. నీకంతగా అనుమానం ఉంటే ఆమెకెవరంటే ఇష్టమో ఇప్పుడే తేల్చుకుందాం'' అన్నాడు కోపంగా.

ఇద్దరూ, ''వనజాక్షికి నేనంటేనే ప్రేమని'' మనసులోనే అనుకొని, గాలిలో ఓ సారి తుపాకులను పేల్చి నేలమీద బోర్లాపడి పోయారు. ఎవరిమీదపడి ఏడిస్తే వారిపైన వనజాక్షికి ప్రేమ ఉన్నట్టని ఒప్పందంకుదుర్చుకున్నారు.

గాలిలో తుపాకీ పేలుళ్లు విన్న వనజాక్షి నేలపై పడివున్న మన్మథరావు, కామరాజుల కేసి ఓసారి చూసి పెద్దగా అరిచింది ''పీడ విరగడైంది. ఇద్దరూ ఒకేసారి చచ్చారు'' అని.

తారెత్తిపోయిన మన్మథరావు, కామరాజు అయోమయంగా నిలువు గుడ్లేసుకొని ఒకరికేసి ఒకరు చూస్తూ ఉండిపోయారు.

- వీణ

# రహస్యం

ఇంటిముందు ఆగిన రిక్షాలోంచి దిగింది వనజ.

''నువ్వటే వనజా? అన్నయ్య బావున్నాడా?'' ఇంట్లోంచి బయటకొచ్చిన సుగుణ అడిగింది వనజ చేతిలోని సూట్‌కేసు అందుకుంటూ.

రిక్షావాడికి డబ్బులిచ్చి- ''బాగానే ఉన్నాడత్తయ్యా'' అంది వనజ ఇంట్లోకి దారితీస్తూ.

సుగుణ భర్త మెడికల్ రిప్రజెంటేటివ్. వారంరోజులైంది టూర్‌కెళ్ళి. సుగుణకు, వనజను చూడగానే ప్రాణంలేచి వచ్చినట్లయింది. మీ మామయ్య టూర్‌కెళ్లారు. కానీ నీతో మంచి కాలక్షేపం అంది వనజతో ఆనందంగా.

తెల్లవారి మేనకోడలికి టిఫిన్‌వడ్డిస్తూ ''ఎక్కడికయినా సరదాగా వెళ్లొద్దామా?'' అనడగింది సుగుణ.

''హైదరాబాదు ఎన్నిసార్లు వచ్చినా అసలు ఊరే సరిగా చూడలేదు. ఈ సారి సిటీ అంతా చూపించత్తయ్యా!'' అంది వనజ.



"అయితే పద!" అంటూ పదినిముషాల్లో డ్రెస్ చేసుకొని ఇంటికి తాళంపెట్టి, రోడ్డెక్కింది సుగుణ వనజతో.

ముందుగా బిర్లామందిర్‌కెళ్లారు. అక్కడ జనం కిటకిటలాడుతున్నారు.

తన హేండ్‌బేగ్‌లోనుండి మడతపెట్టివున్న ఓ ఖరీదైన గులాబిరంగు కాగితాన్ని తీసి వాలంటీర్‌కిచ్చింది సుగుణ.

ఆ కాయితం విప్పి చదువుకొన్న ఆ వాలంటీర్ దగ్గరుండి వాళ్ళిద్దరికీ దైవదర్శనం చేయించాడు.

తరువాత మార్నింగ్‌షో కెళ్లారు. హాలుమేనేజర్ దగ్గరకెళ్ళి మడతపెట్టిన ఆ గులాబి రంగు కాయితం అందించింది సుగుణ.

దాన్ని చదవగానే సుగుణ, వనజను లోనికి పంపించడమేకాక ఇంటర్‌వెల్‌లో రిఫ్రెష్‌మెంట్స్‌కూడా ఏర్పాటు చేశాడు మేనేజరు.

సినిమా అయ్యాక జూకి వెళ్లారు. జూ అధికారి దగ్గరకెళ్ళి సుగుణ మళ్ళీ గులాబి రంగు కాయితం అందించింది.

దాన్ని చదవగానే వాళ్లకు నమస్కారంపెట్టి ఇద్దర్నీ లోపలికి పంపించడమేకాక దగ్గరుండి అన్నీ వివరంగా చెబుతూ జూ అంతా చూపించాడా అధికారి.

అతడికి థాంక్స్ చెప్పి బయల్దేరారు.

సాలర్‌జంగ్ మ్యూజియంలోకూడా షరా మామూలే! సుగుణ అందించిన గులాబిరంగు కాయితం చూస్తూనే మ్యూజియం అధికార్లు ఎంతో మర్యాదచేసి, మ్యూజియం అంతా చూపించారు శ్రద్ధగా.

అక్కణ్నుంచి హొటల్‌కి, అటు తర్వాత పబ్లిక్‌గార్డెన్స్‌కి, ఆఖరికి సర్కస్‌దగ్గరకు చేరుకున్నారు వాళ్ళిద్దరు. ప్రతిచోట సుగుణ అందించిన గులాబిరంగు కాయితం చూపించగానే పన్లు చకచకా అయిపోయాయి.

ఉండబట్టలేక అడిగేసింది వనజ- "అత్తయ్యా! నీకింత పలుకుబడివుందని నాకు తెలియనే తెలియదు! అన్ని రికమండేషన్‌లెటర్లు సంపాదించడం అంటే మాటలా...?"



"ఆ గులాబీరంగు కాయితాలు రికమండేషన్ లెటర్లని ఎవరుచెప్పారు నీకు...?" తాపీగా అడిగింది సుగుణ.

"మరి...?" ఆశ్చర్యంగా చూసింది వనజ.

"మీ మామయ్య టూర్‌లకెళ్లినప్పుడు అక్కణ్నుంచి నాకు రాసిన ఉత్తరాలు అవి"

"వాళ్లంతా ఆ ఉత్తరాలు చదివి మనకి సాయం ఎలాచేశారు...?"

"చదివారా...? సింగినాదమా? ఆ బ్రహ్మారాతని అర్ధంచేసుకోవడం వాళ్లకేం చేతనవును. మనలాటి హైసొసైటీలేడీస్‌ముందు తమ పరువు కాపాడుకోవటం కోసం అలా చేశారు. అంతే! సాధారణంగా రికమండేషన్ లెటర్లలో అవి తెచ్చిఇచ్చిన వాళ్లకి సాయంచేయమని ఉంటుంది కదా! అదే ఉద్దేశంతో మనకి వాళ్ళు సాయపడ్డారు!" అంది సుగుణ తాపీగా.

-- కె. శ్రావ్య

## సలహా

ఓ సాయంవేళ సుబ్బారావు, వెంకట్రావు కలిశారు.

"ఏంవోయ్! ఎక్కడ నుంచి రావడం... ఆఫీసు నుంచేనా?" అడిగాడు వెంకట్రావు-సుబ్బారావును.

"ఆఁ....."

"ఏమిటోయ్! బాగా అలిసిపోయినట్టు కన్పిస్తున్నావ్? ఆఫీసులో వర్క్ ఎక్కువగా వుంటోందా... ఏం?"

"ఊఁ..."

"మరీ అంత వెట్టిమనిషిలా పనిచేస్తే ఎలాగోయ్... కొంచెం మన స్వార్ధం మనంచూసుకోవాలి. అప్పుడప్పుడు పని నుంచి ఎస్కేప్ అయ్యేందుకు ట్రై చేయాలి సుమా... కాకపోతే ఇదిగో ఇలానే వళ్ళు హూనమైపోతుంది" హితవు చెప్పాడు వెంకట్రావు.

"అవును"

"నన్ను చూడు... నామట్టుకు నేను అలా పైపైన పనిచేసినట్టు కనిపిస్తానేగానీ అట్టే

కష్టపడకుండా జాగ్రత్తపడుతుంటా... ఆఫీసరు వెధవలకిమాత్రం 'ఈ వెంకట్రావు భలే కష్ట జీవి సుమా' అన్న ఫీలింగు కల్పిస్తా''

''ఓహో''

''అథవా... ఒకవేళ ఏనాడైనా కష్టపడ్డానే అనుకో... దానికో ట్రిక్కు వుపయోగించి నా అలసటనంతా చిటికెలో పోగొట్టుకుంటా...''

''ఎలా?''

''అదిగో ఆ పాయింట్‌కే వస్తుంట. నేను ప్రస్తుతం నీఅలసట మాయం చేసేందుకు ఇవ్వబోయే చిట్కా కూడా ఇదే''

''సరే... చెప్పు''

''ఏంలేదోయ్... అదేం పెద్ద దేవరహస్యంకాదు. అలా బార్‌వైపు వెళ్ళి రెండు పెగ్గుల బ్రాందీ వేస్కో. ఇక అంతే... అలసట గిలసట నీ దరిదాపులకురాదు. ఇంటికి వెళ్ళగానే నిద్ర పట్టేస్తుంది. రేపటికి ఫ్రెష్‌గా వుంటుంది''

''ఊఁ...''

''నేను చెప్పిన చిట్కామీద నీకు నమ్మకం కుదిరినట్టులేదు. ముభావంగా వున్నావు. ఒక్కసారి చేసి చూడు... ఇక జన్మంతా నా నామస్మరణే చేస్తావు. ఈ విషయం నేను బాండ్ పేపర్ మీద రాసిస్తా''

''ఆఁ...''

''నా మాటవిను. పద... వెంటనే బార్ వైపు బయల్దేరు. నేను చెప్పిన సూత్రం పాటించు-బాగుపడతావ్''

''బోడి సలహాలన్నీ ఇస్తున్నావ్... నేనేం వెర్రి వెధవననుకున్నావా! నీపని నువు చూసుకో... ప్రతి వెధవా సలహాలిచ్చేవాడే'' మండిపడ్డాడు సుబ్బారావు-వెంకట్రావుమీద.

ఆ క్షణంలో సుబ్బారావు నోటినుంచి గుప్పున బ్రాందీ వాసన మహావేగంతో వచ్చి వెంకట్రావు ముక్కుపుటాల్లోంచి నసాళందాకా దూసుకుపోయింది.

-సురేష్

# రాగాన్వేషణపై చతుర సమీక్షలు

**'చతుర' నవలల పోటీలో ప్రత్యేక ప్రశంసను పొంది డిశంబర్ సంచికలో ప్రచురితమైన మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్ రచన 'రాగాన్వేషణ'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.**




## రీసెర్చిలా సాగిన నవల

*(ప్రథమ బహుమతి రూ. 100 పొందిన సమీక్ష)*

"రాగాన్వేషణ" ఒక నవలలాకాక రీసెర్చిలాగా సాగింది. చదువుతున్నప్పుడు నవల చదువుతున్నట్లుకాక జీవితాలను స్టడీచేస్తున్నట్లుగా అనిపించడం విశేషం.

అయితే రచయిత్రి నవలలో వ్యక్తిపరమైన శాంతిని మాత్రమే ప్రస్తావించి, సంఘపరమైన శాంతిని విస్మరించారు. మానవ మనుగడకు వ్యక్తిపరమైన శాంతి ఎంత అవసరమో సంఘపరమైన శాంతి కూడా అంతే అవసరం! హింస నేడు రాజ్యమేలుతోంది. ఇందుకు నిన్నటి అస్సాం, నేటి పంజాబ్ ప్రత్యక్ష తార్కాణాలు. హింస రూపుమాయకపోతే అహింసకు తావులేదు. అహింస నెలకొననిదే శాంతికి ఆస్కారంలేదు.

మనలో నైతిక విలువలు నానాటికీ దిగజారిపోతున్నాయన్నది ఎవరూ కాదనలేని నిజం. మనలో నీతినిజాయితీలు, మంచితనం, మానవత్వం, దయాదాక్షిణ్యాలు క్రమక్రమంగా క్షీణించిపోతున్నాయి. వీటికితోడు అవినీతి, అక్రమాలు, అన్యాయాలు, దోపిడీలు, దౌర్జన్యాలు, హింసాకాండ పెచ్చుపెరిగిపోతున్నాయి. వీటన్నిటికీ మారుతున్న కాలమాన పరిస్థితులు మూలకారణమని సరిపెట్టుకోవడం ఆత్మవంచనే కాగలదు. కులమతాది సమాజ బలహీనతలకు, రాగద్వేషాది మానవ సహజ బలహీనతలకు మనం అతీతులం కాలేకపోవడమే ఈనాడు మనం ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలకు మూలకారణమన్న నిజాన్ని మనం గుర్తించాలి.

ఇంతటి తీవ్ర పరిస్థితులలో, పక్కవాడు చచ్చిపోతున్నాను, రక్షించమని మొత్తుకున్నా ఆలకించడానికి కూడా తీరికలేని ఈ స్పీడు యుగంలో కూడా, శాంతి బీజాలను అన్వేషించేవారు నూటికో కోటికో ఒక్కరో ఇద్దరో ఉంటారనడానికి ప్రొఫెసర్ మూర్తి, పద్మ, ప్రియ, శ్రీరామ్, ప్రవీణ్ పాత్రలు మంచి ఉదాహరణ.

ప్రొఫెసర్ మూర్తి, వారి శిష్యుల లేదా అటువంటివారి కృషి ఎంతవరకు ఫలిస్తుందన్న విషయం అలా ఉంచితే, రచయిత్రి, నవలకు ఎన్నుకున్న కథ ఎంతో ఉదాత్తమైనది. నవలలో విభిన్న జీవితాల కథాచిత్రణ ఉంది. వరకట్న దురంతాలు, పునర్వివాహాలు, బాల్యవివాహాలు, ఆర్థిక అసమానతలు, అవినీతి వంటి సమస్యలను, కుటుంబపరంగా, సంఘపరంగా వ్యక్తుల మధ్య తలయెత్తుతున్న రాగద్వేషాలను, అదేవిధంగా వ్యక్తుల మధ్య పరస్పర అవగాహనాలోపంవల్ల ఏర్పడుతున్న చిక్కులను, సమస్యలను చిత్రించడంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు. ఆయా సమస్యలు, నవల పరిధి దృష్ట్యానే అయినప్పటికీ, వెనువెంటనే పరిష్కరింపబడినట్లు చూపించడం మాత్రం అసహజంగా ఉంది. ఇందుకు ప్రధాన కారణం నవలలో ఎక్కువ సమస్యలకు తావు కల్పించడమే. దీనికిబదులు తక్కువ




సమస్యలను తీసుకొని ఒక క్రమబద్ధమైనరీతిలో అవి పరిష్కరింపబడినట్లు, ఆయా వ్యక్తుల ప్రవర్తనలో కాలక్రమేణా మార్పు కలిగినట్లు చూపించి ఉంటే బాగుండేది. ఎందుకంటే సమస్యలకు పరిష్కారంకాని, వ్యక్తుల ప్రవర్తనలో మార్పుకాని వెనువెంటనే ఎంత మాత్రమూ సాధ్యంకాదు. కాని ఎక్కువ సందర్భాలలో ఇలాగే జరిగింది.

ఈ నవలను కేవలం కాలక్షేపంకోసం కాక రచయిత్రి ఏ ఆశయంతో, ఏ ఉద్దేశంతో రాశారో అదే ఉద్దేశంతో చదివినప్పుడు ఈ నవలలోని సందేశం అవగతమవుతుంది.

-తమ్మినీడి సత్యప్రసాదరావు, అండలూరు

## ఈ స్పీడ్‌యుగంలో...

**(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)**

ఎంత చదువుతున్నా, డిగ్రీలు, రీసెర్చిలు చేసినాసరే తను, తన సమస్యలు, తన కుటుంబం అనే స్వార్థంతో రొటీన్ వర్క్‌లోపడి కొట్టుకుంటున్న నేటి యువతరానికి దేశాన్ని గురించి, సమాజం గురించి, ప్రజల గురించి ఆలోచించే తీరికెక్కడిది? అలాంటి యువతరాన్ని చైతన్యవంతం చేసేలా, ఒక్కక్షణమైనా ఆలోచింపచేసేదిలా ఉంది ఈ "రాగాన్వేషణ" నవల. ప్రతి యువతీయువకునకు తనవంతు బాధ్యతను గుర్తు చేస్తూ నవల రాయటంలో రచయిత్రి సాహసించారని చెప్పవచ్చు.

ప్రేమకథలతోను, త్యాగాలతో, సెక్స్‌తో, క్రైమ్‌తో పుచ్చిపోయి ఉన్న నేటి నవలాసాహిత్యానికి మకుటాయమానమైనదీ "రాగాన్వేషణ". క్షణం తీరికలేక చుట్టూ ఉన్నవారిని పరిశీలించటం, పరిస్థితుల్ని అర్థం చేసుకోవడం, మంచిగా ఎవరి మనసు నొచ్చుకోకుండా ప్రవర్తించటమనేది ఈ స్పీడ్‌యుగంలో అసాధ్యం. ప్రొఫెసర్ మూర్తిగారి లాంటి నిస్వార్థ సంఘ సంస్కర్తలు ఉన్నారనడం అబద్ధం కాదుగానీ అతిశయోక్తే. వెళ్ళిన ప్రతి చోటా అపజయాలు లేకుండా ఒడిదుడుకులు లేకుండా పద్మ, శ్రీరామ్, ప్రవీణ్, ప్రియలు ఆరు నెలల కాలం విజయవంతంగా గడిపిరావటం రచయిత్రి ఊహాగానమే. ఒక గంట బస్సు ప్రయాణంలోనే అనేక చేదు అనుభవాల్ని ఎదుర్కోవలసిన స్థితిలో ఉన్న సమాజాన్ని తత్వశాస్త్రంతో వేదాంతంతో మార్చటం, సుఖదుఃఖాల గురించి, అవినీతి గురించి చెప్పడం, మార్చుకోరటం అత్యాశే. అయితే రచయిత్రి స్త్రీల సమస్యల్ని అద్దంపట్టినట్లు చూపడంలో కృతకృత్యులయ్యారు. ఎన్ని యుగాలు మారినా, ఎంత నాగరికత ముదిరినా 'ఆడదాని దుఃఖం అనంత'మనే రచయిత్రి భావం అవగాహనతో కూడుకున్నదే.

చివరివరకూ వదలకుండా చదివించిన నవల చివర్లో కాస్త అసంతృప్తి కల్గించిందనే చెప్పాలి. కారణం- జీవితంలో నీతిని, సచ్ఛీలతను కోరుతూ సమాజం కోసం జీవితాన్ని ధారపోయగల్గిన ఆ యువతీయువకుల జీవితాలకు పరిపూర్ణత లేకపోవటమే.

-మద్దిరాల అంజనీదేవి, గణపవరం

## ఉపరితల స్పర్శ మాత్రమే

**(తృతీయ బహుమతి రూ. 50 పొందిన సమీక్ష)**

దుఃఖం, బాధ, శోకం, అసంతృప్తి, అవినీతి, లంచగొండితనం, ఈర్ష్య, స్వార్థం, కుళ్ళు, అన్యాయం, మోసం, ద్రోహం- వీటన్నింటినీ మథించి, శోధించి "రాగాన్వేషణ" చేసి సమానత, తృప్తి, సచ్ఛీలత, మానవతలను కనుగొని తద్వారా దేశసౌభాగ్యానికేగాక విశ్వశాంతి స్థాపనకు సైతం దోహదం చేయాలంటే ఢిల్లీ, బొంబాయి, మద్రాసు, కలకత్తా, బెజవాడవంటి నగరాల్లో "రీసెర్చి" ప్రారంభించాలా? అక్కడైతేనే రీసెర్చి విజయవంతమవుతుందా? దేశానికి వెన్నెముకగా నిలిచిన రైతన్నలు నివసించే పల్లెప్రాంతాల్లో రైతుపడే కష్టాలు భూస్వాముల దౌర్జన్యం, అగ్రకులాల ఆగ్రహానికి గురై విలవిలలాడుతున్న బాధితుల కన్నీటిధారలలో, పతితుల రక్తమాంసాల్లో రీసెర్చి చేస్తే పైనాలుగు శాంతిబీజాల్లో ఏ ఒక్కబీజం కూడా లభించదా? రాగాన్వేషణ ఎందుకూ కొరగాని దౌతుందా? విఫలం చెందుతుందా? అయినా ఆరుమాసాల అతికొద్ది వ్యవధిలోనే ఉత్తర, దక్షిణ

భారతదేశాల్ని ఆసాంతం సందర్శించడం, శాంతి బీజాలన్నింటినీ సాధించడం సాధ్యమా? అసలు ఉత్తర భారతదేశంలోగానీ, దక్షిణ భారతదేశంలోగానీ ఏ ఒక్క పల్లె ప్రాంతమూ లేదా?

నిష్పక్షపాతంగా "రాగాన్వేషణ" జరిగి ఉంటే దాని ఫలితం మరోవిధంగా, పటిష్ఠంగా ఉండేదిగదా!

ప్రియ, ప్రవీణ్, శ్రీరాం, పద్మలు తలపెట్టిన శాంతి బీజాన్వేషణ గూర్చి ప్రొఫెసర్‌గారు చెబుతున్నప్పుడు ఇది చాలా కష్టతరమైన విషయం అని పాఠకుడనుకుంటాడు. కాని వీళ్ళు ఎక్కడా కష్టాలకు లోనైనట్లు కన్పించదు. ఎందుకంటే అన్వేషకులకు కావలసిన పరిస్థితులను రచయిత్రే తీసుకొచ్చి పడేసారు వాళ్ళ ముందు. అంతేకానీ ఆయా పరిసరాలకు వారిని పంపలేకపోయారు. సూక్ష్మంగా తెలుస్తున్న రచయిత్రి పరకాయ ప్రవేశం ఎవరికీ నచ్చలేదు. కథలో చెప్పాలనుకున్న విషయం ప్రయో'జన' కరమైనదే. అయితే చెప్పదలచుకున్న విషయాన్ని చెప్పడంకోసం పడిన అనవసర తాపత్రయంవల్ల సహజత్వానికి, వాస్తవికతకు స్థానం లేకుండాపోయింది. ఉదాహరణకు- పద్మ జాబ్‌చేయాలని అనుకున్న వెంటనే జాబ్‌లో జాయినైపోతుంది. ఉద్యోగం చేయాలనుకోవడానికీ, ఆ ఉద్యోగం దొరకడానికీ మధ్య ఏ సమస్యా, ఏ కష్టమూ, ఏ శ్రమా ఉండదు. పాత్రలు ఉద్యోగం చేయాలనుకోవడమే తరువాయి జాబ్‌లో జాయినవవలసిందే! ఈ దేశంలో నిరుద్యోగ సమస్య అంతగా సమసిపోయిందా? సమగ్రత లోపించిన రచనలు పాఠక హృదయాన్ని పెనవేసుకోలేవు. కేవలం ఉపరితలస్పర్శ పనికిరాదు. సమాజహృదయంలోకి చొచ్చుకొనిపోయి అక్కడ ప్రజల మధ్య తిరుగుతూ రాస్తేనే ఆ రచనలు చదివినవారు కొత్త ఆలోచనలను సంతరించుకోగలరు. ఈ కథవల్ల పాఠకుడి ఆలోచన సమాజ ఉపరితలం మీద మాత్రమే సంచరిస్తుందని రచయిత్రి గమనించాలి.

కె.గణేష్‌వరరావు, కొత్తగూడెం.

## రంగుల కల

*(రూ. 25 బహుమతి పొందిన సమీక్ష)*

డిసెంబరు నెల 'చతుర' నవల "రాగాన్వేషణ" ఒక రమ్యమైన, హృదయరంజకమైన ఊహాగానం, రంగులకల. అంతకు మించి వాస్తవికతలవలేశం కూడా లేదు. రచయిత్రి తనకు నచ్చిన తాత్విక భావాలకు ప్రతీకలుగా పాత్రల్ని కల్పించారేగాని ఆ పాత్రలకు వాస్తవికతా లక్షణాలను జోడించలేకపోయారు. నిజానికీ రచనలో నవలకుండవలసిన లక్షణాలే లేవు. ఓ రచయిత తాను పరిశీలించిన వ్యక్తుల జీవితాల్లోని ముఖ్యాంశాలను చిన్నచిన్న బిట్స్‌గా డైరీలో రాసుకున్నట్టుగా ఉన్నాయి. సన్నివేశాలుగా అనేకవిధాలైన జీవితశకలాలు ఇందులో చిత్రించినా దేనికీ సమగ్రత సిద్ధించలేదు. ఏ ఒక్క కుటుంబగాథ కూడా పాఠకుని హృదయానికి తగిలేంత కళాత్మకంగా లేదు. ఇందులో చర్చించిన తాత్విక భావాలు గొప్పవే. అయితే ఆ భావాలను ప్రచారంచెయ్యడం కోసమే పాత్రల్నీ, సన్నివేశాల్నీ కల్పిస్తే నవల అనేది కృతకంగా ఉంటుందనేందుకు ఈ రచన ఓ ఉదాహరణ. ఓ నలుగురు రీసెర్చి స్టూడెంట్లు సలహాలిచ్చినంత మాత్రాన సాంఘిక సమస్యలూ, రుగ్మతలూ ఈ నవలలో చూపినంత సులువుగా పరిష్కారమైపోతాయంటే నమ్మశక్యంకాకుండా ఉంది. రచన బాగున్నా మొత్తం మీద ఏదో అసహజత కృతకత్వం ధ్వనించిందని చెప్పడానికి విచారిస్తున్నాను.

- ఈదుపల్లి వెంకటేశ్వరరావు, ఏలూరు.

## వాస్తవవిరుద్ధం

*(రూ. 25 బహుమతి పొందిన సమీక్ష)*

చదివిన పాఠకుల్ని ఆలోచనకో, అనుభూతికో గురిచేసినప్పుడే సాహిత్యానికి ప్రయోజనం. ఈరకంగా చూస్తే "రాగాన్వేషణ" నవల మంచి నవలగా అన్పించుకోదు. విభిన్నమైన, వినూత్నమైన అంశాన్ని కథా వస్తువుగా ఎన్నుకోవడంలో రచయిత్రి ప్రతిభ కన్పించినా, కథాంశాన్ని ఆవిష్కరించడంలో విఫలులయ్యా




రు. ఉన్నత జీవితసత్యాలను ఆవిష్కరించా లంటే అంతర్దర్శనం, అంతర్మథనం చాలా అవసరం. దీని ప్రస్తావన నవలలో మచ్చుకైనా కన్పించదు. జీవితాన్ని చదవడం బాగా తెలి సిన రచయిత్రి భిన్నజీవితాల విశ్వరూపాన్ని ప్రదర్శించారేకాని, ఫలితాన్ని సమీకరించలేక పోయారు. యువకులైనవారు వెళ్ళి ఇతరుల జీవితాల్లో కలుగచేసుకోవడం, సలహాలు-సందేశాలు ఇవ్వడం, వాటిని వారు అంగీక రించడం అంత సులభమా? మార్పు అంత సులభంగా అంగీకరింపబడదే! జీవి తంలో ఎంతో అనుభవం, సాధన, నిమగ్నత, త్యాగం ఉంటేనేకాని ఇలాంటి పని సాధ్యపడ దు. శ్రీ వివేకానంద, శ్రీ జిడ్డుకృష్ణమూర్తి లాంటి మహాత్ములు తమ విశేష జ్ఞాన సంపదతో జీవితాంతం పోరాడినా, తమంతటివారిని తయారు చేయలేకపోవడం, ఆశించిన మార్పు తీసుకురాలేకపోడం మనం ఇక్కడ గుర్తుంచు కోవాలి.

అసలు నలుగురికి గురువైన మూర్తి గారి గొప్పదనాన్ని గురించి రచయిత్రి చెప్పి నంతగా ఆ పాత్ర మనలుకోదు. ఉదాహరణకు పెళ్ళికంటే ఉన్నత విలువల అన్వేష ణలో ఆ విషయం విస్మరించాననడం బావుండే దేమోగాని, తీరికా, ఓపికాలేదనడం అతని విశిష్టతను బలహీనపరుస్తుంది. ఆ నలుగుర్లో శాంతి బీజాలు అన్వేషించగల అర్హతలేమిటో అర్థంకాదు. యూనివర్సిటీలో పరిశోధనానుభ వంతో జీవితాన్వేషణ వీలవుతుందా. బాహ్యాపరి శోధనతో శాంతి వెలయించగలమా. అన్ని జీవిత సంఘటనలతో భిన్న సంస్కృతులవల్ల దృక్పథాల్లో మార్పు వస్తుందా, రాదా నిర్ధారించ లేదు. అనుకొన్నదానికంటే ఎక్కువే సాధించా రని మూర్తి అనడమేగాని, ఏం సాధించింది వివరించరు. రాగనందనంలాంటి ఆశ్రమం నెలకొల్పడం ద్వారా కొందరి జీవితాలకు ఆధారం కల్పించవచ్చు కాని శాంతి, చైతన్యం ఎలా తీసుకురాగలరు? ఈ నవలలో అందరూ మంచివారుగానో, మంచిని అర్థంచేసుకునే సహృదయతకలవారిగానో కన్పిస్తారు. ఇది ఊహించడానికి బావుంటుందేకాని వాస్తవ విరుద్ధం. ఇలాంటి ఆదర్శాల వల్ల ప్రయో జనం ఉండదు.

-డాక్టర్ ఎన్.భాస్కరరెడ్డి, తిరుపతి.

## ఏది జీవనతత్వం

(రూ. 25 బహుమతి పొందిన సమీక్ష)

"రాగాన్వేషణ" కథాంశం ఒక కల్పనతో కూడిన, ఆచరణ సాధ్యంకాని అంశాలతో నిండి ఉంది. ఈ నవల ద్వారా రచయిత్రి ఏ ప్రయోజనాన్ని సాధించదల్చుకున్నారు? జిడ్డు కృష్ణమూర్తి భావాలకు ఆచరణాత్మక రూపమే అయితే అదీకాదు. జిడ్డుకృష్ణమూర్తి తత్వాన్ని పదేళ్ళపాటు జీర్ణింపచేసుకుని రాశానని రచ యిత్రి అంటున్నారు కనుక ఈ మాట అనవ ల్సి వస్తున్నది.

పదేళ్ళపాటు ఋషీవాలీలో ఉండి ప్రస్తుతం కూడా ఒక ఆదర్శవంతమైన సంస్థలో పనిచే స్తూ అన్ని ఆదర్శాలనీ తనలో నింపుకున్నారు రచయిత్రి. ఈ సమాజాన్ని, సమస్యల్ని ఆ ఆదర్శ భావాలతో, సంస్కరణ వాదంతో తీర్చిది ద్ది అంతా 'మంచే'నని సర్వేజనా సుఖినోభ వంతు అన్నట్టుగా ఉండాలనుకోవడం చాలా గొప్ప భావన. కాని బయటి ప్రపంచంలో ఈ ఆదర్శాలకీ, మంచికీ అందనంతగా మనుషు లు ఎంతగా చెడిపోవాలో అంతకంటే ఎక్కువే చెడిపోయారు అన్న సంగతి రచయిత్రి నిర్మల మైన మనస్సుకి అర్థంకాలేదు. వ్యాపార నాగరి కతలో స్వార్థం ఎంతగా వెర్రితలలు వేసిందో రచయిత్రికి తెలియనిదేంకాదు. ఆ నవాలక్ష సమస్యలన్నిటినీ కూడా కొన్ని మంచి మాట లతో, వాళ్ళలో పరివర్తన తీసుకురావాలనేది ఆచరణ సాధ్యంకాని ఒక ఆదర్శం.

జిడ్డు కృష్ణమూర్తి సంప్రదాయాన్ని సంస్కృతిని కూడా ప్రశ్నిస్తాడు. కృష్ణమూర్తి జీవన తత్వం స్వీయానుభవాల్నుంచి సత్యాన్ని తెలుసుకోమనడం. ఈ విలక్షణమైన సిద్ధాంతా న్ని అర్థంచేసుకుని, తద్వారా మానవసమస్యల న్నిటిని పరిష్కరించే "రాగాన్వేషణ"లో రచ యిత్రి విఫలమయినట్లు కనిపిస్తున్నది.

- వాసిరెడ్డి వేణుగోపాల్, జగ్గయ్యపేట.

కవరు పేజీ ఫొటోగ్రాఫరు: ఫణికుమార్

సంపుటి: 11 చతుర సంచిక: 1
ఫిబ్రవరి '88

# ఈ నెల సమగ్ర నవల

"పరాయిపాలనపోయింది. అన్యాయపు రాజరికం అంతమయింది. ఇక ఇప్పుడు రాజులు లేరు. ప్రజలే రాజులు" అన్నారు మహానాయకులు.

నిజాం నిరంకుశాధికారపు ఉక్కుపాదం కింద జీవచ్ఛవాల్లై, దీనంగా, హీనంగా బతుకులీడుస్తున్న గిరిజనులు 'ఇకనన్నా మా బతుకులు బాగుపడతా యేమో" అనే ఆశతో ఎదురుచూశారు... చూస్తూనేవున్నారు.

ఎలక్షన్లొచ్చాయి. పంచవర్ష ప్రణాళికలొచ్చాయి... మరెన్నో వచ్చాయి. అన్నీ వారి కోసమేనన్నారు. గిరిజనులలా చూస్తూనే ఉన్నారు. చూస్తూండగానే ఏడాది... రెండేళ్లు... మూడేళ్లు... పదేళ్లు- దశాబ్దాలే గడచిపోయాయి.

కానీ...

ఈ నింగి మారలేదు... ఈ నేల మారలేదు... ఈ అడవి మారలేదు... గోండుల జీవితాలూ మారలేదు. ప్రజలే ప్రభువులంటున్న ఈరోజుల్లోసైతం ఏ గోండు గుండెను కదిలించినా అది కన్నీటి కథలనే వినిపిస్తుంది. ప్రతి గోండు కథా ఓ వ్యధాభరిత కావ్యమే అవుతుంది. ఆ గుండె చప్పుళ్లను విని, ఆ కన్నీటి బతుకులను అర్థంచేసుకొని, ఆవేశపడి, శ్రీ వసంతరావు దేశపాండే మననును కరిగించేలా, మనిషిని కదిలించేలా సమర్థవంతంగా రచించిన నవలే ఈ 'అడవి'

'చతుర' నిర్వహించిన నవలల పోటీలో ద్వితీయ బహుమతి రు. 6000 పొందిన ఉత్తమ నవల అడవి 'చతుర' అందిస్తున్న 11వ జన్మదిన ప్రత్యేక కానుక.

# అడవి

## వసంతరావు దేశపాండే

# రచయిత పరిచయం

"నా నవలే నా పరిచయం. రేపు నేను రచయితగా నిలబడగలిగితే పాఠకులు నన్ను 'అడవి' నవలా రచయితగానే గుర్తుంచుకుంటారు. చేస్తున్న పని నిర్మల్ జుమెరాత్‌పేట్ స్కూల్లో పిల్లలకు పాఠాలు చెప్పడం. ప్రస్తుతం తాత్కాలికంగా హైమన్ డార్ఫ్ ఉపాధ్యాయ శిక్షణసంస్థలో పాఠాలు చెప్పడం.

"అబ్బాయికి ప్రయిజొచ్చిందని విని ఆనందించడం తప్ప తెలుగు చదవలేని మరాఠీ మాత్రమే తెలిసిన తల్లిదండ్రులు కమలాదేవి వెంకట్రావులు,

"నాకే రచనాశక్తి ఉంటేనా.... నేను ఈపాటికి...." అంటూ నన్ను ప్రేరేపించే శ్రీమతి హరిప్రియ; ఈసారి "ఊరు" నవల రాయమని అమాయకంగా అడిగే బాబు శ్రీకాంత్- ఇదీ నా కుటుంబం.

'బీనాదేవి రచనలు - సమగ్ర పరిశీలన'పై ఎం.ఫిల్ చేసి ప్రస్తుతం 'తెలుగు నవలల్లో శ్రామిక జీవనం'పై పి.హెచ్‌డి చేస్తున్న విద్యార్థిని.

ఈ నా తొలినవల 'అడవి' ని...

"నాకు తన అనుభవాలు- జ్ఞాపకాలను సాహిత్యం ముచ్చట్లుగా గంటలు గంటలు చెప్పిన సాహితీమూర్తి, గౌరవనీయులు, పూజ్యులు మా తెలుగుసార్.

**శ్రీ యస్. సదాశివగారికి**

అంకితం చేస్తున్నాను"


**వసంతరావుదేశపాండే**
**5-2-90, ఛోటాతలాబ్.**
**ఆదిలాబాద్- 504001.**




**అం**దిన సమాచారంతో అడవినంతా గాలిస్తు న్నారు పోలీసులు.

మధ్యాహ్నం నుండి నాలుగు జట్లుగా విడిపోయి గాలిస్తున్నా ఫలితం మాత్రం ఏమీలేదు.

చీకటిపడటంతో సెర్చ్‌లైట్ల సహాయంతో గాలింపు కార్యక్రమం సాగుతోంది. అయినా ఒక్కమనిషి జాడకూడా లేదు. కనిపిస్తే చాలు కాల్చేయటానికి ఆయుధాలు సిద్ధంగా వున్నాయి.

పోలీసులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని అడుగులు ముందుకేస్తున్నారు. ఏక్షణం ఏం జరుగుతుందోనని భయం.

ఎత్తైన కొండలపై దట్టమైన అడవుల్లో జరుగుతోంది ఆ గాలింపు కార్యక్రమం.

అడవిలో ఒక దారీతెన్నూలేదు. పదిగజాల దూరంలో ఉన్న మనిషి ఆచూకి కూడా తెలియనంత దట్టంగా అల్లుకున్నాయి తీగలూ, పొదలూ.

పగటిపూటే ఒంటరిమనిషి తిరగడానికి జంకే అడవులవి. చీకటికితోడుగా, నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ ఆగకుండా ఏక లయగా అరుస్తున్న చిమ్మట్ల రొద.

పోలీసుల బూట్లకింద నలిగిన ఎండుటాకుల చప్పుళ్లకు పక్షులు గోలగోలగా అరుస్తున్నాయి. రెక్కలు టపటపలాడిస్తూ గుంపులుగా లేచిపోతున్నాయి.

దూరంగా గుట్టమీద అడవిలో ఓ నెగడు రగిలింది. నెగడు రగిలి కాలుతున్న అడవి జ్వాలా తోరణంలాగుంది.

ఉండివుండీ గుర్తుతెలియని, ఎన్నడూ వినివుండని జంతువుల అరుపులు వినిపిస్తున్నాయి.

ఎక్కడో దూరంగా తోడేళ్లమంద అరుస్తున్న చప్పుడు లీలగా వినిపిస్తోంది.

చీకటిపడ్డాక అడవిలో మనుషులకోసం గాలించడం వ్యర్థం. అదీగాక తాము కింది నుండి పైకెళ్తున్నారు. కొండపైనున్నవాడు కిందివాడి ఉనికిని సులభంగా కనిపెట్టగలడు. అందుకే ఎన్ని సెర్చ్‌లైట్లు ఉన్నా ముందుకుపోవటానికి పోలీసుల మనసొప్పడంలేదు.

ఆ పొజిషన్లో, ఈ చీకట్లో ఒక్కవ్యక్తిచాలు, ఎదురుకాల్పులతో ఈనాలుగు జట్లను నేలకొరిగించటానికి.

అదీగాక ప్రాణాలకు తెగించి ముందుకొస్తారు వాళ్లు.

జీతంరాళ్లకోసం, ఉద్యోగం నిలబెట్టుకోవడంకోసం ముందుకు కదిలారు పోలీసులు.

అన్నిబంధాలు తెంచుకొని, ఒక లక్ష్యంతో అడవిలోకి దూకి తుపాకిపట్టినవారు వాళ్లు.

పెళ్లాం--పిల్లలు, ఉద్యోగం, ప్రమోషన్ల వలయంలో ఊగిసలాడేవాళ్లు వీళ్లు.

ఈ చీకట్లో అనుకున్నరీతిలో ఎదురుదాడి చేయడం అసాధ్యమని పోలీసుదళాలు వెనక్కి తిరిగాయి.

అంతలో ఓ దేవదారు వృక్షంపై మానవాకారం ఒకటి లీలగా కదిలినట్లు గమనించాడో పోలీసు! మరుక్షణం 'ఫైర్' అని అరుస్తూ మెషిన్‌గన్ పేల్చాడు.

మెషిన్‌గన్ తూటాల చప్పుడుతో అడవి దద్దరిల్లింది. పక్షుల అరుపులతో అడవి మారుమ్రోగిపోయింది.

'ఫైర్' అనే మాటతోనే అందరూ అప్రమత్తులయ్యారేగానీ, ఎటువైపు ఫైర్ చేయాలో తెలియక కొన్ని సెకన్లు అమాయకంగా చూశారు.

ఈ లోగా ఫైర్ అనేమాటతోపాటు మెషిన్‌గన్ పేలడం, చెట్టుపై నుండి ఒక ఆకారం అంత ఎత్తునుండి 'ధబీ'మని నేలనపడటం రెప్పపాటులో జరిగిపోయాయి.

ఆ ఆకారం పడ్డచోట క్షణాల్లో సెర్చ్‌లైట్లు వెలిగాయి. పోలీసులు మెషిన్‌గన్స్‌తో చుట్టుముట్టారు.

సెర్చ్‌లైట్ కాంతిలో ఆ ఆకారం రక్తపు మడుగులో ఇంకా ప్రాణంపోక గిలగిలా కొట్టుకుంటోంది.

అది మానవాకారం కాదు-- ఒక కొండముచ్చు.

కొండదిగి అడవిదారిన పోలీసులు తమ వ్యాన్‌లు, జీపులు ఉన్నచోటికి చేరుకునేసరికి తూర్పున చుక్కపొడిచింది.

 

పోలీసు వ్యాన్‌లు, జీపులు మట్టిరోడ్డు వదిలి తారురోడ్డు చేరుకునేసరికి తూరుపుదిక్కు తెల్లబడింది.

వాహనాలు తమ గమ్యంవైపు దూసుకుపోతున్నాయి.

అంతలో, పోలీసు వాహనాలకు ముందున్న కచ్చారోడ్డు పైనుండి ఒక బుల్లెట్ మోటార్‌సైకిల్ వచ్చి రోడ్డెక్కి బాణంగా దూసుకుపోయింది.

బుల్లెట్‌పై ఇద్దరు యువకులున్నారు. ఆ బుల్లెట్ గంటకు వందకిలోమీటర్ల వేగంతో ముందుకు దూసుకుపోతోంది. ఎంత ప్రయత్నించినా బుల్లెట్‌ను పోలీసు వాహనాలు అందుకోలేకపోతున్నాయి.

హఠాత్తుగా ఒక కాలిబాటగల చోట బుల్లెట్ ఆగిపోయింది. వెనకనున్న యువకుడు దిగిపోయాడు. మళ్లీ బుల్లెట్‌రోడ్డుపై దూసుకుపోయింది.

ఆ యువకుడు చేతిలో సామాన్లు కిందపెట్టి కళ్లజోడుకు పట్టిన దుమ్మును ఒకసారి తుడిచి పెట్టుకునే లోపల పోలీసు వాహనాలు వచ్చేసి అతణ్ణి చుట్టుముట్టాయి.

గాలింపు కార్యక్రమంలో, ఈ ఇరవైనాలుగు గంటల్లో అనుమానాస్పదమైన మనిషి ఒక్కడు కూడా కనిపించలేదు. ఇప్పుడు కనిపించిన ఈ యువకుణ్ణి పట్టుకుంటే ఏమైనా సమాచారం దొరకొచ్చని పోలీసుల ఆశ.

యువకుడికి ఇదేం అర్థంకావడంలేదు.

చూస్తుండగానే జీపుల్లోంచి, వ్యానుల్లోంచి పోలీసులు బిలబిలమంటూ దిగి బెల్లాన్ని మూసిన చీమల్లా అతన్ని చుట్టుముట్టారు.

యువకుడు చుట్టూ పరికించి చూస్తూ ముక్కుపైకి జారిన కళ్లజోడు సరిగా సర్దుకున్నాడు.

ఆ యువకుణ్ణి చుట్టుముట్టిన పోలీసులందరి చేతుల్లో ఏదో ఒక ఆయుధం ఉంది.

నిరాయుధుడైన ఆ యువకుడు కురుక్షేత్ర సంగ్రామంలో ఒంటరి అభిమన్యుడిలా ఉన్నాడు.

"ఎవరు నీవు?"

"ఎక్కణ్ణించి వస్తున్నావ్?"

"ఎటు వెళ్తున్నావ్?"

"నీపేరేంటి?"

"ఆ మోటార్‌సైకిల్‌పై పారిపోయినవాడెవడు?"

"మిగతా మీ సభ్యులేరి?"

"మీ దళ నాయకుడెవడు?"

"వాడుఎటు పారిపోయాడు?"

--అంటూ ప్రశ్నలవర్షం కురిపించారు--ఒకేసారి.

ఆ యువకుడు వారి మాటలకు తొణకలేదు, బెణకలేదు. ఏ ప్రశ్నకు ముందు జవాబు చెప్పాలా అని ఒక క్షణం ఆలోచించి జవాబు చెప్పాడు--

"నా పేరు సిద్ధార్థ. నేను డాక్టర్ని. నిన్నరాత్రి..." అని చెపుతూండగానే ఇద్దరు పోలీసులు అతన్ని పెడరెక్కలు విరిచి పట్టుకొని వాన్‌లో పడేసారు.

మళ్ళీ వాన్‌లు దుమ్మురేపుకుంటూ ముందుకు కదిలిపోయాయి.

★ ★ ★

వాన్‌లు, జీపులు టౌన్‌పోలీస్ స్టేషన్ చేరుకున్నాయి. ఎవరి కడుపులు వాళ్ళవి. ఎవరి బతుకులు వాళ్ళవి. పట్టుకొచ్చిన సిద్ధార్థను లాకప్ గదిలో పడేసి, కాపలా గట్టిగా కాయమని సెంట్రీకీ చెప్పి ఎవరిదారిన వాళ్ళు తమ తమ ఇళ్ళకు వెళ్లిపోయారు.

ఆ లాకప్‌గదిలో అప్పటికే ఓ నలుగురు ఉన్నారు. ఆ చిన్నగదిలో అయిదుగురు ఉండలేరు. పైగా మూత్రం వాసన ముక్కుపుటాలను బద్దలు చేస్తోంది. ఇద్దరు లాకప్‌గది కిటికీలో కూర్చున్నారు. మరో ఇద్దరు లాకప్‌గది తలుపు దగ్గర కూర్చున్నారు. గది మధ్యలో సిద్ధార్థ ఉన్నాడు. గాలికూడా సరిగా ఆడటంలేదు.

సాయంత్రం నాలుగ్గంటలకు యస్.ఐ వచ్చాడు.

మరి కాసేపటికి సి.ఐ వచ్చాడు.

సిద్ధార్థను పట్టి తెచ్చిన సంగతి యస్.పి. గారికి చేరిపోయింది.

ఏక్షణమైనా యస్.పి.గారు రావొచ్చు.

ఆ మధ్యాహ్నం వరకు పోలీసు స్టేషన్

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి



# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

**ప్రస్తుత పథకం**

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

**బ్రాంచీలు :**

- బషీర్‌బాగ్, హైదరాబాద్
- లకిడీకాపూల్, హైదరాబాద్
- చిక్కడపల్లి, హైదరాబాద్
- అమీర్‌పేట్, హైదరాబాద్
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం
- స్టేషన్‌రోడ్, గుంటూరు
- జె.పి.యస్‌రోడ్, వరంగల్
- టి.నగర్ రాజమండ్రి
- సుబాష్‌రోడ్, కాకినాడ
- నెహ్రూరోడ్, కర్నూలు
- వైరారోడ్, ఖమ్మం
- నరసింహారావుపేట, ఏలూరు

**డబ్బుకోసమేనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత !!**



## మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
అబిడ్స్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

ఆడదిక్కులేని సంసారంలా ఉంటే, యస్.పి.గారు వస్తున్నారనేసరికి సాయంత్రాని కల్లా సినిమా సెట్టింగ్‌లా మారిపోయింది. ఎక్కడి వస్తువులు అక్కడ సర్ది నీట్‌గా ఉంది స్టేషన్.

గోడపై పెద్దపెద్ద అక్షరాల్తో రాసిన 'సత్యమేవ జయతే' మాత్రం దుమ్ముకొట్టుకుపోయింది.

ఒక కానిస్టేబుల్ ఆ అక్షరాలను తడిగుడ్డతో శుభ్రంచేశాడు.

ఈ సందడిలో లాకప్‌గదిలో ఉన్నవారి సంగతి ఎవరూ పట్టించుకోలేదు. దుర్వాసన రాకుండా ఓ అరలీటరు ఫినాయిలు మాత్రం గుమ్మరించారు. లాకప్‌గది అంతా తడితడిగా ఉంది.

ఎంతకూ యస్.పి.గారు రాకపోవడంతో అక్కడున్న వాళ్ళే సిద్దార్ధను లాకప్‌గదిలోంచి ఇంకో గదిలోకి మార్చారు.

ఇంటరాగేషన్ పేరుతో అడగాల్సింది అడిగారు. జరగాల్సింది జరిగిపోయింది.

తర్వాత సిద్దార్ధను తెచ్చి మళ్ళీ లాకప్‌గదిలో పడేసారు. అతనిలో నిలబడే ఓపిక లేదు. కూర్చోటానికి వీల్లేకుండా నేలంతా తడితడిగా ఉంది.

ఒకవైపు ఆకలి, మరోవైపు నొప్పులు, అలసట శరీరాన్ని కమ్మేస్తున్నాయి. యస్.పి.గారు వస్తున్నారన్న హడావుడిలో తన గురించి పట్టించుకున్నవాడులేడు. నిజానికి యస్.పి.గారు వస్తున్నది తన గురించే అని సిద్దార్ధకు తెలుసు. అయినా తన ఆకలి సంగతి వారికి అనవసరం. తను అడగడు. ఎంతో దీనంగా హీనంగా అడిగితే తప్ప వాళ్ళు కనికరించరు. తను అందుకు సిద్దంగా లేడు.

ఆకలి ప్రేగులను, అలసిన శరీరాన్ని మరిపించాలనే ప్రయత్నంలో సిద్దార్ధ నిదురలోకి జారిపోయాడు.

★ ★ ★

18 ఏప్రిల్, 1981

సమయం, మిట్టమధ్యాహ్నం.

అది జిల్లా పోలీసు కార్యాలయంలో అక్కడి ఉన్నతాధికారి గది.

ఆ గదిలో అప్పుడు ఫైరింగ్ తర్వాతి ప్రశాంతత ఉంది.

మృత్యువులాంటి చల్లదనం ఉంది.

కూర్చుని ఉన్న ఆ అధికారి మనసుకు-మేధస్సుకు మధ్య జరుగుతున్న సంఘర్షణ చీకటి రాత్రి సముద్రంలో తుఫానులా ఉంది.

అతనిలోని అలజడికి- సంఘర్షణకు కారణం, టేబుల్‌పై కూలర్‌గాలికి రెప రెపలాడుతున్న ఒక కాగితం.

ఆ కాగితం సభ జరుపుకోడానికి అనుమతి కోరుతూ 'గిరిజన రైతుకూలీ సంఘం' పెట్టుకున్న అభ్యర్ధన పత్రం.

ఆ సభ పూర్వాపరాలను, లాభనష్టాలను తమ దృష్టితో బేరీజు వేసి ఇంటలిజెన్స్ విభాగం అందించిన ఫైలు ఒక వైపున, పేపర్ వెయిట్ కింద ఎగిరెగిరి పడుతున్న అనుమతి కోసం పెట్టుకున్న అభ్యర్ధన పత్రం ఒక వైపున ఉన్నాయి.

అంతలో స్వింగ్‌డోర్ తెరుచుకొని ఒక జవాను లోపలికొచ్చి సెల్యూట్ చేసి, అటెంషన్‌లో నిలబడ్డాడు. "ఎవరో కటిగారంట, గిరిజన రైతుకూలి సంఘం తరపున వచ్చాడంట. మిమ్మల్నొకసారి కలవాలని అంటున్నాడు... పంపించమంటారా" అని అడిగాడు.

మాటలు వినికూడా అతడు ఏమీ మాట్లాడలేదు.

అరనిమిషం జవాబుకోసం చూసి, సమాధానం ఏమీ రాకపోవడంతో విషయం అర్ధంచేసుకొని, మళ్ళీ సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు జవాను.

సమాధానం ఏమని చెప్పాలి?

ఒకవైపు అభ్యర్ధన పత్రం.

మరో వైపు ఇంటలిజెన్స్ రిపోర్ట్.

గత వారంరోజులుగా ఆ కాగితం అలాగే ఉంది. అనుమతి ఇవ్వడమా, వద్దా అనేది ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు.

★ ★ ★

సభ జరుపుకోవడానికి అనుమతి ఎలాగూ లభిస్తుందనే గట్టి నమ్మకంతో గిరిజన రైతులు, రైతుకూలీ సంఘం కార్యకర్తలు ఊరూరా, పల్లె

వల్లెనా సభకు రావల్సిందిగా గోండు సోదరుల ను ఆహ్వానిస్తూ వాల్‌పోస్టర్లు అతికించారు, కరపత్రాలు పంచి పెట్టారు.

అడవి మనిషిలో ఆలోచన రేకెత్తింది.

గోండు గూడాల్లో చైతన్యం పెల్లుబికింది.

పరాయి పాలనపోయి ఇన్నేళ్ళయినా తమ బతుకుల్లో వెలుగెందుకు రాలేదు?

తమ కష్టాలకు తుది ఎందుకు లేదు?

బతుకులెందుకిలా ఉన్నాయి?

ఎక్కడుంది లోపం?

అణగారిన ఈ బతుకుల్లో వెలుగొచ్చేదెన్నటికి?

సాగుతున్న ఈ దోపిడి-దౌర్జన్యాలకు అంతం ఎన్నటికి?

ఈ కష్టాల కోటలోంచి ఆనందాల ఊటకేసి తమ బతుకుల్ని నడపటానికి ఏం చేయాలి?

ఏదో చేయాల్సిందే!

అందరూ కలిసికట్టుగా- ఒక జట్టుగా నిలబడాలి.

ఆలోచించాలి... నిర్ణయించాలి.

ఎదురుతిరిగి తమ హక్కులను, ఆనందాలను సాధించుకోవాలి.

ప్రతి గోండు గుండెల్లో మొదటిసారి చైతన్య 'తుడుం' మోగింది.

అలా మోగించింది గిరిజన రైతు కూలీ సంఘం.

★ ★ ★

తన ముందున్న సమస్య క్షణక్షణానికీ పెరిగిపోతోంది. సభకోసం జరుగుతున్న ఏర్పాట్లు, ఉధృత ప్రచారం చూస్తుంటే ఇది మామూలు సభ కాదనిపిస్తోంది. సాధారణంగా ఇలాంటి సమస్యకు తానుగా ఒక పరిష్కారం ఆలోచించి, అమలు పరిచేలోగా కేంద్రమో, రాష్ట్రమో, జిల్లా, స్థానిక రాజకీయాలో తలదూర్చడం ఆనవాయితీ. మంచి జరిగితే ఎవడూ అడగడు, పట్టించుకోడు. చెడు జరిగితే మాత్రం అదంతా పోలీసుల అసమర్థతగా నిందించడం పరిపాటి.

ఈనాటి ఈ సభకు అనుమతి విషయంలో ఇంకా ఎవరూ తనని పావుగా ఉపయోగించక పోవడం ఆశ్చర్యంగా ఉంది. తానుగా ఈ జరుగబోయే సభకు అనుమతినిచ్చి, ఎలాంటి అవాంఛనీయ సంఘటనలు జరుగకుండా నిభాయించగలడా!

అనుమతినీయకుండా పెల్లుబికి వస్తున్న జనవాహినిధాటికి నిలబడి తట్టుకోగలడా!

పోనీ, అంటే సభా ఏర్పాట్లు ఇంతదూరం వచ్చాక కాదనడం కూడా విజ్ఞత అనిపించుకోదు.

ఇలా సాగుతున్న అతని ఆలోచనకు అంతరాయం కలిగిస్తూ టేబుల్‌పై ఫోన్ మోగింది.

అది రాష్ట్ర రాజధానినుండి యస్.టి.డి. కాల్.

ఫోన్‌కాల్ వింటున్న అతడి ముఖంలో క్షణక్షణానికి రంగులు మారుతున్నాయి.

పదినిమిషాల్లో మెసేజ్ ముగిసింది.

మరుక్షణంలో అతడు కూర్చున్న కారు కలెక్టర్ కార్యాలయంవైపు వేగంగా కదిలింది.

అదేకారు మరో అరగంట తర్వాత కలెక్టర్ కార్యాలయం నుండి టౌన్ పోలీస్ స్టేషన్ వైపు పరుగుతీసింది.

అప్పటికే టౌన్ పోలీస్ స్టేషన్ ముందు నీలిరంగు జీపులు, వాన్‌లు బారులు తీర్చి నిలబడి ఉన్నాయి.

పోలీసులు హడావుడిగా తిరుగుతున్నారు. వారి హడావుడి చూస్తుంటే మూడవ ప్రపంచ యుద్ధానికి ఇంకా రెండు నిమిషాల టైం మాత్రమే ఉన్నట్లుంది.

యస్.పి.గారి కారు రావడంతో ఎక్కడివాళ్లు అక్కడ సర్దుకున్నారు. హడావుడి తగ్గిపోయింది. మూడవ ప్రపంచయుద్ధం మరో ముప్ఫయి సంవత్సరాలకు వాయిదా పడ్డట్టుగా అంతటా ప్రశాంతత అలుముకుంది.

యస్.పి.గారి ముందు రిజర్వ్ సి ఐ.,యస్.ఐ ఇంకా ఇతర సిబ్బంది నిలబడి ఉన్నారు. జరగాల్సిన పనులను వివరించి చెపుతున్నారు యస్.పి.గారు. తను చెప్పడం అయిపోయిందన్నట్లు "ఎనీమోర్ ఇన్ఫర్‌మేషన్ ఫ్రం యువర్ సైడ్" అంటూ జేబుల్లో చేతులు

 

పెట్టుకొని అడిగారు.

"ఎస్ సర్" అంటూ ఒక రిజర్వ్ సి.ఐ. రెండడుగులు ముందుకు వేసి, "మనకొచ్చిన ఇన్ఫర్మేషన్ ప్రకారం ఆ ఏరియా అంతా గాలించాం, కాని ఎవరూ కనిపించలేదు. తిరిగి వస్తుంటే అనుమానాస్పదంగా ఉన్న ఒక వ్యక్తిని తెచ్చి లాకప్‌లో ఉంచాం. మీరొకసారి చూస్తే....." అంటూ వాక్యం సగంలో ముగించాడు.

"చూస్తాను... ఏమైనా సమాచారం సేకరించారా? అతడు ఎవరు, ఏమిటి?"

"అతడి పేరు సిద్ధార్థ. డాక్టర్. యం.బి.బి.యస్. యం.డి. గాంధి మెడికల్ కాలేజిలో చదివాడు. రెండేళ్ల క్రితం గాంధి, ఉస్మానియా, కాకతీయ మెడికల్ కాలేజి ట్రూప్ ఒకటి మన జిల్లాలో గల గిరిజన ప్రాంతాలు సందర్శించి, వారి ఆరోగ్యం గురించి ఒక సమగ్ర రిపోర్ట్ తయారు చేసింది. అప్పుడు ఆ ట్రూప్‌లో వచ్చిన వాళ్లలో ఒకడు ఈ డాక్టర్. రావడమైతే మెడికల్ కాలేజీ ట్రూప్‌తో వచ్చాడు. కాని తిరిగి వెళ్లలేదు. అప్పట్నుంచి ఇక్కడే వీళ్లతోనే ఉంటూ వైద్యం చేస్తున్నాడు. ఇదీ అతడు చెప్పిన సంగతి. అతడు చెప్పినవన్నీ నిజమే అనిపిస్తున్నాయి"

"ట్రైబల్ ఏరియా కదా! ప్రాక్టీస్ రెండుచేతులా బాగా సాగుతోందేమో! అందుకే వెళ్లి ఉండడు"

"నో సర్... ట్రీట్‌మెంట్ అయితే చేస్తున్నాడు గానీ ఎవరినుండీ డబ్బు తీసుకోడంట ఫీజు రూపంలో"

"రియల్లీ ఇంట్రస్టింగ్!అతణ్ణి తప్పకుండా చూడాలి" అని అంటుండగానే లాకప్ గదిలో నుంచి పెద్దగా కేకలు, అరుపులు వినిపించాయి.

యస్.పి.గారు లాకప్ గదివైపు కదిలారు. మిగతా సబార్డినేట్స్ అందరూ అతణ్ణి అనుసరించారు.

"నిన్నటినుంచి ఎండబెట్టి, ఆకలి....ఆకలి.... అని అరుస్తుంటే ఇదంట్రా మీరు పెట్టే కూడు. నీ అవ్వ.. ఈ కూడు కుక్కలు కూడా ముట్టవ్" అంటూ ఒకడు లాకప్ గదిలోంచి పెద్దగా అరుస్తున్నాడు.

"అబే... నోరు మూసుకో హరామ్‌ఖోర్! ఇదేం నీ బామ్మర్ది ఇల్లుకాదు– చికెన్ బిర్యానీ, రొయ్యల పులుసు పెట్టేందుకు. బయట పెద్ద దొరున్నడు. మొత్తుకొని నోరు జేస్తే రేపు నీతోలు దీసి ఎండేస్త. నోరు మూసుకొని పడిఉండు... పెట్టింది తిను" అంటూ కళ్లెర్రజేసాడు ఒక జవాను.

"బయట ఎవరుంటే నాకేంది. భయమా! ఇది తిండా... తుత్ నీఅవ్వ" అంటూ కారియర్ డబ్బాను ఒక్క తన్ను తన్నాడు అతగాడు కసికొద్దీ బలంగా.

ఆ అన్నంగిన్నె గాలిలో లేచి వచ్చి, లోపలికొస్తూ ఉన్న యస్.పి.గారి ముందు పడింది.

యస్.పి.గారు ముందుకు కదిలారు.

అంతా నిశ్శబ్దం అక్కడ. ఎస్.పి.గారి బూట్ల చప్పుడు తప్ప ఇంకో శబ్దం లేదు.

ఎస్.పి.గారు వెళ్లి లాకప్ గది ముందు నిలబడ్డారు.

మరుక్షణంలో లాకప్ గది తలుపులు తెరుచుకున్నాయి.

లాకప్ గదిలో సిద్ధార్థ కాక మరో నలుగురున్నారు.

ముగ్గురిముందు మూడు అన్నం గిన్నెలున్నాయి. నాల్గవ గిన్నె సిద్ధార్థ చేతిలో ఉంది. ఐదవ గిన్నె స్టేషన్ వాకిట్లో పడివుంది.

"ఏం జరిగింది?" అని అడిగాడు ఎస్.పి. అన్నం గిన్నె తన్నినవాడి కళ్లలోకి చూస్తూ.

అన్నం గిన్నెను తన్ని బూతులు కూసినవాడు ఎదురుగా ఎస్.పి.గారిని చూస్తూనే నీరుకారిపోయాడు. చుట్టూ ఉన్న నిశ్శబ్దం చూస్తుంటే అతడి గొంతు పెగలడం లేదు.

"ఏం జరిగింది?" అంటూ మళ్లీ రెట్టించాడు ఎస్.పి.

"అసలు.... " అంటూ విషయం వివరించబోయాడు ఆ అన్నం గిన్నెలందించిన కానిస్టేబుల్.

"యూ...." అని కోపంగా అంటూ, ఒక్క సెకను కాలం కళ్లు మూసుకున్నాడు ఎస్.పి. 'వాణ్ణి చెప్పనీ మధ్యలో నీ సంజాయిషీ

ఏమిటి' అన్నట్లు.

"నిన్నట్నించి కూడులేదు. ఆకలి అని అన్నమడిగితే గీ పాసిపోయిన అన్నం బెట్టిండ్లు. కుక్కలు కూడా నోరుబెట్టవు గీ అన్నంల. మేం మనుషులమా పశువులమా" అంటూ చెప్పాడు పక్కనున్నవాడు లాకప్ గదిలోంచి.

విషయం అర్థమైన ఎస్.పి. గారు 'ఏమిటి దంతా' అంటూ ముఖం చిట్లించాడు.

సి.ఐ. ఏదో నర్దిచెప్పబోయాడు.

"ఇంకేం చెప్పకండి. ముందు వారి సంగతి చూడండి" అంటూ లాకప్ గదిలోకి దృష్టి సారించాడు. ఒకమూల తలవంచుకొని తింటున్న సిద్ధార్థ కనిపించాడు.

ఎలాంటి గొడవ లేకుండా తింటున్నాడు.

గిన్నెలో బాగా పాచిపోయిన అన్నాన్ని గిన్నెలోనే ఒక పక్కన పెడుతూ, మిగిలింది తింటున్నాడు.

తింటున్న సిద్ధార్ధ ఎస్.పి. ఉనికినే గమనించడంలేదు. ఆ అన్నాన్ని ఎంతో ప్రియంగా తింటున్నాడు.

ఆకలయిన మనిషిలా, అన్నం విలువ తెలిసినమనిషిలా తింటున్నాడు.

తన ఉనికిని గమనించమన్నట్టు చప్పుడు చేశారు ఎస్.పి.

తలెత్తి చూశాడు సిద్ధార్థ.

సిద్ధార్థను చూసిన ఎస్.పి. ఒక క్షణం నివ్వెరబోయాడు. ఈ యువకుణ్ణి ఇదివరలో ఎక్కడో చూసినట్లుంది, కాని గుర్తు రావడంలేదు. మెదడులో జ్ఞాపకాల పొరల్లో ఏదో అలజడి.

"మిస్టర్... నీవు..." అంటూ అర్ధోక్తిగా ఆగాడు.

"నా పేరు సిద్ధార్థ" అంటూ ముక్కుపై జారిన కళ్ళజోడును ఎంగిలిచేత్తోనే సవరించుకున్నాడతను.

"వాళ్ళు తినలేమని విసిరేసిన అన్నాన్ని నీవెలా తింటున్నావు? పాచిపోయిన అన్నాన్ని నీవెలా తినగలుగుతున్నావు?"




"ఈ దేశంలో చాలామందికి ఈపాటి పాచి మెతుకులు కూడా దొరకడంలేదు. నా చుట్టూ ఉన్న జనం 'ఆకలి' అనే భయంకర రోగంతో పీడింపబడుతున్నారు. వాళ్ళమధ్య, వాళ్ళలో ఒకడిగా ఉన్నవాణ్ణి కాబట్టి తినగలిగాను... తింటున్నాను" అన్నాడు సిద్ధార్థ.

"ఒక డాక్టర్‌వై ఉండి అలా పాచిపోయిన అన్నాన్ని కిమ్మనకుండా తినకపోతే ఆ జేబు దొంగల్లా ఇదేమిటని అడగొచ్చుగా?"

"అడగొచ్చు. కాని ఇది పోలీస్‌స్టేషన్ అనే సంగతి నేను మరచిపోలేదు. ఈ దేశంలో ఆడపిల్లకు అత్తవారింట్లో, మగవాడికి పోలీస్ స్టేషన్‌లో ఎంత మర్యాద ఉంటుందో తెలుసుకాబట్టి అడగలేదు. అయినా ఇది చాలా మామూలు విషయం. మీవాళ్ళకు నామీద ఎందుకో అనుమానం కలిగింది... పట్టుకొచ్చారు. అది వారి విధి నిర్వహణ" అంటూ ఒకసారి చిట్లిన పెదవుల్ని తడిమి చూసుకున్నాడు. ఆ వెంటనే మళ్ళీ, "అనుమానం తీరితే వాళ్ళే వదిలేస్తారు. ఒకపూట తిండికోసం గొడవలు ఘర్షణలు ఎందుకు చెప్పండి. ఇలా పరిస్థితులతో సర్దుకుపోతూ, ముందుకు నడవడం నా ప్రవృత్తి"

"మరి నీ వృత్తేమిటి?"

"పోరాటం. రోగాలతో పోరాటం. మనుమల్లోని అజ్ఞానం, మూఢనమ్మకాలతో పోరాడటం నా వృత్తి. ఈ నా దేశంలో ఆకలి అన్నింటికన్నా భయంకరమైన వ్యాధి. సగటున నూటికి అరవైమంది ఈ రోగపీడితులే. ఆకలి రోగానికి 'అన్నం' మందు అని రాయలేంగా"

"మిస్టర్ సిద్ధార్థ... చాలాసేపటినుంచి అనుకుంటున్నాను... నిన్ను ఎక్కడో చూసానని. ఎక్కడ అనేది గుర్తు రావడంలేదు" అన్నాడు ఎస్.పి.

"మీ జ్ఞాపకశక్తిని మెచ్చుకోవాల్సిందే. సంవత్సరంన్నర క్రితం సమర్ధవంతమైన విధినిర్వహణ, ఉత్తమ శాంతిభద్రతల పరిరక్షణకుగాను మీరు; గిరిజనుల గొంతువాపు వ్యాధిపై పేపర్ సమర్పించినందుకుగాను నేను ఒకే వేదికమీద, గవర్నరుగారి సమక్షంలో కలుసుకున్నాం."

"అవును గుర్తొచ్చింది. ఆ రోజు గోల్డ్‌మెడ

ల్స పొందినవారందరిలో నవ యువకుడివి. అయినా అప్పటికి ఇప్పటికి చాలా మార్పొచ్చింది నీలో" అంటూ సిద్ధార్థను ఒక తెలిసిన వ్యక్తిగా పరిశీలించి చూశాడు ఎస్.పి.

తీయకుండా వదిలేసిన గడ్డం, కాలర్ వద్ద చిరిగిన కాటన్ షర్టు, జీన్స్‌పేంట్, అతుకులు వేసి కుట్టిన బూట్లు, నిమిషానికి నాలుగుసార్లు ముక్కుపైకి జారే కళ్ళజోడు, పల్స్ చూడ్డానికి తప్ప పనికిరాని చేతి గడియారం- ఇదీ అతని అవతారం.

ఆ అవతారం వెనుకనున్న ఆర్ద్రమైన జాలి గుండె, దీనులపై, హీనులపై, పీడితులపై గల ప్రేమ ఎంతో తరిచిచూస్తేగాని కనిపించవు.

"మిస్టర్ సిద్ధార్థా... అసలు నీ జీవితలక్ష్యమేమిటి? ఎన్నాళ్ళు వీళ్ళను ఇలా పట్టుకొని పాకులాడతావు. ఒక్కసారి నీ వేషం చూసుకో. ఉజ్వలమైన భవిష్యత్తుగలవాడివి- అనవసరంగా ఈ రిస్కునీకెందుకు"

"రిస్కులేని లైఫ్‌లో థ్రిల్ లేదు. అయినా వృత్తిపరంగా నేను వైద్యుణ్ణి. ఎక్కడ నా అవసరం అనివార్యమో అక్కడుంటేనే నాకు ఆనందం. నేను వైద్యం చేయాలని అనుకునే గోండులు అమాయకులు. నాగరిక సమాజంలో ఇమడలేని అడవి మనుషులు. తరాలుగా ఈ నాగరిక జనుల దోపిడీకి, దౌర్జన్యానికి గురవుతున్నవారు. వారిని మానసికంగా, శారీరకంగా చైతన్యవంతం చేయగలిగితే అంతకంటే నాకేం కావాలి" అని అంటుండగానే స్టేషన్ గదిలో ఫోన్ మోగింది.

అంతలోకే సి.ఐ. వచ్చి 'కలెక్టర్‌గారి నుండి ఫోన్' అని చెప్పడంతో ఎస్.పి గారు ఫోన్ వైపు కదిలారు.

తరువాత కొన్ని నిమిషాలకే లాకప్ గది తలుపు తెరచుకుంది. సిద్ధార్థను బయటకు తెచ్చారు.

ఎస్.పి.గారు స్టేషన్ గదిలోంచి బయటకు వస్తూ, "మిస్టర్ సిద్ధార్థా... నౌ యు ఆర్ ఫ్రీ. వేర్ ఎవర్ యు వాంట్ యు కెన్ గో' అని అంటుండగానే ఒక కానిస్టేబుల్ ఒక తోలు సంచి, ఒక మెడకు వేసుకునే గుడ్డసంచి తీసుకొచ్చి ఇచ్చాడు.

[illegible]

నించి, "ఆ సంచి ఏమిటి? అంత బరువుగా ఉంది." అని అడిగారు ఎస్.పి. గారు.

"ఇవి అయొడైడ్ ఉప్పుప్యాకెట్లు. గోండుల్లో చాలామంది గొంతువాపు వ్యాధితో బాధపడుతున్నారు. ఆ వ్యాధిగలవాళ్ళు మామూలు ఉప్పుకు బదులుగా ఈ అయొడైడ్‌సాల్ట్ వాడాల్సిఉంటుంది."

"వాళ్ళ వ్యాధికి ఈ ఉప్పు మందా!"

"అవును. కొండలపైన, పల్లపు ప్రాంతాల్లో ఏళ్ళతరబడి నివసించే ప్రజలకు ఈ వ్యాధి వస్తుంది. గొంతు వాచిపోతుంది. భూమి ఏటవాలుగా ఉండటంతో భూమిలో ఉండే ఖనిజ-లవణాలు కిందకు కొట్టుకుపోతాయి. ఫలితంగా వాళ్ళు తాగేనీటిలో, తినే తిండిలో అసలు ఖనిజలవణాలు ఉండవు. దాంతో వారి శరీరంలో ఖనిజ లవణాల శాతం తగ్గిపోయ్యి కంఠవాపు వ్యాధి వస్తుంది. ఈ వ్యాధి మామూలు ప్రజల్లో లక్షల్లో ఒకరికి ఉండొచ్చు"

"చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది" అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచాడు ఎస్.పి.

మొదటిసారి ఈ వ్యాధిని ఈ ప్రాంతంలో గుర్తించి పరిశీలించి, పరిష్కారాన్ని సూచిస్తూ నేను రాసిన పేపర్‌కు ప్రభుత్వం గోల్డ్‌మెడల్ ఇచ్చి సత్కరించింది. కానీ అసలు సమస్యను పట్టించుకోలేదు. నేడు ఈ మామూలు ఉప్పు కూడా వారికి అందుబాటులో లేదు. ఈ అయొడైడ్ సాల్ట్ కూడా ఏ టాటా-బిర్లాలో తయారుచేయాలి, మనం చేసుకోలేము. లక్షలు కోట్లు ఖర్చుపెట్టి మనం తయారుచేసేవి వేరే ఉన్నాయి" అన్నాడు సిద్ధార్థ ఆవేశంగా.

"పదిపైసలు పెడితే ఇంత దొరికే ఈ ఉప్పులేక గిరిజనులు ఇంత అనారోగ్యానికి పాలుకావడం నిజంగా విచారించదగినదే" అంటూ తన విచారాన్ని వ్యక్తపరిచాడు ఎస్.పి.

"ఉప్పుకోసమే ఈ దేశం ఒకనాడు సత్యాగ్రహం చేసింది. మరోసారి ఈ ఉప్పుకోసమే ఈ గిరిజనులు తిరగబడినా మనం ఆశ్చర్యపడకూడదు" అంటూ ముందుకు కదిలాడు సిద్ధార్థ.

★ ★ ★



**19, ఏప్రిల్ 1981.** పథకం ప్రకారం పోలీసు బలగాలు వందల సంఖ్యలో ఇంద్రవెల్లి చేరుకున్నాయి.

పోలీసు వ్యానులు, జీపులు, ఇనుప టోపీలు, తుపాకులు చూసి పిల్లలు, పెద్దలు బిత్తరపోయారు.

ఎటు చూసినా ఖాకీ బట్టలు- ఇనుప టోపీలు.

ప్రాథమిక పాఠశాల బిల్డింగు, పంచాయితీ ఆఫీసులు పోలీసుల విడిదిగా మారిపోయాయి.

చూస్తుండగానే ఇంద్రవెల్లిలో నిషేధాజ్ఞలు విధించబడ్డాయి. ''ఎవరూ కూడా ముందుగా ప్రభుత్వం అనుమతి లేనిదే సభలు, సమావేశాలు, ఊరేగింపులు జరపరాదు. ఎవరూ కూడా కత్తులు, బల్లాలు, గొడ్డళ్ళు, కర్రలు, రాళ్ళు వంటిమ్మారణాయుధాలు ధరించి లేదా వెంటకలిగి ఉండరాదు. ఒక చోట ముగ్గురు, నలుగురు గుమిగూడి ఉండరాదు'' అని ప్రకటించారు.

ప్రజలు భయాందోళనలతో ఎవరి ఇళ్ళలో వాళ్ళు ఉండి, గుసగుసలు చెప్పుకుంటున్నారు. 'ఇవాళే ఇలా ఉంది' రేపు ఏమవుతుందో ఏమో, అని అందరూ కలత నిదురతో రాత్రి గడిపారు.

తెల్లవారింది.

**1981 ఏప్రిల్- 20,** సోమవారం.

ప్రతిసోమవారం, ఇంద్రవెల్లిలో అంగడి సాగుతుంది. పల్లె వల్లె నుండి, ఊరూరు నుండి గోండులు కొందరు కాలినడకతో, కొందరు ఎడ్లబళ్ళల్లో, కొందరు బస్సుల్లో పడి వస్తున్నారు. ఇంద్రవెల్లిలో నిషేధాజ్ఞల సంగతి ఈ చుట్టుపక్కల పల్లెలవాళ్ళకు తెలియవు. ఎప్పటిలాగే ఇంద్రాయిణీదేవిని దర్శించి, అంగడి చేసుకొని, వస్తూ వస్తూ సాయంత్రం ఇంద్రవెల్లి సభను చూసి, వాళ్ళు చెప్పే నాలుగు మాటలు వినివద్దామని, జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు.

పెద్దయెత్తున నాలుగు దిక్కులనుంచి వస్తున్న జనసందోహాన్ని చూసి పోలీసులు బేజారెత్తిపోయారు.

సభ జరగకుండా ఆపలేం అని ప్రభుత్వానికి తెలిసిపోయింది. వచ్చేవాళ్ళు ఇలానే వస్తూవుంటే, సాయంత్రానికల్లా వేల సంఖ్యలో గుమిగూడే ఈ గిరిజనవాహినిని అడ్డుకోవడం ఎవరి తరమూ కాదు. ఇక చేయవలసిందల్లా ప్రజలు ఎటువైపునుండి కూడా ఇంద్రవెల్లి చేరకుండా చూడటం. ఉన్న వాళ్ళను నయాన్నో భయాన్నో చెదరగొట్టి పారదోలడం!

వెంటనే లాఠీచార్జి మొదలయింది.

వస్తున్న గిరిజనులను లాఠీలతో తరిమితరిమి కొడుతున్నారు.

ఆ వెంటనే వలుచోట్ల నుండి ఇంద్రవెల్లి మీదుగా వెళ్ళాల్సిన బస్సులు ఆగిపోయాయి.

బయలుదేరిన బస్సులు ఇంద్రవెల్లికి అటు ఐదు కిలోమీటర్లు, ఇటు ఐదు కిలోమీటర్లు దూరంలోనే నిలిపివేయబడున్నాయి.

వరంగల్, హైదరాబాద్, సిర్పూర్ కాగజ్‌నగర్, కరీంనగర్, లక్సెట్టిపేట నుండి వచ్చే బస్సులు ఇంద్రవెల్లిలో ఆగకుండా జనం ఆ చుట్టుపక్కల ఎక్కడా దిగకుండా బందోబస్తు చేయబడింది.

ఇంద్రవెల్లిలోని, నిషేధాజ్ఞలు, ఉద్రిక్తపరిస్థితి తెలియక బయలుదేరిన నలుగురు వ్యక్తులు పోలీసు క్యాంపులో చిక్కిపోయారు.

ఒకరు కరీంనగర్- పెద్దపల్లి లాయర్.

మరో ఇద్దరు కాకతీయ యూనివర్సిటి రిసర్చ్ స్కాలర్స్.

ఇంకొకాయన ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్ జె.ఎన్.టి.యు. స్కాలర్.

వీరుగాక తిరుగు ప్రయాణంలో అటకాయించబడి వెనక్కి పంపబడ్డ వాళ్ళలో డాక్టర్ సిద్దార్థ కూడా ఉన్నాడు.

క్షణక్షణానికి పరిస్థితి అదుపు తప్పుతోంది.

సభకు రావద్దని అటకాయిస్తే జనం రెచ్చిపోయి విజృంభిస్తున్నారు.

అధికారులు ఆఖరిక్షణంలో తీసుకున్న నిర్ణయాలు సరిగా పనిచేయలేదు.

పోలీసులతో తరిమివేయబడ్డ వందమంది జనం తిరిగి కోపంతో, కసితో రెచ్చిపోయి వేయి మందితో కలసి దండులా కదిలివస్తున్నారు.





నిజం చెప్పు రాధా!....
నువ్వు నన్ను చూసి ప్రేమిస్తున్నావా?
నాకున్న నాగార్జున సిమెంట్ తో
కట్టిన యిల్లుని చూసి ప్రేమిస్తున్నావా?
MAM 88

ఉదయం వందల సంఖ్యలో పోలీసులు ఇంద్రవెల్లిని చుట్టుముట్టి వచ్చే జనాలను రాకుండా నిరోధించారు.

జనం ఉదయం పదుల సంఖ్యలో ఉన్నవారు మధ్యాహ్ననికి వందల సంఖ్యలో పెరిగిపోయారు.

మధ్యాహ్నం వందల సంఖ్యలో తరిమివేయబడి, సాయంత్రానికల్లా వేల సంఖ్యలో చేరిపోయారు.

వందల సంఖ్యలో పోలీసులు, వేల సంఖ్యలో గిరిజనులు - క్షణక్షణానికి పరిస్థితి అదుపు తప్పుతోంది.

మంటల్లాగా చుట్టుముడుతున్న జనం.

అరుపులు, కేకలు, అల్లరి... ఎటుచూసినా జనం.

ముందుకు తోసుకొస్తున్న జనాన్ని పోలీసులు లాఠీలతో వెనక్కు నెడుతున్నారు. దినమంతా కలిపి కనీసం నలభయిసార్లయినా లాఠీచార్జి చేసి ఉంటారు. కాని గోండులు వెనక్కు తగ్గడంలేదు. ఇంకా ముందుకే వస్తున్నారు.

"మేం సభ ఎందుకు జరుపుకోగూడదు?" అని అడిగాడు- అరవైయేళ్ళ మెస్రం జంగు.

"మేం సభకు ఎందుకు పోగూడదు" అనడిగాడు ఆత్రం సోము.

"నేడు ఇక్కడ ఎలాంటి సభా జరగనివ్వం. మీరు ఎవరూ ముందుకు రావద్దు. మర్యాదగా వెనక్కి మళ్ళి మీ మీ గూడాలకు పొండి" అంటూ హెచ్చరించాడు ఒక పోలీసు అధికారి.

"పోతం. కాని ఎందుకు పోవల్నో సభ ఎందుకు జరగద్దో జర సమజాయించి చెప్పుండ్రి... వింటం" అన్నాడు జంగు.

"నేడు మీరు సభ జరుపుకోవాలన్నట్టే మీ గిరిజనేతరులు కూడా ఇక్కడే, ఇవ్వాల్నే సభ జరుపుకుంటం అంటున్నారు. అందుకని ఎవరూ సభ జరపరాదు" అన్నాడు పోలీసు అధికారి.

"ఆ గిరిజనేతరుల కన్నా ముందే మేము మీ అనుమతి కోరాం. అలాంటప్పుడు ముందు అడిగిన మాకు అనుమతినిచ్చి వారిని మరో మారు లేదా మరోచోట సభ పెట్టుకోమని అనొచ్చుకదా!" అని అడిగాడు చదువుకున్న గోండు యువకుడు తుకారాం.

"మీకన్నా ముందు వారే అనుమతిని కోరారు. కాని... కాని..." తడబడ్డాయి పోలీసు పెదవులు.

"మీరు సభ పేరుతో ఒకటయి, దోపిడి-దొమ్మి సాగించి, పెద్దయెత్తున గిరిజనేతరులను, సేట్లను, షావుకార్లను హత్యచేసి, దోచుకునే ఉద్దేశంలో ఉన్నట్లు తెలిసింది. అందుకని మేం మీ సభకు అనుమతినియ్యము" అని ఆ అధికారి అనలేదు.

ఎందుకంటే ఆ ఊహకు అనుమానమే తప్ప ఆధారం లేదు.

"సభ చేసుకుంటాం అని వారం పదిరోజుల ముందు మీ అనుమతికై అర్జీ పెట్టుకుంటే, ఈ క్షణంవరకు ఎలాంటి జవాబు లేదు. అనుమతి పత్రంకోసం మీ దగ్గరికి వచ్చిన మనిషి జాడ లేదు. మీ అనుమతి లేకుండా మేం సభ జరుపుకోకూడదు. కాని అనుమతి నిరాకరించినట్టయినా తెలుపాచ్చుగా. మీరేం సమాధానం ఈయకుంటే అనుమతి లభిస్తుందిగదా అని మేం ఊరూరా తిరిగి ప్రచారం చేసాం. వాల్‌పోస్టర్లు అంటించాం. కరపత్రాలు పంచిపెట్టాం. 'పెళ్లి పీటల దాకా వచ్చాక పెళ్ళి రద్దు' అన్నట్లు ఇప్పుడు సభ జరపరాదంటే అర్థం ఉందా, మీరే ఆలోచించండి" అని ఒకవైపు తుకారాం అధికారితో మాట్లాడుతుండగానే...

జనం తోసుకొని ముందుకు ఉరుకుతున్నారు.

మళ్ళీ లాఠీలకు పని.

అక్కడున్న జనంలో ఒకటే ఉక్రోషం, కోపం, కసి– లాఠీలపై, ఖాకీలపై, ఇనుప టోపీలపై, ఈ అధికారంపై...

అక్కడ అదిగో ఆ కనిపించే ఇంద్రవెల్లి సభలో ఏం చెప్తారో? అక్కడ తమకోసం ఎవరున్నారో?

అక్కడ ఏ బుద్ధుడు మరోమారు తమకోసం జ్ఞానబోధ చేయనున్నాడో!

అక్కడ ఏ కరుణామయుడు మరోమారు తమకోసం సిలువనెక్కనున్నాడో!




అక్కడ ఏ మహమ్మద్ తమకోసం ప్రవచించనున్నాడో!

అక్కడ ఏ మహాత్ముడు తమకోసం మరోమారు ఆత్మత్యాగం చేయనున్నాడో!

పదండి పోదాం

పదండి ముందుకు

పదండి తోసుకు

పదండి

పదండి

పదండి ముందుకు!

పదండి తోసుకు!

పోదాం పోదాం పైపైకి!

నెలలు నిండిన నేలతల్లి ప్రసవించినట్లు ఎటు చూసినా జనం. కదులుతున్న జనం. ఉరుకుతున్న జనం, ఉడుకెత్తుతున్నజనం, ఎటు చూస్తే అటు జనం.

ఏప్రిల్ ఎండలకు ఎరుపెక్కిన మోదుగపూలు ఆ జనచైతన్యాన్ని చూసి తెల్లబోయాయి.

అస్తమించే సూర్యుణ్ణి చూసి, రోజూ ఎరుపెక్కే పడమర సంధ్యారాగం ఈ జనచైతన్యం కళ్లలోకి చూసి, ఎరుపెక్కడం మరచిపోయి తెల్లబోయింది- నేడు.

పడమటి సంధ్యారాగంతో చేయి కలిపి, రాగ రంజితం కావల్సిన నేల నేడు ఇంకా తెల్లగానే వుంది.

పోలీసులను ఛేదించుకుని జనం సభావేదికవైపు కెరటాల్లా కదిలి వస్తున్నారు.

నేల కనిపించనంత జనం.

స్త్రీలు- పురుషులు

ముసలివారు- పడుచువారు

అందరూ ఈ వ్యవస్థ కాలి మడల కింద పడి నలిగినవాళ్ళే.

అందరూ తమ బతుకులతో విసిగి వేసారిన వాళ్ళే.

అందుకే అందరిలో ఇంత తెగువ.

గోండు గుండెల్లో-గూడాల్లో పెల్లుబికిన ఈ ఆవేశాలకు, తెగింపుకు కారణం ఈనాటిది కాదు. రెండుమూడు తరాలుగా వారిపై సాగుతున్న దోపిడి, దౌర్జన్యాలకు విసిగి వేసారి తిరగబడిన ఉత్తుంగ తరంగాలు వాళ్ళు.

వారి హృదయాలు భగభగమండిపోతున్నాయి. అది ఈనాడు హఠాత్తుగా అంటుకున్న మంటకాదు. వందల సంవత్సరాల బానిసత్వంలో నిస్సహాయంగా మగ్గిపోతూ ఆక్రందించిన వారి హృదయాల్లో ఎప్పటి నుండో ఆ నిప్పు రాజుకొంటూనే ఉంది....




అప్పుడు....

ఈ దేశాన్ని బ్రిటీషువాళ్ళు, తెలంగాణాను నైజాం రాజు పాలిస్తున్నారు.

ఆ రోజుల్లో హైదరాబాదునుండి ఆదిలాబాదుకు ఇప్పటిలా తారు రోడ్డులేదు. మామూలు కంకరరోడ్డే. పైన మట్టిపోసి చదునుచేసివుంది. ఆ రోజుల్లో అదే గొప్పరోడ్డు.

ఆ రోడ్డుపైన ఒక లారీ నిజామాబాదు నుండి ఆదిలాబాదు వైపు పోతోంది. అందులో ముగ్గురు మనుషులున్నారు. డ్రైవరు, క్లీనరూ కాక మరో మనిషి.

అతడి పేరు రాఘవులు.

లారీ గోదావరి నది దాటి నిర్మల్ చేరుకుంది.

"ఇంజన్ గరమయ్యింది. ఓ గంట ఆగి పోదాం"— అన్నాడు డ్రైవరు బండి ఆపి దిగుతూ. క్లీనరు రోడ్డు పక్కన ఉన్న చెరువులో నుండి నీళ్ళు తెచ్చి ఇంజనులో పోశాడు.

రాఘవులు మెల్లగా లారీ దిగాడు. చుట్టూ పరికించి చూశాడు. అదేం ఊరో అర్థంకాలేదు. రాఘవులుకు. ఎటు చూసినా నల్లటి పెద్దపెద్ద రాళ్ళగుట్టలు. ఆ గుట్టల నడుమ అక్కడక్కడ ఇళ్ళు. ఇందాక నిజామాబాద్ నుండి బయలు

దేరాక ఆర్మూర్‌లో కూడా ఇలాంటి రాళ్ళగుట్టలే చూశాడు. అప్పుడే అనుకున్నాడు మనసులో ఇదేదో దేశంకాని దేశం పోతున్నానని.

లారీ మళ్లీ మెల్లగా బయలుదేరింది. నిర్మల్ దాటి అయిదారు మైళ్ళు వెళ్ళగానే ఒక పెద్ద గుట్ట రాక్షసిలా అగుపించింది. రాఘవులు ఆ గుట్టను, గుట్టపైన కనిపించే దట్టమైన అడవిని నోరెళ్లబెట్టి చూస్తున్నాడు. అంతలోనే లారీ ఆగిపోయింది. లారీ ఆగడంతోనే క్లీనరు కుర్రాడు ఛెంగున కిందకు దుమికాడు కాబిన్ లోనుండి.

లారీ ఎందుకు ఆగిందో, క్లీనరు కుర్రాడు ఎందుకు కిందికి దిగాడో అర్థంకాలేదు రాఘవులుకు.

సుమారు యాభయి గజాల దూరంలో రోడ్డుకు కుడివైపున ఒక అరుగుంది. అరుగుపైన గోరీలు ఉన్నాయి. గోరీల మీద మెరుగు అద్దిన ఆకుపచ్చని గుడ్డలు పరిచి ఉన్నాయి. రెండు ఆకుపచ్చని జెండాలు వెదురుకర్రలతో నిలబెట్టిఉన్నాయి. అక్కడో తెల్లటి గడ్డంమునలాడు చిన్న చీపురుతో నడుంవంచి ఊడుస్తున్నాడు.

డ్రైవరు లారీలోంచి దిగకుండానే మనసులోనే ఏమో చదువుకొని చేతులతో ముఖం తుడుచుకున్నాడు.

రాఘవులు కూడా దండం పెట్టుకున్నాడు ఎందుకయినా మంచిదని.

క్లీనరు కుర్రాడు సమాధుల ముందు అగరు వత్తులు వెలిగించి, దండం పెట్టి పరుగెత్తుకొచ్చాడు. లారీ మళ్ళీ బయలుదేరింది. ఘాట్‌రోడ్డు మెలికలు తిరిగి ఉంది. ఒక్కో మలుపు తిరుగుతూ ఘాట్ఎక్కుతూ ఉంటే రాఘవులుకు గుబులు గుబులుగా ఉంది. లారీ ఘాట్‌పై మలుపు తిరుగుతుంటే మరీ బెంబేలు పడిపోతున్నాడు. ప్రాణాలను అరచేతిలో పట్టుకొని కూర్చున్నాడు.

"మంచిగ్గూసో అన్నా! ఇస్టీరింగ్ ఖాన్‌దాదా సేతుల ఉన్నదాక మన పానానికి ఏంఢోకాలేదనుకో! ఒకసారి గిట్లనే ఏమయిందంటే..." అని ఏమో చెప్పబోయాడు క్లీనరు కుర్రాడు.

అంతలోనే "చుప్ బే సాలే" అంటూ కసురుకున్నాడు డ్రైవరు. క్లీనరు నోరుమూసుకొని కూర్చున్నాడు.

రోడ్డు ఇరుకుగా ఉంది. పైగా గతుకులు. రెండువైపులా దట్టమైన అడవి. లారీపైకి పోతూవుంటే ముందురోడ్డు తప్ప కిందామీదా నేల కనిపించడంలేదు- అంతా అడవే. ఆ అడవిలో మెలికలు తిరిగి, మొద్దు నిదరపోతున్న రాకాసికొండ చిలువలా రోడ్డు. మలుపు వచ్చినప్పుడల్లా డ్రైవరు స్టీరింగ్‌ను బలంకొద్ది తిప్పుతున్నాడు. రోడ్డుకు ఒకవైపు లోతయిన లోయలు, మరోవైపు ఎత్తుగా ఉన్న గుట్టలు.

ఘాట్‌రోడ్డుమీద అక్కడక్కడ రోడ్డుకడ్డంగా రాళ్లున్నాయి. వాటిని దారినుండి తప్పించమన్నట్టు ఒకచూపు చూసాడు డ్రైవరు క్లీనరువైపు. క్లీనరు బండిదిగి, చకచకా అడ్డమొచ్చిన రాళ్లను ఏరిపడేస్తూ, "రైట్‌రైట్" అంటూ, ముందుకురుకుతూ రాళ్లను పక్కకు పడేస్తున్నాడు. అంతలోనే ఏమయిందో ఏమో "ఖర్‌గోష్... ఖర్‌గోష్" అంటూ పొదలవెంట పరిగెత్తాడు.

రాఘవులుకు ఏమీ అర్థంకాలేదు. పిచ్చిగా కళ్లు పెద్దవి చేసుకొని క్లీనరు ఎటు పరిగెత్తితే అటు చూస్తున్నాడు.

వాడు ఒకసారి పడిలేచి ఒక పొదలోంచి రెండు చిన్నచిన్న కుందేలు పిల్లలను చెవులు పట్టి పట్టుకొచ్చాడు.

ఘాట్‌రోడ్ అయిపోయింది. ఇప్పుడొక పెద్ద గుట్టమీద ఉంది లారీ. అక్కణ్ణించి చూస్తే నిర్మల్ చుట్టూ ఉన్న చెరువులు నల్లగ నిగనిగలాడుతూ కనబడుతున్నాయి. లారీ జోరుగా పోతుంది.

అక్కడక్కడ రోడ్లపైనే పిల్లలు ఆడుకుంటున్నారు. ఎవరికీ ఒంటిపైన బట్టలులేవు. దిసమొలలే. లారీ చప్పుడు వినబడగానే వేటగాణ్ని చూసిన లేడికూనల్లాగ, వదిలిన బాణాల్లాగ రోడ్డుపై నుండి పరుగెత్తుకెళ్లి చాటుగా లారీని, లారీలోని మనుమల్ని వింతగా, భయంగా కళ్లుపెద్దవి చేసుకొని చూస్తున్నారు. అక్కడ ముప్పయి నలభై గుడిసెలకు మించి ఉండవు.

అది ఒక గోండుపల్లె. దానిపేరు 'వాంకిడి'

వాంకిడి ఊరు దాటగానే లారీవేగం హఠా

త్తుగా తగ్గిపోయింది. ఏమిటి సంగతి అని చూశాడు రాఘవులు.

కాలువగట్టున పడుచు పిల్లలు కొందరు బట్టలుతుకుతుంటే— కొందరు నీటిఒడ్డున కూర్చుని స్నానం చేస్తూ కనిపించారు. చిన్న పిల్లలు నీళ్లలో పడి ఆడుకుంటున్నారు. కొంద రు గుడ్డపీలికలు మొలకు చుట్టుకొని చీరల ను వలలుగా వేసి చేపలు పడుతున్నారు. ఇద్దరు పడుచుపిల్లలు మొలవరకు పూర్తి నగ్నంగా కూర్చుని 'రేగడిమట్టి'ని రాసు కుంటూ తలకుపోసుకుంటున్నారు.

వారి నగ్నసౌందర్యానికి డ్రైవరు కాళ్లు బ్రేకు ను తొక్కాయి. అందుకే బండి హఠాత్తుగా స్లోఅయింది.

నీళ్లోసుకుంటున్న పల్లెపడతులను చూసి డ్రైవరు నీళ్లు మింగుతున్నాడు. క్లీనరు, రాఘ వులు కూడా అటువైపే చూడ్డంతో తను చూస్తు న్న అందం ఎంగిలిపడుతుందనుకున్నాడో లేక సిగ్గుపడ్డాడో మరి చూపు తిప్పుకొనియాక్సిలే టర్ నొక్కాడు. స్పీడందుకున్న లారీ చప్పు డుకు ఆడవాళ్లు తలలెత్తి చూసి వెంటనే మెడలోతు నీళ్లలోకి మునిగిపోయారు-- సిగ్గుతో.

బండి కుప్టి వాగు దాటి ఇచ్చోడ చేరింది. సంత జరుగుతోందక్కడ.

"గుడి హత్నూర్ ఇంకెంతదూరం?" అని అడిగాడు రాఘవులు.

"ఇక ముంగటొచ్చే ఊరు అదే" అని చెప్పాడు డ్రైవరు. అరగంటలో లారీ గుడిహ త్నూర్ చేరుకుంది. రాఘవులును దిగమని చెప్పి, రాఘవులు సామానులను కిందకు దింపి "రైట్" అంటూ బండిఎక్కి కూర్చున్నా డు క్లీనరు.

ఇంతదూరంతెచ్చి దింపినందుకు కిరాయి డబ్బులు ఈయటానికి బనియన్ లోపలిజేబు లోకి చేయిపెట్టాడు రాఘవులు. అది అర్థంచే సుకున్న డ్రైవరు "ఉండనియ్-- సాకారి. ముంతచేతపట్టుకొని దేశంకాని దేశం వచ్చి నవ్. నడుస్తమరి నేను. జర సంబాలించుకొని పో- ఇంద్రవెల్లికి. అక్కడ విఠల్‌సేఠ్‌కు నా సలాం జెప్పు జర" అన్నాడు.

"గట్లనే చెప్త... ఉంటమరి" అంటూ చేతు లు జోడించి వీడ్కోలు చెప్పాడు రాఘవులు.

బండి దుమ్మురేపుకుంటూ వెళ్లిపోయింది. దించిన సామానుల దిక్కు ఒకసారి చూసుకు న్నాడు రాఘవులు. ఒక బట్టల మూట, వంట సామానుల గోనెసంచి, ఒక పాతరేకుపెట్టె, ఒక పెద్దముంత - అన్నీ సరిగానే ఉన్నాయని మన సులోనే అనుకొని తృప్తిపడి, ఊరివైపు చూపు సారించాడు. రోడ్డుకు ఎడమవైపు ఒక గుడి. గుడి ముందర కాళ్లు, చేతులు విరిగిన విగ్రహా లు దిక్కుమొక్కు లేకుండా పడివున్నాయి. గుడి వెనకాలే ఉంది ఊరు. చిన్నవి, పెద్దవి కలిపి యాభయివరకు గుడిసెలుండొచ్చు.

పొద్దు పడమటి తల్లి కడుపులో పడబో తోంది. ఇంకా పూర్తిగా చీకటిపడలేదుగానీ మసకమసకగా ఉంది.

ఊరి గుడి ముందు ఒక కొత్తమనిషి కని పించేసరికి బెరుకు బెరుకుగా చూసుకుంటూ నలుగురైదుగురు మనుషులు రాఘవులు దగ్గ రకు చేరారు.

"ఏఊరు బాపు మనది?" అని అడిగాడు వచ్చినవాళ్లలో ఒక పెద్దమనిషి.

చెప్పాడు రాఘవులు.

"ఎవరింటికొచ్చినావు?"-- అని ఇంకోమ నిషి అడిగాడు.

"ఇంద్రవెల్లి పోవాల" అన్నాడు రాఘవు లు.

"అట్లన. మరి గిప్పుడెట్ల బోతవ్? గిప్పుడెక్క డికెల్లి ఎల్లినా తొవ్వల్నే నాత్రైతది. అదిగాక అడివి తొవ్వ. సోపతి లేకుంట ఒక్కనివి పోవా ల్నంటే ఒశపడదు" అన్నాడు ఇంకోమనిషి.

"ఈడికెల్లి మస్తు దూరమా ఇంద్రవెల్లి" అడిగాడు రాఘవులు.

"దూరమంటే దూరంకాదు, దగ్గరంటే దగ్గ రగాదుగని. పగలయితే ఎట్లనో అట్ల పోవచ్చు. ఇప్పుడు రాత్రి యాల్ల. ఒక్కడివి. నీతాట సామాన్లు కూడ ఉన్నయ్. గివన్నీ బట్టుకొని ఒక్కనివి ఎట్లబోతవ్? రేపొద్దుగాల్లయితే ఎవ్వ ల్నన్న బిగారికి మాట్లాడుకొని పోవచ్చు"

"ఆఁ... గట్లనే జెయ్. ఇయాల నేతిరి ఈణ్నే

పండి, రెప్పొద్దుగల్ల బోదువుగాని, రా'' అంటూ తలాఒక సామాను పట్టుకొని ఊళ్లోకి నడిచారు. వాళ్లవెనుకే కదిలాడు రాఘవులు. ముందు నడుస్తున్నవాళ్లలో ఒక పెద్దమనిషి ఒక ఇంటి ముందు నిలబడి ''శంకరీ...! ఈ బాపును ఈ రాత్రి మీ ఇంట్ల ఉండనియ్యి. ఇంద్రవెల్లి పోవాల్నంట. ఇక్కడికచ్చేతరికే సీకటయింది. రేప్పొద్దుగాల్ల లేసిపొమ్మని మేమే పట్కచ్చి నమ్'' అని చెప్పి సూరుకింద సామాన్లు పెట్టించాడు.

''గట్లనే ఉండనియ్యరాదు. గిట్లచ్చి గీ నుల. కమంచంమీద కూసో'' అంటూ మంచం వాల్చాడు శంకరి.

వచ్చినవాళ్లందరు ఒక్కొక్కరే వెళ్లిపోయారు కాసేపు ఆమాటా ఈమాటా మాట్లాడి.

అది చలికాలం కావడంతో పొద్దుగుంకేసరికే చలిమొదలయింది. ఇంటిముందర నెగడంటించి మంచంతెచ్చి నెగడు పక్కనేసి రాఘవులును కూర్చోమన్నాడు. రాఘవులు మంచంలో కూర్చున్నాడు. శంకరి తునికాకుతో చుట్టజేసి పొగాకు నింపుకుంటూ ''ఏంపని మీద బోతున్నవ్ ఇందరవెల్లికి?'' అని అడిగాడు.

''అక్కడ మా కులపోల్లు యాపారం జేసుకుంట శానాఏండ్లబట్టి వుంటన్నరు. నేనుగూడ అటేబోయి నాలుగొద్దులు కాల్జెయిగొట్టుకుంటే నాలుగురాళ్లు ఎనకేసుకోవచ్చని ముంతవట్టుకొని గిట్లఎల్లిన. మన కిస్మత్ ఎట్లున్నదో జూడాల'' అన్నాడు రాఘవులు.

''గట్లజెప్పు... అయితే మీరు కోమట్లన్నట్టు. ఇటు బందుకు మీ యాపారం బాగనే సాగుతది. దానికేం ఢోకలేదుగని సావుకారీ! ఈ రేత్తిరికి నీ తిండి సంగతెట్లంటవు? ఈ ఊల్లె మీ సేయి గలిసెటోల్లెవలు లేరు. నువ్వే ఎట్లనో అట్ల తిప్పలువడు'' అన్నాడు శంకరి.

నెగడు బాగా అంటుకొని జోరుగా మండుతోంది. అన్నాలు తిన్న పిల్లలు మూతులు తుడుచుకుంటూ నెగడు చుట్టూ చేరారు. ''నా జాగా'' అంటే 'ఇది నాజాగా' అంటూ పోటీలు పడితోసుకుంటున్నారు.

శంకరి రాఘవులుకు బావిని చూపించి- ''పోయి కాల్లు-జేతులు కడుక్కో'' అని తను ఇంట్లోకి వెళ్లి ఓ ఇత్తడి గిన్నెలో కాసిన్ని బియ్యం, కాస్తంత పెసరపప్పు పోసి రెండు ఉప్పురాళ్ళు కూడా వేసి తీసుకెళ్లి బావిదగ్గరున్న రాఘవులుకు ఇస్తూ అన్నాడు-'' గివి ఉడికిచ్చుకో. పులగంలకు పెరుగున్నది. నెయ్యి ఏసుకొని ఈ రాత్రికి ఎట్లన్న కడుపు నింపుకో. ఏంజేద్దాం మరి! మా తిండేమో మీకు పడదాయె. ఏదో గటక-పప్పు తినేటోల్లం. జల్దిగా నియ్... తిని పండచ్చు. ఎప్పుడు తిన్నవో ఏమో!''

రాఘవులు బియ్యం, పప్పు కడుక్కొచ్చాడు. ఈలోగా శంకరి మూడు రాళ్ళతో పొయ్యి అమర్చి నిప్పు అంటించాడు. రాఘవులు ఇత్తడి గిన్నెలో కొలతకు నీళ్ళుపోసి పాత్రను పొయ్యి మీదుంచాడు.

అటు అన్నం కుత-కుత ఉడుకుతుంటే... ఇటు ఇద్దరూ ముచ్చట్లలోపడ్డారు.

''లగ్గమయిందా నీకు సవుకారి?'' అని అడిగాడు శంకరి.

''అయింది. ముగ్గురు పిల్లలు సుగ ఉన్నరు'' అన్నాడు రాఘవులు నెగడు పుల్లలను ఎగదోసుకుంటూ. చలి ఎక్కువగా ఉంది. నెగడు ముందు నుండి వెచ్చగా తగులుతుంటే, వెనుక వీపులోంచి చలి వణుకు పుట్టిస్తోంది.

''మీ అక్కడ లవు సలి ఉండేతట్టుంది'' అన్నాడు రాఘవులు చేతులతో చలికాగుతూ.

''గిప్పుడే ఏం జూసినవు. ఇంకా ఒక గంటాగు. సలి పులిలాగ వస్తది. అప్పుడు కడుపుల పేగులు గడ్డకడ్తయి! ఏమనుకుంటున్నవో. అయినా గీ సలేం సలి. గట్ల బోత్ పట్టీకి పోయి జూడు. ఎండకాలంల కూడా సలివెడ్తది. జంగల్ సివారం గదా ఈ పట్టీ అంత. అందుకని సలి ఎక్కువగనే ఉంటది. మన మాటలకేంగాని గటు జూడు- అన్నం ఉడికినట్టుంది. మూతవెట్టి ఉమ్మగిలెయి. నెయ్యి దెప్పిస్త. జెల్దీ తిండి కానియ్.ముడుసుకొని పండుకోచ్చు'' అంటూ ఇంట్లోకి భార్యను కేకేసాడు. ''ఏందే... సవుకారి కింత నేయి. పెరుగుపట్కచ్చియి!'' అంటూ.

శంకరి భార్య ఓ గిన్నెలో నెయ్యి, ఒక

ముంతలో పెరుగు తెచ్చి అక్కడ పెట్టింది. వాళ్ళ ప్రేమ- ఆప్యాయతలకు రాఘవులు అబ్బురపడిపోయాడు. 'వాళ్ళెవరు? తనెవరు? చుట్టంలాగ మర్యాద చేస్తున్నారు' అనుకొని మనసులోనే వాళ్ళ మంచితనానికి దండంపెట్టాడు. పులగంలో కమ్మటి నెయ్యి వంచుకొని, పెరుగు కలుపుకొని తింటుంటే అమృతం తాగినట్లే అనిపించింది రాఘవులుకు.

ముచ్చట్లు చెప్పుకుంటూ తీరిగ్గా భోంచేస్తున్నాడు రాఘవులు. అంతలోనే గుర్రం మీద సామానువేసుకొని వచ్చాడొకాయన. రావడంతోటే- "రామ్‌రామ్ శంకరన్న" అని పలకరించి గుర్రాన్ని అక్కడో గుంజకు కట్టేసాడు.

నెగడు వెలుగు కళ్ళలో సూటిగా పడుతుంటే సరిగ్గా కనబడక కళ్ళకు చేయి అడ్డంగా పెట్టుకొని చూస్తూ- "ఎవలూ" అన్నాడు శంకరి.

"నేనేనే శంకరన్న... రాందాసును"

"నువ్వా రాందాసు! బాగా పొద్దుబోయినంక అచ్చినవెందే అన్న"

"అవన్న పొద్దే వొయ్యింది. ఇయ్యాలెందుకో మరి ఈ గుర్రం నడువకపాయే. 'ఇచ్చోడ' అంగడి జూసుకొని అస్తున్న" అని గుర్రం మీదనుండి దించిన బట్టల మూటలు తెచ్చి చూరు కిందపెట్టాడు.

"అరే... పిల్లగా చిన్నోడా!గా కొట్టంల మూలకు సాప్పున్నది. తెచ్చి గీ గుర్రం ముంగటెయిరా!" అని కొడుకుకు చెప్పాడు శంకరి. మళ్ళీ రాందాసు వైపు తిరిగి "నువ్వియాల్ల అస్తవన్న మాటే యాదిలేదు నాకు. ఇగో గీ సవుకారన్న దూరం దేశం నుండచ్చిండు. ఇందరవెల్లికి పోవాల్నంట. రేపు నీ పీడ అంగడి కానిచ్చుకొని ఇందరవెల్లి బోతవుగద! జర ఈ అన్నను కూడ నీ యెంట వెట్టుకొనిపో. ఈయనకు ఇటుపక్క ఏంతెల్వదు"

శంకరి వాళ్ళిద్దరికి పరిచయం చేయించాడు.

ఇద్దరు ఒకరికొకరు "రామ్‌రామ్" చెప్పుకున్నారు.

"రేపు ఇక్కడ అంగడయిపోయినంక కలిసి పోదాం" అన్నాడు రాందాసు.

"నువ్వేం యాపారం జేస్తవ్" అడిగాడు రాఘవులు.

"అంగళ్ళు తిరుక్కుంట కుట్టిన బట్టలు, అంగీలు, అంగరఖలు, చెడ్డీలు, కుల్లలు, ధోతులు, దుప్పట్లు అమ్ముత. ఆరంల అయిద్దినాలు అంగట్లల్లనే గడుస్తది" అన్నాడు రాందాను చుట్టలో నిప్పు పెట్టుకుంటూ.

"మరి బట్టలెప్పుడు కుడతవ్?"

"బట్టలు నేను కుట్ట. నా బారియ, మాతల్లి, తమ్ముడు గుడతరు. అల్లపని కుట్టి పెట్టుడు నా పని యాడాదిపొద్దు అంగల్లల్ల దిరిగి అమ్ముకచ్చుడు" అని కాలిన కట్టెలను చితకగొట్టి కట్టెలను నెగడులోకి ఎగదోస్తూ- "ఇందరవెల్లిల ఎవరున్నరు నీకు? ఎవరింటికి పోవాల?" అని అడిగాడు.

'ఇత్థల్ సౌకారి నీకెర్కాటేనా? ఆయన నాకు దూరంకెల్లి పెదనాయినవుతడు. ఇంక శానా మంది దూరంకెల్లి సుట్టాలవుతరు. అందరు ఈ వట్టికే వచ్చి బతుకుతున్నరు. అల్లతీరంగనే నేను బత్కుదమని వచ్చిన"

"ఇత్థల్ సౌకారి నాకెరికెనే. ఆయనది శాన పెద్ద దుకానం. ఇందరవెల్లిల మార్వాడోల్లు, బాటోల్ల తరువాయి ఇత్థల్ సేటుదే పెద్దసేయి యాపారంల"

"ఆ నడుమ మా తల్లి కాలం జేసినప్పుడు సూసిపోను మా ఇంటికి వచ్చిండె. అప్పుడే సెప్పిండు- ఇందరవెల్లికిరా! అక్కడ్నే ఏదన్న దందజేసుకొని బతకచ్చుని. అందుకని గిప్పుడా యన్ని గలతందుకని ఎల్లిన"

"మంచిదే... రేప్పొదాంగని. శాన రేతిరయింది. సలిగూడ ముదిరింది. ఇక పండాం. మల్ల పొద్దుగాల్నె లేవాలగద!" అంటూ రాందాసు లేచాడు.

ఎవరి పక్కలకు వాళ్ళు చేరారు.

తెల్లవారి రాఘవులు లేచేసరికి చాలా పొద్దు పైకెక్కింది. పక్కన చూస్తే రాందాసు లేడు. రాఘవులు లేచి కాలకృత్యాలు తీర్చుకొని తనకు, రాందాసుకు కలిపి పప్పు అన్నం వండాడు. తరువాత ఊరు చూద్దామని వెళ్ళాడు.

రోడ్డు పైనే అంగడి. రోడ్డుకు రెండువైపులా వరుసగా దుకాణాలు అమర్చుకున్నారు వ్యాపారులు.

కుంకుమ, దాసెన, బుక్కగులాలు, చకుముకి దూది, కాటుక దుకాణాలు, కుట్టిన బట్టల దుకాణాలు, కూరగాయల దుకాణాలు, వెదురుతో అల్లిన బుట్టలు, గంపలు, తడకలు ఉన్నాయి. చేపలు, పూసలదండలు, నబ్బులు, చెప్పులు, భజన పుస్తకాలు అన్నీ ఉన్నాయి దుకాణాల్లో. చెవులు కుట్టేవాళ్ళు, పచ్చబొట్లు పొడిచేవాళ్ళు, మసాలా దినుసులు, కారం- తీపి దినుసులు అమ్మేవాళ్ళు అందరూ ఉన్నారు.

జనం చాలా ఉన్నారు. వారానికి ఒకరోజే అంగడి. అంగడి రోజు తప్పితే మళ్ళీ వారం అంగడి వరకు ఏందొరకవు. అందుకే చుట్టుపట్ల పల్లెజనాలు అంగడికి వస్తారు. కావలసినవి కొనుక్కుంటారు. అంగడి దినం అంటే ఆ పల్లె ప్రజలకు చిన్న పండగకిందే లెక్క.

అంగడి అయిపోయాక రాందాసు, రాఘవులు శంకరి దగ్గర సెలవు తీసుకొని బయలుదేరారు. గుడిహత్నూర్ నుండి కొంతదూరం నడిచాక రాందాసు కుడివక్కకు గుర్రాన్ని మళ్లించాడు. అది చూసి- "మరి గిట్ల సక్కగబొయ్యే తోవ యాడికి బోతది?" అని అడిగాడు రాఘవులు.

"గా తొవ్వ ఎదులాపురం బోతది" అంటూ గుర్రాన్ని అదిలించాడు.

బట్టల మూటలు, రాఘవులు సామాన్లు అన్నీ గుర్రం వీపుమీద వేసి ఉన్నాయి. ఇద్దరూ చేతులూపుకుంటూ, ఈమాటా- ఆమాటా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు.

చీకటి పడకముందే ఇంద్రవెల్లి చేరుకున్నారు వారు. విఠల్‌సేఠ్ దుకాణం ఇంకా తెరిచే వుంది. షావుకారు గల్లాపెట్టె ముందు కూర్చుని రూపాయలు లెక్కపెడుతున్నాడు. వక్కనే ఒక గుమాస్తా కల్దార్, హాలీ నాణాలు వేరుచేసి లెక్కకడుతున్నాడు.

రాందాసు గుర్రాన్ని వక్కన కట్టేసి- "దండాలు నవుకారీ!" అంటూ వలకరించాడు.

"దండాలు దండాలు! ఏంరాందాసా ఇదే రాకడనా" అని వేలికి ఉమ్మద్దుకొని నోట్లు లెక్కపెడుతున్నాడు. రాఘవులు ఉనికినే ఆయన గమనించలేదు. రాఘవులు మాత్రం దుకాణాన్ని పరీక్షిస్తున్నాడు.

దుకాణంలో నరుకులు ఎక్కువ రకాల్లేవు. కాని ఉన్నవి మాత్రం పెద్దయెత్తునే ఉన్నాయి. ఒకవక్క బియ్యం బస్తాలు, బెల్లంముద్దలు, ఉప్పుబస్తాలు, బీడీకట్టలు, మంచినూనె, కిరసనాయిల పీపాలు ఉన్నవి. ఇంకోదిక్కు తెల్లగా మంచుగుట్టల్లా పత్తి పొందికగా అమర్చి ఉంది.

దుకాణం ముందర నౌకర్లు నువ్వులను బస్తాలకు ఎత్తుతూ తూకం వేస్తున్నారు. సారవప్పును డబ్బాల్లో నింపుతున్నారు. నలుగురు మనుషులు బయటఉన్న పత్తిని తెచ్చి లోపల పొందికగా పెట్టడానికి గుట్టలాగ వేసి కాళ్ళతో తొక్కుతున్నారు.

దుకాణంలో ఒక మూలకు చెక్క అలమారాల్లో బట్టలు కూడా ఉన్నాయి. చీరెలు, ధోవతులు, చీటి గుడ్డలు, సైను గుడ్డలు తాన్లకుతాన్లే ఉన్నాయి. అక్కడే ఒక ముసలి గుమాస్తా కూర్చుని ఎర్రటి మూరెడు పొడుగున్న ఖాతాపుస్తకంలో పద్దులు రాస్తున్నాడు.

గల్లాపెట్టె పైన లక్ష్మీదేవిపటం వుంది. ఆ వక్కనే గణపతి, వేంకటేశ్వరస్వామి పటాలు అమర్చి ఉన్నాయి. పటాల ఫ్రేములకు కాలిన అగరువత్తుల పుల్లలు కట్టలుకట్టలుగా అలాగే ఉన్నాయి. గోడకు రంగులతో లక్ష్మీదేవి పటం రాసి వుంది. లక్ష్మీదేవికి రెండువైపుల రెండు ఏనుగులు పూలదండలు పట్టుకొని ఉన్నాయి.

రాఘవులు ఇవన్నీ గమనిస్తూ నిలబడిపోయాడు. రాందాసు, విఠల్‌సేఠ్ మాట్లాడుతూనే ఉన్నారు. సేఠ్ నోట్లు లెక్కపెట్టుకుంటూనే మాట్లాడుతున్నాడు.

"నా బేపారానికేంది! ఏదో సాగుతనే ఉంది. గీయన మీకేర్పాటేనట గద! నిన్న లారీలవడి గుడిహత్నూర్‌దాక అచ్చిండు. ఇయ్యాల నేను ఎట్లన్నగిటే అస్తున్న గదనని ఎంటబెట్టుకొచ్చిన" అని రాఘవులువైపు చేయి చూపించాడు.

విఠల్‌సేఠ్ రాఘవులు వైపు ఒకసారి తేర

పారి చూసి- "ఎవరూ... రాగవులా! ఆర్నీ ఎప్పుడు జెప్తె ఎప్పుడొస్తివిరా? అంత బాగ నేనా?" అని పలకరించి- "అరేయి సాంబు లు... గీయన్ని మనింటికి దీస్కెల్లురా" అని చెప్పి, మళ్ళీ రాఘవులు వైపు జూసి- "మన సుట్టాలందరు మంచిగున్నరు గద. ఎందో అటుదిక్కు అచ్చి శానొద్దులయింది. ముందు నీవింటికెల్లు. నేను ఓ గంటాగినంకన్త అంతట్ల నీ తిండి గిట్ల గాని" అని ఎవరేం చేస్తున్నారో అని నౌకర్లవైపు జూసి, రూపాయల నోట్లన్ని ఒక గుడ్డలో కట్టి ఎర్రటిచేతిసంచిలో పెట్టుకు న్నాడు.

'నేనిగ ఎల్లొస్తా రాందాసన్న" అని గుర్రం మీది సామాన్లలో తనవి తీసుకొన్నాడు. బరువుగా వున్నవి సాంబనికిచ్చి, తేలిగ్గా ఉన్నవాటిని తను పట్టుకొని బయలుదేరాడు రాఘవులు.

"మంచిది ఎల్లిరా అన్నా! రేపు ఈణ్నే అంగడి సాగుతది అచ్చి కలువు. నేనే అచ్చి కలున్తను గాని తీర్కె ఉండదు. మల్ల దుకానం ఇడిసిపెట్టి రారాదాయె" అంటూ గుర్రం లగాం అందుకున్నాడు రాందాసు.

"గట్లనే... నేనే అచ్చి కలున్త. ఎవరెస్తే ఏంది నేనే అస్త! నడున్త మరి.... రామ్‌రామ్" అంటూ సాంబన్ని అనుసరించాడు రాఘవులు.

★ ★ ★

రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతంలో విఠల్ షావుకారు ఇంటికి వచ్చాడు. అప్పటికే రాఘవు లు భోజనంచేసి పెద్దమ్మతో ముచ్చట్లు మొద లుపెట్టాడు.

విఠల్ షావుకారుకు ఆరోజు ఉపవాసం. ఒంటిపూట భోజనం. రాత్రి భోంచేయడు. ఒక అరకిలో అటుకులు- నూనె పోసి ఉప్పుకారం వేసి కలిపిస్తే తింటాడు. తరువాత ఒక పెద్ద గ్లాసెడు చాయ్. అది అతడి ఉపవాసంరోజు కార్యక్రమం.

తూగుటూయల్లో కూర్చొని ఒక్కొబుక్క అటు కులు నోట్లో వేసుకుంటూ- "అయితే ఇక్కడ ఏదయినా యాపారం జేస్తనంటవ్. బాగానే ఉంటది. కాని బాగా కష్టపడాల. కష్టమంటే రాళ్ళు గొట్టుడు గాదు. రప్పలు ఏరుడుగాదు. మంచి తెలివిడితోని, తియ్యటి మాటలతోని పనిజేసుకోవాల. ఇటు పట్టెకన్నీ గోండుపల్లెలె. ఇప్పుడీ నడకు దిగి- లోపలికి పోతే అంతా అడివే. అక్కడోపల్లె, ఇక్కడో పల్లె ఉంటది" అని ఆగి ఓ పిడికెడు అటుకులు నోట్లో పోసుకొని నములుకుంట పెండ్లాంవైపు తిరిగి- "అదేందే! ఇండ్ల పుట్నాలే సరింగ కలవలే. జరిన్ని పట్కరా అట్లనే ఒక ఉల్లిగడ్డ కోసితే" అని చెప్పి- "ఈ దగ్గరి పల్లెలోల్లంతా రోడ్డు మీదికి అచ్చి పట్టినయన్ని గీ అంగట్లల్లనే కొనుక్కపోతరు. అందుకని దగ్గరి పల్లెల మన యాపారం అంత ఇదిగా సాగది. మన యా పారం జోరుగా సాగాల్నంటే లోపల పల్లెల కెల్లాల. అక్కడ మన మాటకు మనమే రాజులం. ఎంత చెప్తే అంత. ఇచ్చిందే నయి. చూసెటోడు ఉండడు. అడిగెటోడు అసలుండ డు" అంటూ అటుకుల గిన్నె పక్కనపెట్టి గ్లాసెడు నీళ్ళు గటగటా తాగి మళ్ళీ చెప్పటం మొదలుపెట్టాడు-

"ఈ పల్లెల్ల అన్నీ గోండ గుడిసెలు. పేరుకే గొండ గుడిసెలు గాని బంగారం పండిస్తరు, ముండకొడుకులు. దాన్నె మనం పైన చేసుకో వాల. ఆల్లకు ఏం గావాల్నో తెలుసుకొని అవి దుకానంల నిండుకోకుండా సూడాల. అట్లుంటే నాలుగేండ్లల్ల నలపై ఎకరాల ఆసామి గావ చ్చు. ఇల్లుమీద ఇల్లు గట్టొచ్చు" అంటూ వ్యాపార రహస్యాలు, కిటుకులు అరకిలో అటు కులు ఆరగించేలోపున చెప్పి బ్రేవ్‌మని తేన్చా డు.

అటుకుల గిన్నె కింద పెట్టగానే పెద్దగ్లాసె డు చాయ్ తీసుకొచ్చింది భార్య.

"అయితే రేపు పొద్దుగాల్లనే మనిషిని తోడి చ్చి పంపుత. బండి కట్టుకొని- సామాన్లు తీస్కొని పో. మంచిజాగా జూసుకొని దుకానం తెరువు" అంటూ గ్లాసెడు చాయ్ ఊదు కుంటూ తాగేసాడు.

రాత్రి పక్కమీద పడుకున్నా రాఘవులుకు నిద్ర రావడంలేదు. వ్యాపారం చేసే ఊరు ఎలా ఉంటుందో? దుకాణం ఎలా నడపాలి? దుకాణంలో ఏమేమి సామాన్లు ఉండాలి. దు కాణం కొరకు ఏమేమి సామాన్లు కావాలి? ముందు తక్కడ కావాలి... అని మనసులో



అనుకున్నాడు. గల్లాపెట్టె ఉన్నాలేకున్నా రోజా పూజచేసుకోటానికి ఒక లక్ష్మీదేవి పటం ఉండాలి... ఇలా ఆలోచించుకుంటూ నిదురలోకి జారిపోయాడు.




మరునాడు రాఘవులుకు విఠల్ సావుకారు ఒక బండినిండా సరుకులిచ్చి, తోడుగా ఒక మనిషినిచ్చి రోడ్డుకు దూరంగా అడవి లోపలి ఒక పల్లెకు ప్రయాణం కానిచ్చాడు.

బండి ఇంద్రవెల్లి నుండి కొంతదూరం వెళ్లాక రోడ్డుదిగి బండి బాటలో పడింది. బాటకు రెండు వైపుల దట్టమైన అడవి. ఆకాశాన్నంటినట్లున్న టేకు చెట్లు. దట్టంగా అల్లుకున్న పొదలు. అక్కడక్కడ పెద్ద పెద్ద ఇప్పచెట్లు- చెయ్యెత్తు మనుషులు ఇద్దరు కావలించుకున్నా చేతుల్లో ఇమడనంత లావుగా వున్నాయి. ఉసిరిక చెట్లకైతే లెక్కేలేదు. అక్కడక్కడ అమ్ముల పొదల్లా వెదురు చెట్ల గుబుర్లు.

ఒక్కొక్క పల్లెనే దాటుతున్నారు. పల్లెలు అంటే చాలా చిన్న పల్లెలు. ఏ పల్లెలో ఇరవై ముప్పయి గుడిసెలకు మించి వుండవు. వాటిని పల్లెలు అనేకంటే 'గూడెం' అంటే సమంజసంగా ఉంటుంది. అన్ని ఇళ్ళూ తడికెలతో కట్టి మట్టితో మెత్తినవే. పైన గడ్డితో వేసిన కప్పు. మట్టి తడకలను తడవనీయకుండా కిందుగా దించిన చూరుకప్పు. అక్కడక్కడ చింత బూడిదతో వెల్లవేసిన అదోరకం తెలుపు గోడలు. గోడలకు సున్నం వేయడం వాళ్లకు తెలియదు. ఎర్రమట్టితో వేసిన చిన్న చిన్న అరుగులు.

ఇలాంటి పల్లెలు చాలానే దాటారు.

దారి సరిగాలేదు. అన్నీ గతుకులు, రాళ్లు. బండి బాగా కుదేస్తోంది. సామానుల బండిలో- ఇలాంటి గతుకుల బాట వెంట వెళ్లడం ఇదే మొదలు రాఘవులుకు. ఇబ్బందిగా వుంది. ఇదేం గమనించకుండా బండి జోరుగా పోనిస్తున్నాడు సాంబు. సాంబు ఏమీ ఇబ్బందిపడుతున్నట్టు లేదు. హుషారుగానే అదిలిస్తున్నాడు బండి. అటువైపు పల్లెలతో, జనంతో బాగా పరిచయం ఉన్నట్టుంది. ప్రతి పల్లెలో కనీసం ఒకరిద్దరు అతన్ని పలకరిస్తున్నారు. ముచ్చట్లుపెడుతున్నారు. వాళ్లు మాట్లాడుకునేది ఏమీ అర్థం కావడంలేదు రాఘవులుకు. అందుకని సాంబుని అడిగాడు.

"మీరు మాట్లాడేది ఏం బాస?"

"ఇది గోండోల్ల బాస"

"నీకు గోండ బాస సొంతం అస్తదా?"

"ఆఁ... సొంతం అస్తది. ఎందుకంటే మా సావుకారి ఈ పల్లెల్ల వసూలికి వంపుతడు గదా- అందుకని. అదిగాక ఇటు పట్టెకు ఉండేటోల్లకు అందరికి గోండుబాస, లంబాడిబాస, మరాటీ బాస అస్తయి"

"ఈ గోండోల్లకు తెలుగు రాదా?"

"రాదంటే రాదని కాదు... అస్తది. కాని అల్లతోని పని తీసుకోవాల్నంటే మనకు గోండ బాస రావాల. లేకపోతే ఉలకరు పలకరు. ఉత్త మంకుజాతి ఈల్లది. మననుకొస్తే మాట్లాడ్తరు, లేకుంటే అల్లదారి అల్లది– మనదారి మనది. ఇంకోల్ల జోలి జట్టు పడది ఈల్లకు....." అని ఏదో చెప్పబోతుంటే హఠాత్తుగా ఎద్దులు బెదిరినయి.

దారికడ్డంగా ఒక దుప్పుల మంద చకచకా ఉరికిపోవడంతో ఎద్దులు బెదిరి నిలబడిపోయాయి.

"అవి ఏంటివి?" అని అడిగాడు రాఘవులు- అవి జింకలో, దుప్పులో అతడికి సరిగా తెలియక.

"దుప్పులయ్యా... దుప్పులు. ఇసుంటివి ఈ అడవినిండా మస్తుగుంటయి. గిప్పుడేం జూసినవ్, మాపిలనైతే ఒక్కోసారి పెద్దపులే బండికి అడ్డమైతది. అందుకని నేతెరిపూట




ఎవల్లూ ఈ దార్లపొంట ఒక్కల్లు నడిసిపోరు''

''ఈ పెద్ద పులులు ఊల్లెకు కూడా అస్త యా?''

''అవ్... మస్తుమాట్లు అస్తయి. ఈ పెద్ద పులులు ఊల్లెకు తక్కువస్తయి కాని కల్లాలప్పు డు సేన్లకు అచ్చి పసువుల్ని, అడ్డమైతే మను సుల్ని సంపుతయి. ఊల్లెకు ఎక్కువ సిరుత పులులు, తోడేళ్లు అస్తయి''

రాఘవులుకు చిన్నగా భయమేసింది. ఈ రాళ్లల్లో, రప్పల్లో, ఈ అడవి మధ్య పులుల నడుమ ఈ మనుసులు ఎట్లా బతుకుతుంటా రో అర్థం కాలేదు. అదేమాట సాంబుతో అన్నా డు-- ''గీ పులుల నడుమ బతుకుడుకంటే ఆట్ని సంపితే అయిపాయెగదా! గీ పులుల్ని సిరుతపులుల్ని ఎవలూ సంపరా?'' అని అడి గాడు.

''ఎందుకు సంపరు. పెద్ద పెద్ద దొరలు యాడాది పొడుగుతా సికారికి అస్తనే ఉంటరు. కాని పెద్దపులిని సంపాలంటే కలేజా పెద్ద గుండాల. ఉత్త బందూకుంటే సాలదు. శానా మంది పులి సికారికని అచ్చి కుందేళ్లు, జింక లు సంపి పట్కపోతరు. అయినా ఎంత లేద న్న అయిదారు పులులు పతియేటా సస్తనే ఉంటయి ఈ సికారి పేరుతోని'' అంటూ సాంబు చెపుతుంటే రాఘవులు కళ్లు ఇంత చేసుకొని వింటున్నాడు.

ఎప్పుడూ విన్న ముచ్చట కాదు. ఆసక్తిగా వింటున్నాడు రాఘవులు. కాని సాంబు చెపు తున్న ముచ్చట్లు బండి చప్పుడుకు, ఎద్దుల మెడలో ఉన్న మువ్వల చప్పుడుకు సరిగా వినిపించటం లేదు. సరిగా వినటానికి అన్న ట్టు సాంబుకు దగ్గరగా జరిగి కూర్చున్నాడు.

బండి సాగుతూనే ఉంది.

ముచ్చట్లు నడుస్తూనే ఉన్నాయి.

మిట్ట మధ్యాహ్నమయింది.

బండి ఒక ఊళ్లో ఆగింది.

''ఇదే అయ్యా... మనం ఆగే ఊరు. ఇది తమాం గొండపల్లె. పేరు పిట్ట బొంగారం. ఈ ఊల్లెనే సేఠ్ మనని దుకానం తెరవమన్నడు'' అంటూ బండి దిగి ఎడ్ల మెడమీదినుంచి కాడి దింపి కింద పెట్టాడు.

అంతలోకే బిలబిలమంటూ పదిమంది మూగారు. అందరూ సాంబుకు తెలిసిన వాళ్లే. ''రామ్ రామ్'' అంటే ''రామ్ రామ్'' అనుకొ న్నారు.

''గీయన మన విఠల్ సేఠ్ సుట్టం. ఈ ఊల్లె ఒక దుకానంకూడ లేదు. ఒక దుకానమన్న తెరిపించండ్లని శానారోజుల్నుంచి శానామంది చెప్పవట్టిండ్లు. అందుకని పరదేశంకెల్లి ఈయ న్ని పిలిపించి ఇగో గీ సామాన్లిచ్చి పంపిండు- దుకానం నడిపీయమని. ఎవరన్న గింత జాగ జూపిస్తే- ఆడనే దుకానం తెరుస్తడు'' అంటూ సంగతి వివరించాడు.

అంతలోకే పటేలు, గొండు కులపెద్ద 'మొ కాషి' వచ్చారు. [illegible] సంతోష పడ్డారు.

''ఇంకెక్కన్నో ఎందుకు? మన కొట్టం బేకార్ గనే పడి ఉంది. ఇప్పటికి దాంట్ల ఉండనియ్యి. రేపు దాన్ని ఇంకా సవరిచ్చి మేడెలేసి మస్తు తోని మెత్తితే అంద్లనే ఉండచ్చు'' అంటూ పటేల్-- ''అరే కాశీరాం... గా కొట్టం గంపెం సాపుజేసి ఉంచురా'' అంటూ సుంకరోన్ని పిలిచి చెప్పాడు.

కాశీరామ్ అప్పుడే కొట్టం శుభ్రం చేయటం మొదలుపెట్టాడు.

మొకాషి అత్రం రామారావు- ''నిన్ను వల్ల ఇఠల్ సేఠ్ లావు మంచి పని చేసిండు. గీ ఊల్లె ఒక దుకానం కూడ లేదు. మేము శానా ఇదయిపోతున్నమనుకో. ఇంద్రవెల్లి ఎళ్లినప్పు డల్లా నేను చెప్తనే ఉన్న-- ఎట్లన్నజేసి ఒక దుకానం మా పిట్టబొంగారంల తెరిసెటట్టు సూడమని. ఇన్నాళ్లకు ఆ అయ్యకు మామీద దయగలిగింది... అదే పదేలు'' అంటూ కూర్చుని పెద్ద తలపాగలోంచి సగం తాగి దాచుకున్న చుట్టను తీసి చకుముకి రాయితో నిప్పుజేసి దూదికంటించి ఆ దూదిని తీసి చుట్టలో వేసాడు. చుట్టను రెండు చేతుల నడుమ చిత్రంగా బిగించి పట్టుకొని గంజాయి దమ్ములాగినట్టు ఒక్క దమ్ములాగాడు. పొగ గుండెలనిండా నిండిందేమో నోట్లోంచి చుట్ట తీసి మెల్లగా పొగ వదిలాడు.

కాశీరాం కొట్టం శుభ్రం చేయగానే సాంబు



గబగబా సామాన్లు సర్దిపెట్టాడు. ఈలోగా ఆత్రం రామారావు మొకాషి ఒక పిల్లాడితో పాలు తెప్పించి రాఘవులుకు ఇచ్చాడు.

"ఇక్కడ గా దేశపోల్ల చాయ్ గింత ఏమీ దొరకదు. పాలు, పెరుగు, సల్ల, ఎంత గావా ల్నంటే అంత దొర్కుతయి. మరి నీ తిండి సంగతి ఎట్ల?" అని అన్నాడు రామారావు.

"మా ఇఠల్ సేఠ్ ఈయనకు పెదనాన్నవుత డు దూరంకెల్లి. సద్ది కట్టిచ్చి పంపిండు. ఇయ్యాల తిండికేం ఫికర్లేదు" అన్నాడు సాంబు- దుకాణం అమరిక కుదిరిందా లేదా అని చూసుకుంటూ.

మొకాషి కూడా దుకాణాన్ని ఒకసారి కళ్ళ నిండా చూసుకొని- "అయ్యా! ఇక ఇయాలిటి కి ఇంతటితోని ఉండనియి. రేపు మంచి దివసం. రేపే యాపారం సురుజెయ్యి. ఇక నేను నడుస్తమరి. ఏమన్న పనివడ్తే అడుగు. ఇది మీ ఊరే అనుకొ. కొత్తజాగ|అని ఏం ఇది గాకు. ఇక నువ్వు మా మనిషివి. అస్తమరి" అంటూ వెళ్ళిపోయాడు.

కొత్తప్రదేశం కావడంతో రాఘవులుకి నిదుర రావడం లేదు. "అవు సాంబ! ఇక్కడ దుకానం జోరుగ నడస్తదంటవా? సూడబోతే అన్నీ గలిపి నూరు గుడిసెలు కూడా లేవాయె" అని తన అనుమానం వ్యక్తపరిచాడు.

"ఇక్కడ మన దుకానంకు ఏం ఫికర్ లేదయ్యా. అన్నీ సోచాయించే ఠఠల్సేఠ్ మన ల్ని ఈడకు పంపిండు. ఈ సుట్టుపక్కల పది-ఇరవై ఊల్లకు ఒక దుకానం కూడ లేదాయే. అనుంటప్పుడు గిరాకీ రాక ఎటుపో తది" అంటూ పరిస్థితి వివరించాడు.

తెల్లవారి దుకాణం ముహూర్తం అయిందని పించాడు మొకాషి రామారావు. మొదటి బేరం తనే చేసాడు.

కొన్ని సామానులు డబ్బులకు, కొన్నేమో సరికి సరి; మరి కొన్నేమో ఎట్లా వీలయితే అట్ల. ఏది లాభం అనుకుంటే అలా అమ్మాలని ముందే చెప్పాడు విఠల్ సేఠ్. ఎంత చెప్పినా కొత్తపని అని తోడుగా తెలివిగల సాంబుని పంపాడు. మొదటిదినం బేరసారాలన్నీ సాంబ డే చూసుకున్నాడు. రాఘవులు ఊరికే పక్కనే ఉండి గమనించసాగాడు.

పగటి వరకు దుకాణం తెరిచిన సంగతి పిల్లా-జెల్లకు; ముసలి ముతకకు తెలిసిపో యింది. ఎవరికి వారే ధాన్యం, పప్పులు తీసుక చ్చి కావలసినవి కొనుక్కొని పోవటానికి దు కాణం ముందు గుమిగుడారు.

ఇంతవరకు దుకాణానికి సరుకులకొచ్చిన వాళ్ళంత గోండులే. అంతా ఆడవాళ్ళే. మగవా ళ్ళు వచ్చినా సైనలిచ్చి బీడీలు మాత్రమే కొనుక్కున్నారు.

ఒక పిల్ల సారపప్పు తెచ్చి ఉప్పు కావా లంది.

సాంబడు తెచ్చిన సారపప్పును డాల్డా డబ్బా సైజులో ఉన్న 'చిట్యాగ'తో కొలిచాడు నాలుగు చిట్టెలు అయింది. సారపప్పు తెచ్చిన గుల్లలో నాలుగు చిట్యాల ఉప్పు కొలిచిపోసా డు.

నల్లటి ఉప్పును ఆ పిల్ల చేత్తో ఆప్యాయంగా తాకి చూసుకుంది. ఒక ఉప్పు బెడ్డ తీసుకొని నోట్లో వేసుకుంది. ఖండచక్కెరలా చప్ప రించింది. ఆ పిల్ల కళ్ళలో అదొరకమైన తృప్తి కనిపిస్తోంది. సారపప్పుకు సమానంగా ఉప్పు సంపాదించానన్న దీప్తి ఆ కళ్ళలో ఉంది.

మరో మధ్యవయస్కురాలయిన గోండు స్త్రీ చీరకొంగులో ఇన్ని నువ్వులు మూటగట్టుకొని తెచ్చి అక్కడున్న రేకు డబ్బాలో పోసింది. సాంబడు నువ్వులు కొలిచి చూసాడు. రెండు చిట్యాలపైనే అయ్యాయి. అర్ధచిట్టెడు ఉప్పు కొలిచి పోసాడు. ఆమెకూడా సంతోషంగానే ఉప్పు తీసుకొని పోయింది.

ఇంకో పిల్లగాడు చీరలో పత్తిని మూటగట్టు కొని తెచ్చాడు. ఆ పిల్లగాడి ఒంటిమీద బట్ట లు లేవు. "బట్టలు" కాదు "బట్ట"కూడా లేదు మొలతాడుకు ముందర ఇంత గుడ్డపీలిక వేలాడుతోంది సిగ్గు బిళ్ళలా. సాంబడు పత్తిని తూకం వేసినట్టు వేసి- తీసి మూలనున్న పత్తి కుప్పపైకి విసిరేసాడు. ఏం కావాలని అడిగితే వాడు చెప్పాడు. ఇంత బెల్లం ముక్క వాడిచే తిలో పెట్టి, వాడి చేతిలో ఉన్న చిన్న సీసాలోకి కిరసనాయిలు వంచాడు.

వాడు బెల్లం తింటూ- పరుగులంకించాడు.

town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk of the tow

# విపుల

ఈరోజు కాలేజి డిబేట్ లో ఇతర ప్రాంతాల్లోని జీవన విధానంగురించి అంత బాగా ఎలా మాట్లాడగలిగావ్?

నేను 'విపుల' పాఠకురాలిని: ప్రతినెలా దాదాపు పదిహేను భాషల కథల్నీ, ఆయా జీవన విధానాల్నీ తేటతెలుగులో చదివే అవకాశాన్నిస్తుంది 'విపుల'



ఇలా జనం వస్తూనే ఉన్నారు. వాళ్ళు పండించుకున్నవీ, కష్టపడి అడవిలోంచి ఏరి తెచ్చుకున్నవీ ఎవరికి దొరికినవి వాళ్ళు తీసుకొచ్చి వాళ్ళకు కావలసినవి తీసుకుపోతున్నారు. సాంబని చేతులు చకచకా పని చేస్తున్నాయి. అక్కడ జరుగుతున్నదంతా వస్తుమార్పిడి.

దుకాణంలో నుండి పోయే వస్తువులకు డబ్బులు రావడం లేదు. ఒక వస్తువుపోతే ఇంకో వస్తువు వచ్చి చేరుతోంది.

ఉప్పు పీపా ఖాళీ అయిపోయింది.

పక్కనున్న ఖాళీ రేకు డబ్బా సారపప్పుతో నిండిపోయింది.

అలాగే కాసేపట్లో నువ్వులతో ఒక చిన్న బస్తా నిండిపోయింది.

ఎక్కువమంది ఉప్పు, బెల్లం, కిరసనాయిలు కోసమే వస్తున్నారు. సామానులు కొనుక్కొని పోతూ ఉంటే వాళ్ళ ముఖాల్లో ఒక కొత్త వెలుగు కనిపిస్తోంది. మన ఊళ్ళోకూడా ఒక దుకాణం వెలిసిందనీ, ఎప్పుడు పడితే అప్పుడు, ఏది పడితే అది కొనుక్కోవచ్చనీ ఎంతో తృప్తిగా ఉంది వాళ్ళకు.

విఠల్‌సేఠ్ సాంబణ్ణి వెంట ఇచ్చి పంపి ఎంతో మేలు చేసాడు అని మనసులోనే అనుకున్నాడు రాఘవులు. లేకపోతే ఈ తరహా వ్యాపారం తనకు తెలిసి చచ్చేదికాదు. ఇప్పుడంతా అర్థమయింది రాఘవులుకు. మొన్నరాత్రి విఠల్‌సేఠ్ అలా ఎందుకన్నాడో... "బంగారం పండిస్తరు ముండకొడుకులు. దాన్నే మనం పైసజేసుకోవాల. ఆల్లకు ఏం గావాల్నో తెలుసుకొని అవి దుకాణంల నిండుకోకుండ నూడాల. అట్లుంటే నాలుగేండ్లల్లో నలపై ఎకరాల అసామిగావచ్చు. ఇల్లుమీద ఇల్లు గట్టొచ్చు" అని.

'ఇల్లు మీద ఇల్లేం కర్మం. ఇండ్లమీద ఇండ్లే కట్టవచ్చు. ఈల్లు గిట్లనే బేరాలు జేస్తే తన పెండ్లానికి ఏడు వారాల సొమ్ములైపియ్యొచ్చు. కడుపుల నల్లకదలకుండా టుంగుటూయల్ల కూకోని, ఆకులు నమ్ముకుంట యాపారం జేసుకోవచ్చు' అని మనసులోనే అనుకున్నాడు రాఘవులు.

నాలుగయిదు రోజుల్లో దుకాణం ఒక దారిలో పడింది.

దుకాణం సంగతి మెల్లమెల్లగా పొరుగూర్లకు కూడా తెలిసిపోయింది. జనం ఇరుగుపొరుగు పల్లెల నుండికూడా రావడం మొదలయింది. బేరాలు పెరిగాయి. దుకాణం జోడు గుర్రాల బండిలా సాగుతోంది.

వారంరోజులుండి సాంబడు ఇంద్రవెల్లి తిరిగి వెళ్ళిపోయాడు. వారం పది రోజులకు ఒకసారి బండిపై సామానులతో వస్తాడు. ఉప్పు, బెల్లం, కిరసనాయిలు-- ఇంకా ఇతర సామానులు దించి పోయేప్పుడు పత్తి, సారపప్పు, నువ్వులు-- ఇంకా ఇతర ధాన్యాలతో తిరిగి వెళతాడు.

ఎప్పుడూ సాంబడు ఒక బండి కట్టుకొని వస్తాడు.

పోయేప్పుడు మాత్రం రెండు మూడు బళ్ళతోపోతాడు. ప్రతిసారి ఇంద్రవెల్లికి పటేల్‌సాబే బళ్ళు కడతాడు.

తెచ్చేది బండెడు సామాన్లు.

తీసుకుపోయేది మూడు బళ్ళ సామాను, అధిగాక కొంత డబ్బు.

అలా నాలుగు నెలలు గడిచిపోయాయి.

రాఘవులు ఇప్పుడు బాగా తెలివిమీరాడు.

ఇప్పుడు సరికి సరి కూడా ఇవ్వడు. వాళ్ళు తెచ్చినవి బాగా లేవని సణుక్కుంటూ ఉట్టిపుణ్యానికి ఇచ్చినట్టు కొంచెం తగ్గించి మరీ ఇస్తాడు ఆ ఇచ్చే వస్తువులు.

ఒకనాడు మొకాషి రామారావు బిడ్డ దేవుబాయి నువ్వులు తీసుకొని వచ్చింది. కొలిచాడు రాఘవులు. నాలుగు చిట్యాలైనవి. కాని ఆమె గుల్లలో మూడు చిట్యాల ఉప్పు కొలిచి పోశాడు.

"అదేంది సావుకారు... నాలుగు చిట్యాల నువ్వులు కొలిస్తివిగదా!" అని అంటుండగానే మధ్యలోనే అందుకున్నాడు రాఘవులు-

"అవ్... అయినయి. కాదంటినా నేను. కాని ఇండ్ల సగం గింజలు తప్పులే సూడు. అప్పటికి ఈ నువ్వులకు మూడు చిట్యాల ఉప్పుగూడ యాకమే. ఎరికేనా?"

"ముందటినుంచి గా నువ్వులే తెవట్టిమి నడిమిట్ల గిట్ల మాట్లాడతవేంది" అంటూ

ఉప్పు గుల్ల చంకన పెట్టుకుంది.

"మీ నువ్వుల మేరం -- గిట్ల పిడికెడు నువ్వులు భూమ్మీదబోస్తే గుల్లెడు నువ్వులచ్చిన ట్టు అస్తదా ఏంది ఈ ఉప్పు. సముద్రంలకెల్లి తీయాల. సముద్రంకెల్లి ఉప్పు తీసుడంటే మజాకనుకున్నవా? అసలికి గా సముద్రం ఎక్కడుంటదో నీ కెరుకనా? సముద్రంలకెల్లి తీసుడు మల్ల ఆడికెల్లి ఈడికి తెచ్చుడు. గింత కష్టంతోని తెచ్చి మీకిస్తే గిట్ల మాట్లాడవట్టిరి. నేడు రేపు ఇమానంకు దునియలేదు" అని కొంచెం ఆగి మళ్ళీ అందుకున్నాడు వెంటనే

"అసలు పైసలకు దవ్వ అమ్మం మేం గీ ఉప్పు, మట్టి నూనె గాని ఏదో మీ ముకాలు జూసి పోనిమ్మని ఇస్తే, పెద్దపెద్ద మాటలు చేయవట్టివి. గిప్పుడు గీ మట్టినూనె ఉన్నది యాడికెల్లి అస్తదో తెలిసిందా. అక్కడెక్కడ్నో దేశంగాని దేశంల భూవిలకెల్లి తవ్వి తీసి - మల్ల కంపిన్లసాప్జేసి అస్తది. గందుకనే ఈ రెండు ఇంత పిరెం" అంటూ చెప్పుకొచ్చాడు.

రాఘవులు చెప్పేది ఆమెకు ఏమీ అర్థంగా వడంలేదు. ఆమెకు వినాలని కూడా లేదు. కాని వింటూ నిలబడింది. ఎదురుగా మాట్లా డుతున్నది పెద్దమనిషి. షావుకారు. మాట్లాడు తుంటే మధ్యలో వెళ్ళిపోతే ఏమనుకుంటాడో అని నిలబడి చెప్పిందంతా విన్నది.

రాఘవులు నోరు మూతపడటంతో గబగబా ముందుకు కదిలింది.

ఈ పల్లె మనుషులు ఏమి లేకున్న బతికేస్తా రు. కాని ఈ ఉప్పులేకపోతే బతకలేరు. అందు కే ఏమిచ్చయినా నరే కొంటారు ఈ ఉప్పును. అసలు ఉప్పు ధర వాళ్ళకు తెలియదు. ఇక కిరసనాయిలు వారు ఎప్పుడో తప్ప వాడరు. అదీ అందుబాటులో ఉంటేనే. వీలయినంత వరకు ఆముదం దీపాలనే వెలిగించుకుంటా రు వారు. రాత్రుల్లో దీపాల అవసరమే ఉండ దు. ఇంత పొద్దు ఉండగానే తిండితిప్పలు అయిపోనిస్తారు. లేకుంటే వాకిట్లోనే, ఇంట్లో పొయ్యి దగ్గరో ఇంత నెగడువేసుకొని పని కానిస్తారు.

ఈ అడవి మనుషులకు అగ్గిపెట్టె సంగతి తెలియదు. అసలు వాళ్ళ ఇండ్లల్లో నిప్పు ఆరదు. ఒకవేళ పొరపాటున ఆరిపోయినా పక్క గుడిసెలోంచి 'ఉంగలం' తెచ్చుకుంటా రు ఏ పిడకమీదనో. మరీ కాదనుకుంటే అగ్గిపు ల్లకు బదులుగా చెకుముకి రాయి ఉపయోగి స్తారు.

రాఘవులు వ్యాపారంలో రోజురోజుకు తెలివి మీరిపోతున్నాడు. మంది అగ్గిపెట్టెలు కొన కుండా ఈ చెకుముకి రాళ్ళు కొట్టుకోవడం ఏమీ నచ్చలేదు. అందుకని ఊరూరు తిరిగి బుక్కా, గులాలు, దాశన, చెకుముకి దూదినమ్మే సాయ బును మంచి చేసుకొని వచ్చేసాడు. ఆ సాయబు పది ఊళ్ళు తిరిగి అమ్మే దూదిని, తనే కాస్త ఎక్కువిచ్చి కొనేసి, అదే దూదిని సాయబిచ్చే రేటుకు రెండింతలు చేసి అమ్మడం మొదలు పెట్టాడు.

చాలాసార్లు దూది ఉంచుకొని కూడా లేదని, వాళ్ళచేత అగ్గిపెట్టెలు కొనిపిస్తున్నాడు ఎక్కువ ధరకు.

అలా ఆ గోండుపల్లెల్లో వ్యాపారం పేరుతో వస్తు మార్పిడి చేస్తూ - వ్యాపారాన్నంతా ఒక చేతిమీదకు తెచ్చుకొని ఆ అమాయకుల్ని ఎన్ని రకాలుగా పీల్చాలో అన్ని రకాలుగా పీల్చడం మొదలుపెట్టాడు రాఘవులు.

* * *

దుకాణంలో నుండి బయటకొచ్చిన దేవుబా యికి దూరంగా అంగలు వేసుకుంటూ వస్తూ ఉన్న జంగు కనిపించాడు. జంగు కంటపడ టంతో దేవుబాయి గుండె ఒక క్షణం లయత ప్పింది.

ఈ మధ్య దేవుబాయికి జంగు ప్రతికదలిక అందంగా, కదులుతున్న మేఘంలా కని పిస్తోంది.

ఆరడుగుల ఎత్తయిన విగ్రహం. మొలకు ధోవతి తప్ప మరో అంగవస్త్రం లేకుండా నిండుగా ఉంటాడు. ఆరోగ్యం, బలం పోత పోసి చేసినట్లుంటాడు. పలుచని కనుబొమ లు, లావుపాటి పెదవులు, చప్పిడి ముక్కు, విశాలమైన నుదురు, ఇంకా కత్తి పదునెరగని మీసకట్టు— ఇవన్నీ దేవుబాయికి ఇష్టమవుతు న్నాయి.

అతడి చమట వాసనంటే ఆమెకు మరీ ఇష్టం. గూడెమొల్లంతా వారం రోజుల క్రితం ఇప్పపూలు ఏరబోయారు .... అప్పటికింకా పూర్తిగా తెల్లవారలేదు. వుంటి కట్టెలు అంటించి కాగడాల మాదిరిగా పట్టుకొని అందరూ అడవిదారిన నడిచిపోతున్నారు. అంతలోకే ఉన్నట్టుండి అందరూ పెద్దగా కేకలు వేయసాగారు. అంతవరకు నిదుర కళ్ళతో జోగుతూ, జారిపోతున్న గంపతో అలా నడిచి వస్తూ ఉన్న దేవుబాయి ఒక్కసారి ఉలిక్కిపడింది. ఏమయిందో, ఎందుకరుస్తున్నారో అర్థంకాలేదు. అర్థం అయేసరికి దూరంగా పరుగెత్తుతున్న రెండు ఎలుగుబంట్లు కనిపించాయి. ఈ అడవిలో ఎలుగుబంట్లు గోందులకన్న తెలివైనవి. తెల్లారితే ఇప్పపూలు గోందులు ఏరుకుంటారని రాత్రే వస్తున్నాయి. అందుకని గోండులు ఇంకా చీకటినే బయలుదేరుతున్నారు. అయినా గోండులకు ఎలుగుబంట్లతో పోటీ తప్పడంలేదు.

ఎలుగుబంట్లు కనిపించినప్పటినుండి అందరూ ఇష్టమొచ్చిన రీతిన అరుస్తున్నారు. "యాం హెూ" అంటు కదులుతున్నారు. మళ్ళీ ఎలుగుబంట్లు కలుస్తాయేమోనని భయంభయంగా నడుస్తుంది దేవుబాయి.

దేవుబాయికి ఇలా తెల్లవారుజామున అడవికెళ్ళి ఇప్పపూవు లేరడం ఇదే మొదలు. ఎప్పుడైనా ఏరితే ఊరిదగ్గరి అడవిలో పగటిపూట ఏరేది. తల్లిపోయాక ఇదే మొదటిసారి అడవికి రావడం. తల్లి బతికున్న రోజుల్లో తల్లే చీకటిన లేచి అందరితోపాటు ఇప్పపూవులేరుకొచ్చేది.

అందరిలా వేగంగా నడవలేకపోతోంది.

అంతలోకే రెండు బలమైన చేతులు దేవుబాయిని వెనకనుంచి పట్టేసాయి. అరుద్దామనుకుంటే ఒక చేతితో నోరుమూసి మరో చేత్తో పొదివి పట్టుకుందా ఆకారం. తనను పట్టుకుంది మొదట ఎలుగుబంటని అనుకుంది కాని అరుద్దామని ప్రయత్నిస్తుంటే తెలిసిపోయింది ఆ పట్టుకుంది జంగు అని. జంగు చెమట కంపు దేవుకు తెలుసు. జంగు అని తెలిసాక కుందేలులా ఒదిగిపోయింది మెత్తగా అతడి చేతుల్లో. అతడి పట్టు సడలింది.

"దేవు... రాత్రి నువ్వు నా కలల కనిపించినవ్. ఎంటనే నిన్ను సూడబుద్దయింది. గిట్ల ఉరికచ్చిన" అంటూ దేవు మెడ చుట్టూ చేతులు వేసి ఆమెను తన గుండెలపై అన్చుకొని, ఆమె తలపై గదువ నుంచి కళ్ళు మూసుకున్నాడు.

"కలల గనిపిస్తే గిట్ల ఉరికి రాకడనేన. పెండ్లి జేసుకోరాదు. కలలు పడ్డప్పుడల్లా చెయ్యేసి పండచ్చు" అంది దేవుబాయి జంగు చెవి కొరుకుతూ.

"పెండ్లి, పెళ్లాం మల్ల జూసుకుందాం. అంత దూరం కెల్లి ఉరకచ్చింది ఎందుకో ముందు జెప్పనీ. కలల నీవు నేను....." అంటూ చెవిలో గుస గుసలు చెప్పాడు.

జంగు చెప్పిన మాటలు వింటుంటేనే దేవుకు సిగ్గయింది. కళ్ళు మూసుకుంది సిగ్గుతో.

కళ్ళు మూసుకున్న దేవును జంగు అడవి మల్లె చెండులా పొదివిపట్టుకున్నాడు. జుంటి తేనె డొన్నలా పెదవి కాన్పుకున్నాడు.

తియ్యటి ఇప్పపూల వాసనకు, జంగు అల్లరి చేష్టలకు దేవు తమకంతో సొమ్మసిల్లి, జంగును తీగలాగ అల్లుకుంది.

బంతిపూల పడవలో, ఉల్లిరేకు తెరచాపతో తేనెలవాగులో జంగు-- దేవులు తేలిపోతున్నారు అలా... అలా.... అలా.....

జంగు కనిపించినప్పుడల్లా ఆరోజు తెల్లవారుజామున జంగుతో పొందిన అనుభవం తాలూకు తీపి జ్ఞాపకాలతో దేవు ఒళ్ళు పులకంచిపోతుంది. ఏదో మత్తు ముంచుకొస్తుంది.

ఇప్పుడూ అలాగే ఉంది. మత్తులో పడ్డ దేవు జంగు పక్కన వచ్చి నిలబడటం కూడా గమనించలేదు. దేవు ఉంటే జంగు గుండెలపై ఉండాలనుకుంటుంది. లేకుంటే జంగుకు దూరంగా, కంటికి కనిపించనంత దూరంలో ఉండాలని ఉంటుంది. జంగును పక్కన ఉంచుకుని అతడి గుండెలపై వాలి గారాం చేయకుండా ఉండటం దేవుకు చేతగాని పనవుతుంది. అందుకని తునీగలాగ పరుగెత్తింది దేవు.







## అధిక సంతానవతులు

నాలుగు కిలోల బరువుతూగే పసివాడిని ప్రసవించిందో ఉద్దండురాలు మారియా బెనెటా ఒలివేరా. వాడికి ఏంపేరు పెట్టాలా అని ఆలోచనలో పడిందామె ఇప్పుడు. సంగతేమంటే మంచి మంచి పేర్లన్నీ వాడికంటే ముందు పుట్టిన వాడి 31 మంది అన్నలూ, అక్కలూ స్వంతంచేసేసుకుని వున్నారిప్పటికే

ఒలివేరా వయసిపుడు 49 ఏళ్లు. జర్మనీలో జన్మించినా తన పదవఏటనే తల్లిదండ్రులతో పాటు అర్జంటైనాకి వచ్చేసింది. తొలిసారిగా 13వఏట మాతృత్వం పొందింది. ఆ ప్రసవంలో ఆమెకి ఒకేసారి ముగ్గురు పిల్లలు పుట్టారు. మొదటి భర్త ద్వారా 25 మందీ, రెండవ భర్తద్వారా ఏడుగురు సంతానం కలిగారు. రెండుమార్లు కవలపిల్లలు జన్మించారు.

25వ శిశువు గర్భంలో వున్నప్పుడు ఓరోజు ఆమె పొలంలో పనిచేసుకుంటోండగా అకస్మాత్తుగా పురిటినొప్పులు ప్రారంభమైనాయి. తోడుగా అక్కడ ఎవరూ లేరు. ఆమెకేం చేయాలో పాలుపోక అందుబాటులో వున్న రేజర్ బ్లేడుతో ఉదరభాగాన్ని తనే కోసుకుని శిశువుని ప్రసవించింది.

32వ వాడు పుట్టాక ఇక పిల్లల్నికనే ఓపిక తనకు లేదని ఆమె నిర్ణయించుకుంది. మరొక శిశువు పుడితే అది మృతశిశువే అవుతుందేమో అని కూడా భయపడుతోందీమె. ఈ ఘనురాలి పేరు గిన్నీసు పుస్తకంలో నమోదవుతుందనుకుంటే పొరపాటే. 18వ శతాబ్దంలోనే 69 మందిని కని గిన్నీసు పుస్తకంలోకి ఎక్కిందొక మహిళ. ఆవిడకు 16 సార్లు ఇద్దరేసి చొప్పునా, ఏడుసార్లు ముగ్గురు వంతునా, నాలుగుసార్లు నలుగురు చొప్పునా సంతానం కలిగారు.

ఆ తరువాతి స్థానం కూడా లియోంటినా అనే శాన్‌అంటోనియాకి చెందిన ఘురో మహిళకు దక్కుతుంది. 1955 నాటికి 55 గురిని ప్రసవించిందీమె.

ఆ లెక్కన ఒలివేరా పేరు గిన్నీసు పుస్తకంలో కనిపించదనే నిర్ణయించుకోవాలి మరి ★

ఆమె వెనకే పరుగులాంటి నడకతో ఆమెన నుసరించాడు జంగు.




సంవత్సరకాలం గడిచిపోయింది. పిట్ట బొంగారం ఊరి మొకాషి అత్రం రామారావు ఎకాఎకని పాము కరిచి చనిపోయాడు. అతడు చచ్చేనాటికి రెండు వందల ఎకరాల భూమికి స్వంతదారు. దానికిగాను అతడు యేటా పద మూడు రూపాయల "తాసీలు" కట్టేవాడు.

రామారావుకు ఇద్దరు పిల్లలు. కొడుకు అత్రం సోముకు తండ్రి చచ్చేనాటికి పదేళ్లు. బిడ్డ దేవుబాయి వయసు పదిహేడు సంవత్సరాలు. ప్రతి యేటిలాగే ఈ సంవత్సరం కూడా ఎలాగో ఒకలాగు కష్టపడి భూమి సాగుచేసుకున్నారు. ఉన్నది రెండు వందల ఎకరాలైనా వాళ్ళు సాగుచేసేది అంతా కలిపి ఇరవై ఎకరాలకు మించి ఉండదు. ఆ ఇరవై ఎకరాల భూమి సాగుచేయటానికి రెక్కలు ముక్కలు జేసుకుని, పంట పండిస్తుంటారు. ఎముకలు పిండి జేసుకొని దినం రాత్రి కష్టపడి పండించిన పంట సగం తాసీలు వాళ్ళ, ఫారెస్ట్‌వాళ్ళ మామూల్లకే పోతుంది. ఇక మిగిలింది సగం ఏడాది పొడుగునా తినటానికే సరిపోదు. ఒకపూట ఉంటే ఇంకో పూట ఉండదు. అలవాటయిన ప్రాణాలు కాబట్టి ఏకాయకసరో తిని కడుపు నింపుకుంటారు.

ప్రతి ఏటిలాగానే తాసీలువాళ్లు ఊళ్లోకి రాగానే సుంకరివాడు డప్పు పట్టుకొని, కొట్టుకుంటూ "తాసీల్ ఖానూన్ నుంచి గిరిదావర్ సాబ్, ఇంకా నాయబ్‌సాబ్ నేడు తాసీల్ వసూల్‌కు ఊల్లెకు వచ్చిన్రు. అందరూ పటేల్‌సాబ్ ఇంటికి వచ్చి మీ మీ రకం పైసలు కట్టిపోవాలి. ఓహో ( హో!!" అంటూ డప్పు చాటింపు చేశాడు.

డప్పు చాటింపు వినగానే అందరి గుండెల్లో రాయి పడినట్లయింది. అప్పటికే చాలా మంది అనుకుంటూనే ఉన్నారు- 'ఏంది ఈ యేడు ఇంకా తాసీలోల్లు రాకపోయిరేందని' వాళ్లు అనుకోవడం, తాసీల్ వాళ్ళు రావడం రెండూ ఒకేసారి జరిగాయి.

కాసేపట్లో పటేల్ ఇంటి ముందర ఊరి జనం చిన్నా పెద్ద పోగయ్యారు.

పటేల్ సాబ్ ఇంటి ముందరి వేపచెట్టు కింద తాసీల్ ఆఫీసు వెలిసింది. పటేల్‌సాబ్ ఇంట్లోంచి తెచ్చి వేసిన పాత కర్ర కుర్చీలో తాసీల్‌దార్ కూర్చున్నాడు కాలుమీద కాలువేసుకొని ఠీవిగా. అతడికి కొంత దూరంలో నులక మంచం పట్టెమీద గిరిదావర్ కూర్చున్నాడు. గిరిదావర్ పక్కన ఒక ఆఫీసు గుమాస్తా నిలబడి ఉన్నాడు. చేతిలో మూటగట్టిన ఫైళ్ళు పట్టుకొని ఇద్దరు చప్రాసీలు తాసీల్‌దార్ కనుసన్నల్లో ఏమి చెప్పినా చేయటానికి సిద్ధంగా నిలబడి ఉన్నారు.

వచ్చిన తాసీలు సిబ్బందిని చూసి 'గిరిదావర్ పాతోడేకాని గీ నాయబ్‌సాబే కొత్తోడు' అంటూ గుసగుసగా చెప్పుకుంటున్నారు.

"ఈ ఊళ్లో మొత్తం ఎన్నిండ్లు వుంటయి? ఎవరెవరుంటారు?" అని అడిగాడు తాసీల్‌దారు.

"ఈ ఉల్లె అంతా గలిపి తొంభై ఇండ్లుంటయి హుజూర్! అరవై డెబ్బాయి గోండోల్లయి. మిగిలినయి మథురోల్లయి. రెండు తురక కొంపలున్నాయి. ఒక కోమట్ల ఇల్లు కూడా ఉంటది. మన ఇందరవెల్లి సావుకారు ఇరల్ సెర్ సుట్టం ఆయన" అంటూ లెక్కచెప్పాడు పటేల్ సాబ్.

"ఊల్లందరికి భూమి ఉందా? అందరూ తాసీల్ సరిగ్గనే కడ్తున్నరా లేక ఎవడన్న ఎగ్గొడుతున్నడా?"

"అందరూ కడ్తున్నర్ హుజూర్. నలుగురికి భూమిలేదు. ఈ నడమలనే వచ్చిన మరాఠోల్లకు, కోమటి సవుకారికి భూమిలేదు" అంటూ చెప్పాడు పటేలు.




"అట్లన" అంటూ తాసీల్‌దార్ మెల్లగా మంచంపై ఒరిగాడు విశ్రాంతిగా.

ఇద్దరు చప్రాసీల నుండి ఒకడు పటేల్‌ను పక్కకు పిలిచి "మరి దొరలకు తిండి ఇంతె జామ్ ఏమన్న ఉన్నదా లేదా? అప్పుడే పది గొడ్తున్నరు. అవి అన్నీ ఉడికి ఉమ్మగిలేటల్లకు పగటియాల్ల గానే అవుతది. అల్లపని నడిసేది నడుస్తనే ఉంటది. నువ్ ముందు నాకు గింత సామాన్లు ఇప్పిస్తే నా పనిల నేను పడత" అంటూ భోజనం ఏర్పాట్లకై హడావుడి మొదలు పెట్టాడు.

తాసీల్‌దార్ ఇంట్లో ఉన్నా ఆఫీసు పని మీద ఊళ్ళెంబడి తిరిగినా ఆయన తిండి తిప్పలు చూసేది ఈ చప్రాసీయే. వంటలో చేయి తిరిగినవాడు. పూటకో రుచితో వండి పెడ్తాడు. తనూ తింటాడు. అందుకే ఈ హడావుడి.

పటేల్‌సాబ్ ఇంట్లో కోళ్ల మందనే ఉన్నది. కాని యిలాంటప్పుడు ఇంట్లోంచి ఏమీ తెప్పించడు. అన్నీ బయటినుండే రావాలి. నుంకరివాణ్ణి పిలిచి "అరేయ్ కాశీరామ్! ఊరి మీదకెల్లి ఒక పది పన్నెండు లేత కోళ్ళు ఉన్నోన్ని ఇయ్యమను. నా పేరు జెప్పు. అట్లనే మన సావుకారి దుకాన్లకుబోయి, మంచి బియ్యం బిర్యానికని జెప్పి ఒక ఆరేడు సేర్లు పట్కరా. అట్లనే ఓ రెండు సేర్ల కమ్మటి నూనె, కోడి కూరకు ఏంపడ్తదో, ఆ మాల్‌మసాల తీస్కచ్చి ఇచ్చిపో. ఏమన్నడిగితే ఊల్లెకు నాయబ్‌సాబ్, గిరదావర్‌సాబ్ అచ్చిండు అని జెప్పు. ఉరుకు ముందు" అంటూ నుంకరోన్ని ఉరికించాడు.

నుంకరి కాశీరామ్ పటేల్ మాటగా జెప్పి పది లేత కోడి పెట్టలు ఊరిమీద అడిగి తెచ్చాడు. ఊళ్లోకి పై దొరలొచ్చినప్పుడు వాళ్ళకు కోళ్ళు, మేకలు ఇవ్వడం, కుక్కల్లాగా తిరిగి సేవలు చేయడం వాళ్లకేమి కొత్త కాదు. ఎప్పటి నుండో జరుగుతున్నదే ఈ తంతు.

వంట ఏర్పాట్లకై పటేలు పడుతున్న హైరానా గమనించిన తాసీల్‌దార్ పటేలును పిలిచి కోడిగాని, మేకగాని హలాల్‌కానిదే తాను ముట్టుకోనని ముందుగానే చెప్పాడు.

"అట్లనే హుజూర్... హలాల్ జెయ్యతందుకు ఎవల్లో ఎందుకు నేనే జేస్త. మీకా అనుమానం ఏంవద్దు" అని అన్నాడు.

పటేలు తురుకవాడు. పేరు మహమూద్ అలీ. కాని అందరూ అతణ్ణి 'పటేల్‌సాబ్ పటేల్‌సాబ్' అనే పిలుస్తారు.

పటేల్ స్వయంగా మంత్రం చదివి కత్తిపట్టి కోళ్లను 'హలాల్' చేసి చప్రాసీలకు అప్పగించాడు.

చప్రాసీ "మరి గీ కూరలకు గరమ్ మసాల గింత కావాలి. జరజల్ది తెప్పిచ్చు" అని అన్నాడు.

"మా సావుకారి దుకాన్ల గా మసాలలులేవట. గీ గొంద గుడిసెల్ల గా మసాలలుగింత యాడ దొర్కుతయి జెప్పు"

"అయితే గిట్లనే అండమంటవా ఏంది? నాయబ్‌సాబ్‌ని గొందముండ కొడుకనుకున్నవా ఏంది? లేక ఎద్దుతోక పట్టెటోడనుకున్నవా? మసాలా బగారా లేంది అల్లు ముడతరా ఈ కూడు. ఏమన్నజెయ్ గాని ఈ కోల్ల బూరు పీకికోసి తయార్‌జేసెటల్లకు నాకు గరమ్‌మసాల గావాలి. నేను జెప్పేది నేను జెప్తున్న... మల్లనీ ఇష్టం, ఆ దొరల ఇష్టం. మల్ల ఏదన్న మాటస్తే నన్ను అనొద్దు" అంటూ కోళ్ళను ముందేసుకొని శుభ్రం చేయసాగాడు.

పటేలుకు చికాకుగా ఉంది. ఇప్పుడు ఉన్న ఫళంగా మసాలాలు తెమ్మంటే ఎక్కడికెళ్ళి తెచ్చేది. ఏం చేయాలో అర్థంగావడంలేదు. చేతులు నలుపుకుంటూ గడ్డ పుణుక్కుంటూ మధ్య మధ్యలో నణుక్కుంటూ వేపచెట్టు కిందున్న జనంలోకి వచ్చాడు.

అప్పటి తాసీల్ కట్టడానికి ముప్ఫయి నలభై మంది జనం పోగయ్యారు. పటేల్ సాబ్‌ను చూడగానే మేస్త్రం జంగు లేచి నిలబడి "పటేలా! ఇప్పుడున్న నాయబ్‌సాబ్‌కు జెప్పి నాకింత పరంబోకు గాని ఖరీజ్ ఖాతా భూమి గాని ఇప్పించు. ఏమన్నను, కాని కాదనకు. నీపేరు జెప్పుకొని దినాం రెండు ముద్దలు తింటం. నీపేరు జెప్పుకొని బతుకుతం" అని అంటుండగానే —

"అట్లనే నాగ్గింత భూమి నూపించు -

పటేల. ఉన్న ఊరు, పట్టా భూమి ఇడిసిపెట్టి పులుల బాదకు గిట్లస్తిమి. దినాం కైకిలి దొరక దాయె. నువ్వే ఎట్లన్న గింత పున్యం గట్టుకో. లేకుంటే పిల్లలు - మేకలు ఉన్నోన్ని ఉత్తగనే సచ్చిపోతం కూడులేక'' అంటూ తన దుఃఖం వెల్లగక్కుకున్నాడు కనకంబాలు.

ఇంకా ఎవరో లేచి ఏదో చెప్పబోయారు.

కాని పటేలు అవేమీ వినిపించుకోలేదు.

ముందు మసాల కావాల- గరమ్ మసాల. సమయానికి గరమ్ మసాలగాని దొరకకపోతే, ఈ పటేల్‌గిరి గంగలో కలిసిపోతుందని పటేలుకు బాగా తెలుసు.

''సూడుండ్లి... అచ్చిన నాయబ్‌సాబ్‌కు తిండి తిప్పలు మంచిగ జూసుకొని అరుసుకుంటే, మల్ల మనం ఏది జెప్తె అది జేస్తడు. ఇప్పుడు నాయబ్‌సాబ్ తిండికి గరమ్ మసాల కావాల్నంట. మన ముండమోపి సాకారి దుకాన్ల అదిలేదు. రెండు కోసుల దూరంల మార్యాపురం మసాల దొరుకుతది. అక్కడికెల్లి మసాలలు తేవాల. ఎవరు పోతరు? ఇక్కడున్నట్టు రావాల మల్ల''

ఈ పని చేస్తేనైనా ఇంత భూమి దక్కుతుందని ''నేను బోయి తీస్కస్త'' అని ముందుకొచ్చాడు మేస్రం జంగు.

''ఇక్కడున్నట్టు రావాల పో'' అనగానే మేస్రం జంగు మసాలాల కోసం పరుగు లంకించాడు.

చలికాలం. పంటలు పొట్టమీద ఉన్న దినాలు.

ఈ దినాల్లో ఎవరూ ఏపనికి బండి కట్టరు. చక్రాలు, ఇరుసు తీసి బండిని లోపల పెట్టుకుంటారు. అన్నీ మట్టిదోవలు. ఎండిన బురద గుంటల్లో బండి కూడా సరిగా నడవదు. నడిస్తే ఎద్దుల కాళ్ళు చెడిపోతాయి. నడక చేతగానివాళ్లు, పెద్దలోకులు మాత్రమే ఈ రోజుల్లో బండెక్కుతారు. అందుకని జంగుకు పరుగు తప్పలేదు.

అరగంటలో జంగు మసాలాలతో తిరిగి వచ్చాడు.

కాని ఉరికి ఉరికి రావడంతో ఛాతి కాలుతోంది.

కడుపు - ఛాతి సముద్రంలాగ ఎగిసి పడుతున్నాయి.

ఆయాసంతో ఊపిరి అందక - కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

మసాలాలు పటేలుకిస్తూ ''పటేల్‌సాబ్! ఎ....ట్ల....న్న గింతంత.... భూమి..... నాయబ్‌సాబ్‌కు జెప్పి ఇ...ప్పిస్తే.....'' అంటూ కళ్ళు మూసుకుంటూ, తెరుచుకుంటూ తన కష్టం మళ్ళీ ఒకసారి గుర్తుచేసాడు.

''అట్లనేరా... నాకు గుర్తు లేదా ఏందీ? నీకేంగాల దున్నతందుకు -ఇంత భూమేగద గావాల'' అంటూ ముందుకు కదిలాడు.

నూనెలో, నెయ్యిలో మాంసం ముక్కల వేపుడు, మసాలా గుభాళింపుతో కమ్మటి వాసన అక్కడంతా వ్యాపించింది.

గిరదావర్ ఒక్కొక్కరిని పిలిచి తాసీలు డబ్బులు జమ కట్టుకుంటున్నాడు. తాసీల్‌దార్ చెట్టు నీడకు మంచంలో పడుకొని సిగరెట్ తాగుతున్నాడు.

సగంకంటే ఎక్కువమంది అప్పటికే తాసీలు కట్టేసారు. ఎవరికీ రసీదులు ఇవ్వడంలేదు. డబ్బు తీసుకోవడం ''ఉఁ... నడు'' అనడం ఇంతే.

''మొకాషి రామారావు'' అంటూ పిలిచాడు గుమాస్తా.

దేవుబాయి ముందుకొచ్చి- ''మా తండ్రి సచ్చిపోయిండు. పైసలు మా తమ్ముడు కత్తడు'' అని చీరకొంగు ముడి విప్పసాగింది. ముడి ఎంతకూ రావడంలేదు.

సిగరెట్ తాగుతూ పడుకున్న తాసీల్‌దార్ చూపులు దేవుబాయి గుండెలపై బడ్డాయి.

గోండు స్త్రీలు రవికెలలాంటివి ఏమీ వేసుకోరు. చీరనే గుండెలపై నుండి బిగించి నడుములో దోపుకుంటారు.

బిగించిన పైట[illegible]ంచి దేవుబాయి నిండైన గుండెలు ఉన్నవి ఉన్నట్టు కనబడుతున్నాయి. ఎంత వద్దనుకున్నా చూపు తిప్పుకోలేకపోతున్నాడు. అటువైపే చూస్తున్నాడు.

దేవుబాయి గుండెలు తాసీల్‌దార్ చూపుల




ను సూదంటురాయిలా పట్టేసాయి.

ముడి రావడంలేదు. చివరకు నోటితో ముడి విప్పుతుంటే తాసీల్‌దార్ ఏమనుకున్నాడో ఏమో "అబ్‌వసూలీ బంద్‌కరో. పహలే ఖానా ఖాయింగే" అంటూ మంచంలో నుండి లేచి నిలబడ్డాడు.

"ఉండనియి దేవుబాయి... పైసలు మల్ల యిస్తువుగాని. ఇప్పటికే పొద్దుయాకమయింది. ముందు దొరలు ఇంత బుక్కెడంత తిన్నంక మల్లా వసూలి మొదల్‌బెత్తర్. అప్పుడు ఇద్దువుగాని పైసలు" అంటూ పటేల్ దేవుబాయి కొంగుముడి విప్పకుండా ఆపేసాడు.

పటేలు ఇంట్లో దస్తర్‌ఖానా వేయించాడు. రికాబులు తెప్పించాడు. అలాగే పాన్‌దాన్ తెప్పించాడు. దస్తర్‌ఖానా మీదబడి ఒక్కొక్క రు రెండు కోళ్ళు ఆరగించేసారు.

తినగానే దొరగారు ఒక చిన్న కునుకు తీస్తారని చప్రాసీ ముందే చెప్పాడు పటేల్‌కు. అందుకని తన ఇంట్లోనే పడుకోటానికి ఏర్పాటుచేసాడు.

తాసీల్‌దార్ పటేల్‌ను పిలిచి 'ఏమో' చెప్పాడు. అలాగేనని తల ఊపాడు పటేల్.

పటేలు దేవుబాయి దగ్గరికొచ్చి "చూడు దేవుబాయి... నాయబ్‌సాబ్ పగటిపూట గొంచెంసేపు నిదురపోతడంట. ఆయన నిదర బోతున్నంత సేపు ఎవలన్న ఒకరు ఇసనకర్ర తోని గాలి ఇసరాల్నంట. నువ్విగా పని జూడు" అని చెప్పాడు.

"నేనెందుకు మా తమ్ముణ్ని పంపిస్త... ఆడు యిసుర్తడు"

"ఆడింతున్నడు పోరడు. నువ్వే పోరాదు"

తమ్ముణ్ని వెంట బెట్టుకొని తాసీల్‌దార్ పడుకున్న గదివైపు కదిలింది దేవుబాయి.

దేవుబాయి వెంట తమ్ముడు కూడాపోతూ ఉంటే "అరే... అత్రం సోము. ఇటురా! సావుకారి దుకాన్లకు పోయి నాకు ఒక అగ్గిడబ్బ, రెండు పోకచెక్కలు తేపో" అంటూ వాణ్ణి పంపించాడు.

దేవుబాయి ఒక్కర్తే నాయబ్‌సాబ్ గదివైపు నడిచింది.

దేవుబాయి గోండుకులపెద్ద మొకాషి బిడ్డ. ఆ మొకాషి రెండువందల ఎకరాల పట్టాదారు. ఒకర్తే ఆడపిల్ల. పువ్వులాగా పెంచుకున్నాడు. దేవుబాయి బొమ్మలాగా; తమలపాకులు, తేనెకలిపి చేసినట్లుంది. జింక పిల్లలాగా పెద్ద పెద్ద కళ్ళు. బలమైన చెరుకు గడలాంటి ఒళ్ళు. కడతల మీద, గదువమీద ముచ్చటగా పొడిచిన పచ్చబొట్లు.

చేతికి దండ కడియాలు, ముక్కుకు ముక్కెర, మెడలో వెండినాణాలతో రంగు పూసలతో చేసిన దండలు, నడుముకు వెండి వొడ్డాణం, కాళ్ళకు వెండి కడియాలతో చూడ ముచ్చటగా ఉంది.

దేవుబాయిని గుమ్మంలోంచే గమనించి వెళ్ళి మంచంలో పడుకున్నాడు తాసీల్‌దార్.

నిలబడి దేవుబాయి విసురుతోంది విసనకర్రతో.

గాలి రావడంలేదు, కూర్చుని విసరమన్నాడు

కూర్చొని విసనకర్రతో విసురుతోంది. దేవు గుండెలు లయగా కదులుతున్నాయి.

తాసీల్‌దార్ చూపు దేవుబాయి గుండెల్లో నాటుకుంది.

గోండు స్త్రీలు ఇలా అర్ధనగ్నంగా ఉండే పదిమందిలో తిరుగుతారు కాబట్టి తాసీల్‌దార్ చూపులకు దేవుబాయి ఏం కంగారుపడలేదు.

కాని అతడే ఆగలేకపోయాడు.

ఆమె చేయి పట్టి పైకి లాక్కున్నాడు.

విసురుగా పడ్డ దేవుబాయికి మంచంకోడు నొసటికి కొట్టుకుంది. వెంటనే తమాయించుకొని లేచి విసనకర్ర విసిరేసి గబగబ అడుగు లేసుకుంటూ గదిలోంచి బయటికొచ్చింది.

అప్పటికే అందరూ తాసీల్ కట్టడం అయిపోయింది.

దేవుబాయి కొంగుముడి విప్పి డబ్బులు గిరదావర్ ముందుంచింది. అప్పుడే నాయబ్ సాబ్ అక్కడికి చేరి, "రహనేదో... వో పైసేలే నానహీ" అంటూ హుకూం జారీ చేసాడు.

గిరదావర్ డబ్బులు తీసి దేవుబాయి చేతిలో పెట్టాడు.

మేస్రంజంగు, కనకంబాలు మళ్ళీ తమకు

కాస్త భూమి ఇప్పించమని అటు తాసీల్‌దార్ కాళ్ళు, ఇటు గిరదావర్ కాళ్ళు పట్టుకున్నారు.

"ఇప్పుడు ఇక్కడ ఎవరికీ ఏభూమీ ఈయం. తీరం ఉంటే దఫ్తర్‌కు రండ్లి... అక్కడ జూద్దాం. లేదా ఎల్లుండి మేము 'వాంకిడి' డాగ్‌బంగ్లాల ఉంటం, అక్కడికి రండ్లి" అంటూ దేవుబాయి ఉన్న దిక్కు చూసాడు.

దేవుబాయి తమ్ముణ్ణి వెంటేసుకొని పోతున్నది.

ఎవరికీ ఏ రకమైన భూములు కొత్తగా సాగుచేసుకోటానికి అనుమతి ఇవ్వలేదు. భూముల్లేని మరాఠీలు, ఇద్దరు తురకలు, కోమటి సావుకారు తాసీల్‌దార్ వెంట బండివరకు వెళ్లి తమ గోడు చెప్పుకున్నారు. ఓపిగ్గా వాళ్ళు చెప్పింది విని పటేలుకు ఏమో చెప్పాడు- అలా చేయమని. అలాగేనన్నట్లు పటేలు తల పంకించాడు.

బండెక్కి కూర్చున్నారు తాసీల్‌దార్. గిరదావర్ బండి నాలుగడులు నడిచాక ఏదో గుర్తొచ్చి పటేలును పిలిచి ఏమో చెప్పాడు ఉర్దూలో. పటేలు వెంటనే-

"ఇంటున్నారా! వచ్చే పున్నమికి ముందర మన నాయబ్‌సాబ్ బిడ్డ లగ్గమున్నది. అందుకని రెండు బిందెల నెయ్యి, తేనె, సారపప్పు తేస్కాని మనల్నందర్ని ఉట్నూర్‌కు లగ్గంకు రమ్మంటుండు" అని చెప్పాడు.

అందరూ విన్నారు. కాని ఎవరూ కాదనలేదు, అవుననలేదు- చూస్తూ ఉన్నారు.

మళ్ళీ నాయబ్‌సాబ్ బండి కదిలింది.

బండి ముందు సుంకరి కాశీరాం కుక్కలాగా పరుగెత్తుతున్నాడు బండికన్న జోరుగా.

బండి ముందు అలా పరుగెత్తుతూ బండితోపాటు పోవాల. ఈ రాత్రికి తాసీల్‌దార్ హస్నాపూర్‌లో మకాం వేస్తాడు. ఆ సంగతి సుంకరోడు బండికన్న ముందుపోయి చెప్పాల. అప్పుడు వాళ్ళు ఏర్పాట్లు చూస్తారు.

సుంకరి బండి ముందున్నాడు.

బండి వెనక నించి వస్తూవుంది.

★ ★ ★

పటేలు ఒకేసారి మూడు వర్గాలవారికి కబురు పంపాడు--

పిట్టబొంగారం మొకాషి అత్రం రామారావు బిడ్డ దేవుబాయికి వాళ్ళ భూమి గురించి, దాని శిస్తు గురించి ఫైసలా చేసుకొమ్మని కబురు పంపాడు.

దున్నుకోటానికి భూమిలేక పరంపోగుగాని. ఖరీజ్ ఖాతా భూమిగాని ఇప్పించమని కాళ్ళా వేళ్ళబడ్డ గోండులు అత్రం జంగు, కనకం బాలులకు కూడా కబురు పంపాడు.

నలభైయాభయి ఎకరాల భూమికి సొంత పేరు మీద పట్టా ఇప్పించమని ఎప్పటినుండో వెంటబడుతున్న కోమటి సావుకారు రాఘవులు ఇంకా కొంతమంది గిరిజనేతరులకు కూడా కబురు పంపాడు.

పటేలు మహా తెలివైనవాడు. అన్నీ చదరంగం ఎత్తులు ఆయనవి. సిపాయిని ఎరవేసి ఏనుగును చంపగలడు. మంత్రిని ముందుంచి రాజునే భూమ్మీది నుండి లేపేయగల సమర్థుడు.

ఆ ఊరికి పటేలు, పట్వారి రెండు ఈ మహమూద్ అలీనే. ఆయన ఊరుకు పటేలు. అతడి బావమరిది అసలు పట్వారి. కాని వాడు ఉట్టి ఎబ్రాసి వెధవ. ఏమీ తెలియదు. అన్ని పనులు పటేలే చూసుకుంటాడు. ఆ బావమరిది పెట్టమన్న చోటల్లా సంతకం పెడ్తాడు. వాడికొచ్చిన చదువు, వాడికి నేర్పించిన చదువు సంతకం వరకే.

అలాంటి పిచ్చి బావమరిదిని అడ్డం బెట్టుకొని ఇప్పటికి నాలుగు వందల ఎకరాల భూమికి పట్టాదారు అయ్యాడు. దాంట్లో బంగారం పండుతుంది. అంతటితో పటేలు కుతితీరలేదు. మొత్తం ఊరుభూమి తనదై 'వతన్‌దార్' కావాలని ఆశ. దానికొరకే దినం రాత్రి ఈ ప్రయత్నం.

పటేలు భూమిని అదునుజూసి ఒక పద్ధతి ప్రకారం తనపేర కలుపుకుంటాడు.

ఊళ్లో మొదట ఎవరైనా చావడంతో ఆ పట్టాభూమిని వారసులు ఉన్నా లేకున్నా కిందా మీదా పడి ఆ భూమిని ప్రభుత్వపరంగా పట్టాభూమి నుండి తప్పించి 'ఖరీజ్‌ఖాతా'లో కలిపేస్తాడు. తరువాత తీరిగ్గా పట్టా చేసు




కుంటాడు-పకడ్బందిగా. లేదా ఊరుపేరు లేని మనిషి పేరు మీద పట్టా చేయించి ఏటా వాళ్ళపేరు మీదే శిస్తుకట్టి సాగుచేసుకుంటాడు. అతడికున్న నాలుగయిదు వందల భూమిలో అతడిపేర ఉన్నది చాలా తక్కువ. భూమి అంతా భార్య, పిల్లలు, బావమరదులు ఇలాంటి వారి పేరనే ఉంది.

చనిపోయిన మొకాషి అత్రం రామారావు భూమిని పట్టా నుండి తప్పించి ఇప్పుడు 'ఖరీజ్ ఖాతా'లో కలపాలి.

అందుకే సుంకరోడితో దేవుబాయిని రమ్మని కబురుపంపాడు. దేవుబాయి తమ్ముణ్ణి వెంటబెట్టుకొని వచ్చింది- ఎందుకైనా మంచిదని.

సుంకరోన్ని చూసి-- "అందరికి జెప్పినవ్‌ర జల్దిరమ్మని" అని అడిగాడు.

"అవ్... చెప్పిన పటేల. అస్తమన్నరు. ఒక సావుకారి మాత్రం సెయ్యిరికామ్ లేదు. జర ఆగి అస్తమన్నడు"

"గదేం గాదు... దుకానం బందువెట్టియిన రమ్మని జెప్పు. పో... గీవని జూసుకొని నేను మల్లా వాంకిడికి నాయబ్‌సాబ్ దగ్గరికిపోవాల" అని దేవుబాయి వైపు చూస్తూ-

"ఏం దేవుబాయి ఏమంటవు? మీ అయ్యసచ్చి రెండేండ్లు గావట్టె. పట్టేదారు మీ అయ్యే. పొయ్యేటోడు పోకుంట ఆ భూమి మీ తమ్ముడి పేర జేసి పోకపాయె. ఇప్పుడా భూమి సర్కారోల్లకుపోతది. రెండేండ్లు నేను ఎట్లనో అట్ల సర్కారోల్ల కండ్లు కప్పుకస్తి. నిన్న అంతా నాయబ్‌సాబ్ కండ్లవడె. నువ్వేమో చేయి ఇడిపించుకొని అస్తివి. ఇప్పుడెట్ల జెప్పు." అంటూ 'పాన్‌దాన్'లో- నుండి రెండు తమలపాకులు తీసి తడిలేకుండా తుడిచి తొడపై పెట్టుకున్నాడు.

తల వంచుకొని నిలబడ్డ దేవుబాయి కళ్ళలో నుండి నీళ్ళు జలజల రాలినయి.

పటేలు ఆ 'దివాన్‌ఖానా'ను నీళ్ళతో ఎప్పుడూ కడగలేదు. ఇలా భూమి కలుపుకున్నప్పుడల్లా- భూమి పోగొట్టుకున్న వారి కన్నీళ్ళతోనే కడిగిస్తాడు.

ఇప్పుడు దేవుబాయి వంతు వచ్చింది.

కాదనలేదు పటేలు.

"చేయి ఇడిపించుకొనుడుకు మా భూమికి ఏం నమందం. నా కిష్టంలేదు. ఇడిపించుకున్న. మా అయ్యపోతే ఏమాయె. మా తమ్ముడున్నడు. నాలుగేండ్లాగితే ఆడే దున్నుకుంటడు"

"నిజమేనే. దున్నుకుంటడు. నేనేం కాదన్ననా. కాని దానికి పట్టేదార్ మీ తమ్ముడు గావాలంటే ఎంతకత జరగాల. ఆ సర్కారోల్ల ఎంట తిర్గాల. ఎన్ని పైసలు కర్సు జేసుకోవాలా...? మల్లా పని అయితదా అంటే సెప్పుడు కష్టం. అయితే అయితది లేకుంటే లేదు. అదిగాక అన్ని పైసలు నీ దగ్గర యాడున్నయి. ఆ పోయిన మనిషి ఉన్నప్పుడే కావల్సినోల్లకు పట్టా ఇప్పిస్తే ఇప్పుడు ఇన్ని ముసీబత్‌లు రానే రావుగదా" అంటూ తమలపాకుల ఈనెలు తీయసాగాడు.

"అయితే మా భూమి మాకు ఉండదా?"

"భూమ్మీద నీకెందుకే అంత ఖాయిష్. ఇప్పుడు భూమి ఉంటదే అనుకో, ఏం జేసుకుంటవ్? తమ్ముడా ఇంకా పాలపండ్లురాలనిపోరడు. ఇంతదాంక ఆడు ఎన్నడన్న కట్టెగొట్టిండా? అరకవట్టిండా? ఇంకానాలుగేండ్లు బోయినంక ఆడేం యవసం జేస్తడు. అంత దాంక యాటా తాసీలు గట్టుడు, మామూల్లిచ్చుడు బేకార్‌గద. నీకంత భూమేగావాల్నంటే నీ తమ్ముడు చేతికచ్చినంక చేసుకోను సర్కారు భూమి నేను ఇప్పిస్తాగద. నేను ఇంకా అప్పుడే సావనుగదా! అని నవ్వుతూ ఈనెలు తీసిన తమలపాకులను పక్కన పెట్టాడు.

"అట్లనిగాదు... తాతముత్తాతల భూమి పోతదంటే కడుపుల దుఃఖం ఆగుతలేదు- అందుకని"

"కక్కు... దుఃఖాన్ని ... అపుడు నీతరమా నాతరమా! ఎల్లగక్కు-- మనసు సాఫయితది"

దేవుబాయి వెక్కివెక్కి ఏడుస్తున్నది.

అక్కనిజూసి తమ్ముడు కూడా ఏడుస్తున్నాడు.

"పిసదానా ఏడుస్తవెందుకు? నాకాడికొచ్చి అడిగినోల్లకు నేను ఎప్పుడన్న దున్నుకోను భూమి సూపించకుండా ఉన్ననా! ఎనకా ముందు అంతే. ఇచ్చేమాట పక్కా"

దేవుబాయి కళ్ళు తుడుముకొని నిలబడింది.

అంతలోకే షావుకారు రాఘవులు, తుకారామ్, గోవిందరావులతోపాటు మహమ్మద్ గౌసొద్దీన్, వలీఅహమద్ అందరూ కలిసికట్టుగా వచ్చారు.

వచ్చిన వాళ్ళను జూసి– 'వస్తా' నన్నట్లు కదిలింది దేవుబాయి.

"చూడు దేవుబాయి... పోయే భూమి ఎట్లా పోతది. అయినా పోకుండా ఏమన్న ఉపాయం ఉంటే చూస్త. నా బిడ్డెలాంటిదానివి. మనసు గట్టిజేసుకో. గీ కాగిదం మీద చెరొక్క దస్తకత్ చెయ్యుండ్లి" అంటూ ఒక తెల్లకాగితంపై ఇద్దరి వేలిముద్రలు వేయించుకొని పోయిరమ్మన్నాడు.

ఈనెలు తీసిన లేత తమలపాకు మీద సున్నితంగా సున్నం రాస్తూ- వచ్చినవాళ్ళతో అన్నాడు– "నిన్న నాయబ్‌సాబ్ అచ్చినపుడు ఏమో అంటిరి. ఇప్పుడు జెప్పుండ్లి సంగతి, ఇతిమినాన్‌గ ఇంట"

"ఏమున్నది ఈ ఊరికచ్చి గిన్నేండ్లు కావట్టె. మాకు గింత భూమిలేదు. మాకు మనిషికింత పట్టాభూమి ఇప్పిస్తే మంచిగుంటది" అన్నాడు తుకారామ్.

"కొంత పైసలు కర్చయినా మీరేం యెనుకాడద్దు" అన్నాడు రాఘవులు.

"పని అన్నాక పైసల కర్చు ఉండనే ఉంటది. ఇప్పుడైతే భూమేంలేదు. ఉన్న భూమల్లా సచ్చిపోయిన మొకాషి రామారావుదే పడీత్‌గ ఉన్నది. అది ఇప్పుడు 'ఖరీజ్‌ఖాతా' కింద జమయితది. ఇక ఇది దప్ప ఇంకోటిలేదు"

"అదే ఇప్పించుండ్లి. ఎట్లన్న చేయించుకుంటం"

"ఎట్ల జేసుకుంటరు. ఏం జేసుకుంటరు ఆ భూమిని. అన్ని రాల్లు రప్పలు, సెట్లు పొదలు ఉన్నాయి. ఉత్తఅడివి అనుకోండ్లి" అని కాసేపాగి– "ఒకపని జేయుండ్లి. ఇన్నేండ్లు ఆగిండ్లు. ఇంకా ఓ యాడాది, రెండేండ్లు ఆగుండ్లి. ఆ భూమిని సాపు జేయించి, బంగారం పండేట్లు జేసి మీ కప్పగిస్త. పెడితే కడుపు నింద పెట్టాల. ఇస్తే ఏదన్న సొక్కంగ ఇయ్యాల. అది నా తరీఖా! ఏమంటరు? ఇప్పుడు ఆ భూమి ఉన్నదున్నట్లు మికిచ్చిన్నే అనుకో దాన్ని దారికి తెచ్చుడు మీ తాతల తరంగాదు. అట్ల అడివైపోయి ఉన్నది. చేసే కర్చుజేయుండ్లి. రెండేండ్లు పోయినంక బంగారం పండేభూమిని మీ పేర పట్టా జేసి ఇస్త– కాదంటే మీ ఇష్టం"

వ్యవసాయం సంగతి బాగా తెలిసిన తుకారామ్‌కు పటేలు చెప్పిందే బాగుందనిపించింది.

"ఇప్పుడు అడివైవున్నది రెండేండ్లయినంక ఇంకా అడివైపోతది. అండ్ల బంగారం ఎట్లా పండుతది" అడిగాడు రాఘవులు.

అంతలోకే మేస్రం జంగు, కనకం బాలు ఇంకా కొంతమంది గోండ్లు జట్టుగా వచ్చారు.

"చూస్తరు గద బంగారం ఎట్ల పండుతదో" అని వచ్చిన వాళ్ళను ఉద్దేశించి– "రండ్లి రండ్లి" అంటూ వాళ్ళను లోపలికి పిలిచాడు పటేలు.

అందరూ ఒకేసారి– "రాంరాం" అంటూ పలకరించారు.

"రాం రాం... రండ్లి గిట్ల కుసోండి" అంటు జాగా చూపించాడు.

వచ్చింది మొత్తం పదిమంది గోండ్లు. మేస్రం జంగు, కనకం బాలు, ఆత్రం భీము, కుమురం రాము, పెండారం రాము, మార్పట్టి ఎంకు, సోయం లచ్చుమా, అర్జనాగోబా, మారివి జయరాం, మడావి మహదేవు మొత్తం పదిమంది. అందరూ గోండులే. ఎవరికీ భూమిలేదు.

ఈనెలు తీసి సున్నం రాసిన తమలపాకుల మీద కాచు చల్లుతూ– "నిన్న ఏమన్నరు. మీరు దున్నుకోను భూమిగావాల్నా..." అని అంటుండగానే–

"అవును పటేల... కూలిదొరకక మన్ను వరేషాన్‌ల ఉన్నం. అడివికి బోతే జంగ్లాతోల్లు ఎట్లబడితే అట్ల జులుం జేయవట్టిండ్లు. గింత మనిషికి పదెకరాలన్న ఇప్పిస్తే దున్నుకొని కడుపునింపుకుంటం. దయగల మారాజువని




గిట్ల ఎంట వద్దుకన్నమ్" అన్నాడు కనకం బాలు.

"అవునుగానీ... మంచి భూమి పరంబోకు గాని, సివాయె జమాబంది భూమిగాని ఇప్పట్ల లేదురా. ఉన్నదల్లా ఖరీజ్ ఖాతా భూమే. అది జేసుకుంటమంటే జెప్పుండ్రి ఎట్లనో అట్ల తిప్పలు పడత. ఉత్తపిసముండకొడుకులు మీరు. మీ కష్టం సుతలేకపోతున్న"

"ఆ ఖరీజ్ ఖాతా భూమి ఎక్కడుంది పటేలా?"

"అదేరా... అత్రం రామారావు మొకాషి భూమి. రామారావు సచ్చిండు గదా ఆ భూమి నిన్ననే మన నాయబ్‌సాబ్ ఖరీజ్ ఖాతాల గలిపిండు. అదిప్పుడు పట్టా భూమిగాదు. ఖరీజ్ ఖాతా భూమి కింద అస్తది" అని అన్నాడు.

పటేలు మాటలు విని వాళ్ళలోవాళ్ళే గొంతు భాషలో ఏమో గుస గుస మాట్లాడుకున్నారు.

"ఏమంటరు మరి. నేడు 'వాంకిడి' పోతున్న. మీరు జేసుకుంటనంటే మీ పేర్లు రాపిస్త. లేదంటే ఇగో గీల్లకూ ఆ భూమి గావాల్నంట. మీకద్దంటె ఈల్ల పేర్లు రాయించుకస్త" అంటూ తుకారామ్, రాఘవయ్యలను చూపించాడు.

వాళ్ళలో వాళ్ళే మళ్లీ గుసగుసలాడుకొని-

"అది అంతా జంగలయిపోయిందిగద పటేలా! ఆ అడివి మంచిగ జేసుకోవాల్నంటే మా రెక్కలు తెల్లవడతయి. అదిగాక అందరం ఒంటిచేయిగాళ్ళం. అంత కష్టం మా ఒక్కల్లతోని అయితదా అని యెనకా ముందు అవుతున్నం"

"కష్టపడెటోల్లకు అడివేందిరా! ఒకప్పుడంతా అడివేగదరా! అడివిలకెల్లె అన్నీ పుట్టయి. ఊర్లు పుట్టయి. చేన్లు పుట్టయి. పొలాలు పుట్టయి. బంగారం కూడా పుట్టది. అడివేందిరా అడివి... నాలుగొద్దులు నడుం కడితే ఈ అడివే అద్దమౌతది. బంగారం పండుతది. మీ ఇష్టం... మీతోని కష్టపడుడు అవుతదంటే జెప్పుండ్రి. లేకుంటె ఈల్లపేరు తోని రాయించుకస్త. ఎట్లనో అట్ల ఆల్లే జేసుకుంటరు"

"గట్లద్దు. మా పేర్లనే రాయించుండ్రి. మేమే కష్టపడి చేసుకుంటం" అని అందరి మాటగా చెప్పాడు మేస్రం జంగు.

"అయితే ఇంకేం, రేపట్నుంచే పని సురుజేయుండ్రి. నేను ఇయ్యాల్లనే వాంకిడికెల్లి నాయబ్‌సాబ్‌ను గలిసి పని జూసుకస్త" అంటూ వారిని పంపేసాడు.

"రాం రాం" చెప్పుకుంటూ వెళ్లిపోయారు వాళ్లు.

పటేలు తమలపాకులను పుక్కిట పెట్టుకొంటూ "మీకు తెలవదు ఈ గొండోల్ల సంగతి. ఒకటే పట్టు. అవునంటే అవ్. కాదంటే కాదు. లేదంటే లేదు. ఉత్త మంకుజాతి. నూసిండ్లు గద... రెండేండ్లల్ల ఆ భూమిని కంచంతీరు జేస్తరు. ఆ భూమిల ఒక్క గరకపోసకూడా లేకుండ, అద్దం మేరంజేసి మీ సేతుల బెడ్త. నేడే బోయి అయినకాడికి మీ పని జేసుకస్త. ఈ రెండేండ్లు మీరే తాసీలు శిస్తు, మామూల్లు కట్టి రసీదులు తీసుకోవాల. మల్ల మెల్లగ మీపేర నేనే పట్టా రాయిస్తా" అని సాలోచనగా వాళ్ళ వైపు చూసి, "అయితే మరియ్యాలనే నన్ను నాయబ్‌సాబ్‌ను గలవమంటరా?"

"గట్లనే పోదురుగాని. మేము కొంచెం మా ఇండ్లదాంక పోయి మల్ల అచ్చి కలుస్తం" అంటూ లేచి వెళ్లిపోయారు. రెండేళ్ళ తరువాత దొరికే పట్టాగురించి కలలుకంటూ నడుస్తున్నా, పట్టా చేతుల్లో పడేవరకు పటేలుకు ఎంతో కొంత అప్పుడప్పుడు ముట్టజెప్త ఉండాల్సిందేగదా! అందుకే తమతమ ఇండ్ల వరకు వెళ్ళొస్తామని వెళ్లారు.

పటేలు పాన్‌లోకి సున్నం, కాసు సరిగ్గా సరిపోయింది. పటేలు నోరు ఎర్రగా పండింది.

★ ★ ★

దేవుబాయి మనసు మనసులో లేదు. ఉన్న ఆధారం భూమి పోయినట్టే. కొండంత అండ తండ్రిపోయినా తట్టుకుంది తను, కాని భూమి పోతోందంటేనే ఎట్లాగో ఉంది ఆమెకి.

తను ఎలాగో ఒకలా బతికేస్తుంది.

కాని తమ్ముడి గతేంటి. భూమి లేకుండా ఎలా బతుకుతాడువాడు- అని తలచుకొని ఏడుస్తోంది.

"ఆ తాసీల్‌దార్ పక్కలో పడుకొని ఉంటే ఇలా జరిగేది కాదేమో!"

తమ కాళ్ళ కింద భూమి ఎవరో చాపలాగా లాగేసినట్టు, ఏ దిక్కూ లేనివాళ్ళలా రోదించసాగింది దేవు.

అప్పుడు 'నీ ఆధారం, నీ భూమి-పుట్రా, నగ-నట్రా, అన్నీ నేనే అన్నట్టు పిలిచాడు జంగు, "దేవూ" అని.

దేవు పరుగునవెళ్లి జంగు గుండెలపై వాలి రోదించసాగింది. భూమి పోయిన దుఃఖంతో ఏడుస్తోందనుకున్నాడు కాని తాసీల్‌దార్ తనను పక్కలోకి రమ్మన్నాడని కూడా ఏడుస్తోందని జంగుకు తెలియదు.

జంగు తల నిమురుతూ, కన్నీళ్ళు తుడుస్తూ ఓదారుస్తున్నాడు.

ఓదార్చేవాళ్ళుంటేనే ఏడుపు పొంగుకొస్తుంది. జంగు ఓదార్పుకు దేవు దుఃఖం ఇంకా ఎక్కువవుతోంది. ఏడ్చిఏడ్చి అలిసిపోయిన దేవు అలాగే జంగు భుజంపై వాలిపోయింది.

"దినాలు మంచిగ లేవు. మనం జల్ది లగ్గంజేసుకుందాం. నువ్గూడ మాతోనే ఉండచ్చు" అంది జంగు కళ్ళలోకి చూస్తూ.

"అట్లనే జేసుకుందం. మన లగ్గమయినంక నా నెత్తిల నువ్వేసిన పేన్లన్నీ తియ్యాల మరి. లగ్గంకాకుండనే నా నెత్తిన పేన్లేసినవ్. లగ్గమైతే ఇంకేం జేస్తవో" అంటూ గారంగా నిండైన గుండెలపై తల ఆన్చి కళ్ళు మూసుకున్నాడు.

"పెండ్లాం పేన్లు మగని నెత్తిల వస్తే ఆ పెండ్లాంకు మొగని మీద మస్తుగ ప్రేమున్నట్టట"

"ఆఁ... మస్తు ప్రేమ. ఇగో చేయివెడ్తే రెండు వొర్కుతున్నాయి" అంటూ పిచ్చిగా తల గోక్కుంటే పగలబడి నవ్వింది దేవు.

"ఒక్క పేను లేకుంట ఏరేస్తగని... మంచిగ పడుకో" అంటూ జంగుని ఒడిలోకి లాక్కుంది.

★ ★ ★

అల్లి గూడెం ఒక చిన్న పల్లె. అక్కడ ఊరి పెత్తనమంతా పంతులుది. పంతులే ఆ ఊరికి పట్వారి. అల్లిగూడెంలో అరవై వరకు గోండు గుడిసెలు, ఇరవై నాయకపోళ్ళ, కొలాముల గుడిసెలుంటాయి. ఈ నాయకపోళ్ళు, కొలాములు గోండులకన్నా ఇంకా వెనకబడినవారు.

చాలా విషయాల్లో గోండులే వీరికన్నా నయం. గోండుల్లో కొంతమందికైనా పట్టా భూములుంటాయి. ఒకప్పుడు రాజ్యాలు పరిపాలించిన జాతి గోండులది. పశువులు, ఇండ్లు, నాగలి, భూమి పుట్రా ఉంటాయి. కాని ఈ కొలాములు, నాయకపోళ్ళు అలా కాదు. వీరు మామూలు వ్యవసాయం చేయరు. వీరిది పోడు వ్యవసాయం. వీరు పంట పండించటానికి ఎద్దులు, నాగలి ఏమీ ఉపయోగించరు. కర్రు, పార, కొడవలి, గొడ్డలి ఇవే వారి పనిముట్లు. వీటితోనే పంట పండిస్తారు.

అడవిలో వాళ్ళు ఇష్టమొచ్చినచోట వ్యవసాయం చేస్తారు. ఎక్కడ సాగు చేయాలో అక్కడ మొదట కర్రుతోనేల తవ్వి గుల్లగా చేస్తారు. చేతులతో విత్తనాలు విత్తుతారు. సాగు భూమిలో చెట్టు-పుట్ట కొట్టడానికి పార-గొడ్డలి ఉపయోగిస్తారు. కోతకు కొడవలి.

పోడు వ్యవసాయం వీరు వరుసగా ఒకేచోట చేయరు. రెండు మూడేళ్ళకోసారి సాగుచేసే నేల మారుస్తారు. పంట మార్పిడి లేదు. ఎరువులు లేవు కాబట్టి స్థలం మారుస్తారు. ఒకేచోట వ్యవసాయం చేస్తే భూమి సారం తగ్గిపోయి పంటలు పండవు అని వాళ్ళ నమ్మకం. వీరు అడవంతా తిరుగుతూ గుట్టలపై వ్యవసాయం చేస్తారు.

అల్లిగూడెం గుట్ట పక్కన ఉంది. గుట్టమీద వ్యవసాయం చేసుకుంటూ ఓ ముప్పయిమంది వరకు అల్లిగూడెంలో తలదాచుకుంటున్నారు.

ఊళ్లో గుడిసెలేసుకొని ఉంటున్నందుకు అల్లిగూడెం పట్వారి పంతులుకు సుంకం కట్టుకోవాల.

కొలాములు నాయకపోళ్ళకంటే ఇంకా వెనకబడినవారు. వీళ్ళు వ్యవసాయంకూడా చేయరు. అడవిలోంచి వెదురు కొట్టి తీసుకొచ్చి బుట్టలుగా వీరి తడికెలు, బుట్టలు, గుల్లలు, గంపలు, గుమ్ములు, గాదెలు, జల్లెళ్ళు, చేటలు అల్లుతారు. ఈత చెట్లు ఉన్నచోట ఈతకమ్మలతో చాపలు, చీపుర్లు కట్టి అమ్ముకుంటారు. అదే వాళ్ళ బతుకుతెరువు. చేసిన వస్తువ్

ఊరూరు తిరిగి, అంగళ్ళుచేసి అమ్ముకుంటారు.

ఫక్రు, కుస్రు, నాగేబా, కొండడు, మాధు అందరూ జొన్నలు - ఇప్పపువ్వు కలిపి ఉడకబెట్టిన అంబలి తాగి కర్లు, పారలు, గొడ్డళ్ళు తీసుకొని పనికి బయలుదేరారు. అందరూ నాయకపోళ్ళే.

ఊరుదాటి గుట్టదారిన వెళుతోంటే దారిలోనే చౌకీదారు ఎదురయ్యాడు. నాయకపోళ్ల మనసు ఎందుకో కీడును శంకించింది.

"ఎటు పోతున్నార్రా?" అని అడిగాడు చౌకీదారు.

"ఎటులేదు... గిట్లనే ఎల్లినమ్" అంటూ జవాబిచ్చాడు ఫక్రు.

"గిట్లనే అంటే ఎటురా?" అంటూ దబాయించాడు చౌకీదార్.

"మా రెండు ఎడ్లు తప్పిపోయినయి. ఎక్కడున్న ఇటు కనిపిస్తయేమో అని చూసుకుంట ఎల్లినమ్" అంటూ అబద్ధమాడాడు కుస్రు.

"ఓహో గట్లన... మరి చేతులల్ల గీపార, గొడ్డల్లు ఎందుకున్నయిరా?" అంటూ ఒకడి చేతిలోంచి గొడ్డలి లాక్కున్నాడు.

"ఏం జెప్పరేందిరా... మీ సేతులల్ల గీ గొడ్డల్లెందుకున్నయి. అడాయికి పోతున్నర. గాడిద కొడుకుల్లారా! ఇక్కడెక్కడో జంగల్ల చెట్లుగొట్టి తప్పే నాశనం జేసుకుంట, పంటలు పండించుకుంట మల్ల మాట్లాడ్తె అబద్దం జెప్తార్రా" అంటూ కనుగుడ్లు పెకిలించి చూడసాగాడు.

"లేద్దొర... ఇమానంకొట్టి జెప్తున్నమ్- మేము అడివి కొడతలేం. అక్కడ గింతంత భూమి పడీతగ ఉంటే కట్టెతోని గెల్లగించి గిన్నిజొన్నలు, గిన్ని సామలు ఏసుకున్నాం. గంతే నీ బాంచలం" అని ఫక్రు అనగానే చౌకీదారు ఫక్రు చెంపమీద ఈడ్చికొట్టాడు. మళ్ళీ జుట్టు పట్టుకొని గుంజి ఇసిరేసాడు. ఫక్రు వెళ్ళి కిందపడటంతో తలరాయికి తగిలి రక్తం ధారగా కారసాగింది.

పయింటో ఉన్న మాధుకు అది చూసి ఆవేశం ఆగలేదు.

"మీకు కావాల్నంటే గింత మామూలు అని అడుగుండ్లి. అంతేగని గీ కొట్టుడు సంపుడు ఏంది దొర. కాని జాగల దెబ్బతగిలితె లటుక్కున పానం బోతేగింత ఎవల్లు జిమ్మేదార్" అని అనగానే చౌకీదారు అరికాలి మంట నెత్తికెక్కింది.

"లమ్డి కొడుకుల్లారా... మీరు నాకు మామూలు ఇస్తార్రా. ఎంత ఉన్నదిరా మీదగ్గర ముల్లె" అంటూ మాధును ఇష్టంవచ్చినట్లు బాదసాగాడు.

వాడు ఒక్కడు. వీళ్ళు పదిమంది. కాని పైచేయి వాడిదే. ఇష్టంవచ్చినట్లు కొడుతున్నాడు పిచ్చికుక్కలాగ అరుచుకుంటూ.

అలా వాళ్ళను కొట్టుకుంటూ వాళ్ళేసిపోడు వ్యవసాయం ఉన్న చోటుకు లాక్కెళ్ళాడు.

పంట ఏపుగా పెరిగి ఉంది.

చెయ్యెత్తు ఉంది జొన్నపంట.

అప్పుడే పొట్టమీదికొచ్చి కంకి విడుస్తున్నది.

అలాగే కొర్రచేను, సామలపంట ఏపుగా ఎదిగి ఉంది.

"ఉఁ... మొత్తం ఈ చేనుకోసి కుప్పబెట్టుండ్లి. ఇదే మీకు నా సజా" అంటూ ఉరిమాడు చౌకీదార్.

"ఇప్పుడు గీ సేతికొచ్చిన పంట కోసుడు దేనికి దొర! ఏదో బుద్ధిలేక ఏదో అంటిమి. నువ్వు కొట్టివి. మేము పడ్తిమి. ఇక మాఫ్‌జెయ్యి మమ్ముల్ని" అంటూ చౌకీదార్ కాళ్ళమీద పడ్డాడు పయిసుడిగిన ఫక్రు.

"లమ్డి కొడుకుల్లారా! అందితే జుట్టు అందకుంటే కాల్లా. చల్... లేఁబే" అంటూ కాలితో ఒక్క తన్ను తన్నాడు.

అయినా ఫక్రు రోషపడలేదు. పంతానికి పోలేదు. జీవితం తెలిసినవాడు. ఆకలి అంటే ఏమిటో ఎరిగినవాడు. పంతానికిపోయి రోషపడితే నోటికొచ్చిన కూడు నేలపాలవుతది- అని ఆలోచించి-

"అద్దు దొర... నీకొడుకుల బిడ్డలసుంటోల్లం. ఈ మా తప్పు ఈసారి కాయి. మమ్ముల్నిడిసిపెట్టు. పంటకోసి నాశనం జేసేమాట ఇడిసి ఇంకేమన్న జెప్పు... జేస్తం" అంటూ చౌకీదారు ముందు తలవంచి- "ఇంకా నీ కోపం పోకపోతే

ఇంకా నాలుగు తన్ను. అన్నంపెట్టే తండ్రి బిడ్డని తన్నడా ఏంది'' అంటూ చౌకీదారు చేతులు పట్టుకొని కడుపులో తలపెట్టాడు.

''నాది మాటంటే మాటనేరా. నాపేరు తెల దేమో మీకు. జాలిమ్‌సింగ్. జాలిమ్‌సింగ్ పేరు జెప్పితే ఈ అడీల పులికూడా నీల్లు ముట్టదురా! అసుంటి నాకు జవాబు జెప్తల్‌రా! నువ్వెంత నీ లెక్కంత. నడుప్‌బే ముందు. కొడలిబట్టి పంట కొయ్యి'' అంటూ కిందబడ్డ కొడవలి తీసి ఫక్రు చేతికిచ్చి ముందుకు తోసాడు.

కొడవలి ఉన్నవాళ్లు కొడవలితో-

లేనివాళ్ళు గొడ్డళ్ళతో, కర్రలతో-

మొక్కలను నాశనం చేస్తున్నారు.

జాలిమ్‌సింగ్ స్వయంగా చేత్తో చెట్లుపీకి కుప్పల్లా వేస్తున్నాడు.

ఫక్రు, ఇస్రు పసిపిల్లల్లాగా ఏడుస్తున్నారు.

కన్నకొడుకులను, బిడ్డలను ప్రాణం ఉండ గానే తమ చేతులతో మట్టి చేస్తున్న తండ్రుల్లా ఉన్నారు వాళ్ళు.

ఆ చేలు ఇంత కావటానికి మూడునెలలు పట్టాయి వాళ్ళకు. కాని జాలిమ్‌సింగ్ నాశనం చేయటానికి మూడు ఘడియలు పట్టలేదు.

చూస్తుండగానే నిలువు చేను అడ్డం పడిపో యింది. వయసులో ఉన్నప్పుడే తండ్రి ముందు అకాలంగా నేలకొరిగిన కొడుకులా.

చౌకీదారు కళ్ళు చల్లబడ్డాయి.

నాయకపోళ్ళ కళ్ళు ఎర్రబడ్డాయి ఏడ్చీఏడ్చీ.

''ఇంతకు ముందు ఎవ్వడ్రా ఆడు నాకు మామూల్ ఇస్తా అన్నది'' అంటూ అందరిని కలియజూసాడు.

మెల్లగా ముందుకొచ్చాడు మాదు.

మాదును ఒకసారి గుర్రుగా చూసి, మాదుతో పాటు మరో ఇద్దర్ని ముందుకు రమ్మని పిలిచాడు.

నాగబా, కొండడు ముందుకొచ్చారు.

కొడతాడేమోనని భయం భయంగానిలబడ్డా రు ముగ్గురు.

''ఈల్లు ముగ్గురు ఈడనే ఉంటరు. మిగిలి నోళ్ళుపోయి గా మామూలేందో తెచ్చి ఇచ్చి ఈల్లను తీస్కపొండి. అంతదాంక జమానత్ కింద నా దగ్గర్నె ఉంటరు'' అంటూ చేతి సంచిలోని సీసా తీసి నోటికి పెట్టాడు. వాసన గుప్పున కొట్టింది.

''ఇంక మామూలేంది దొర. నోటికాడి కూడని కూడా సూడకుంట మన్నుజేస్తిరి గదా!'' అన్నాడు ఇస్రు ఎంతో తమాయించు కొని.

''అబే బేకూఫ్... ఈ జంగల్ నీ తాతదా! ఇంత జాగలచెట్టుగొట్టి నాశనంజేస్తిరి గదర. అందుకు సర్కార్ ఖానూన్ లెక్కన సజా ఏందో తెలుసునా- రెండేండ్లు జైలుపడతది. నేను తలునుకుంటే ఇంకా ఎక్కువనే పడ్తది. అందు కని మాట్లాడకుండపోయి నా మామూలు పట్క రండ్లి. అంతదాంక ఈ ముగ్గురు లష్టికొడుకు లు నా తాటనే ఉంటరు. తెలిసిందా? ఎల్లుండ్లి'' అంటూ ఆ ముగ్గుర్ని తనతోపాటు వెంటబెట్టుకొని ముందుకు కదిలాడు.

ఆ ముగ్గురు వాళ్ళ పనిముట్లు పట్టుకొని వస్తూంటే అడవిలోకి దారి తీసాడు.

మిగిలినవాళ్లు కోసిన పంటలోంచి వసికొచ్చే కంకులను ఏరుకొని మూటలా కట్టుకొని అల్లి గూడెంవైపు నడిచారు.

నాయకపోళ్ళు ఇలా పోడు వ్యవసాయం చేస్తూ పట్టుబడ్డప్పుడు మామూల్లు పుచ్చుకో వడం లేదా తన్నులు తన్నడం, అవసరమను కుంటే తమ ఇళ్ళల్లో, జంగ్లాత్ ఆఫీసుల్లో వెట్టి చేయించుకోవడం, అవసరం తీరాక వదిలి వేయడం పరిపాటి.

జాలిమ్‌సింగ్‌కు తెలుసు- నాయకపోళ్ళ దగ్గర చిల్లిగవ్వకూడా ఉండదని. వాళ్ళు రారని. ఆ ముగ్గురితో నెల, రెండు నెలలు వెట్టిగా టేకు చెట్లు నాటిస్తాడు. ముందు వాళ్ళు పోడుచేసిన స్థలంలోనే చెట్లు నాటించి నీళ్ళు పోయిస్తాడు. మళ్ళీ ఇంట్లో నీళ్ళు మోయించి, కట్టెలు కొట్టించి, బట్టలు ఉతికించి ఏనాటికో వదిలిపెడతాడు.

జాలిమ్‌సింగ్ అయితే ఇంకో వెట్టి చాకిరీ చేసే మనుషులు దొరికేవరకు వీళ్ళను వదిలి పెట్టడు.

పారిపోయి ఇంకోచోట తలదాచుకుంటే





తప్ప వాడి చేతుల్లోంచి తప్పించుకోవడం కష్టం.

★ ★ ★

నాయకపోళ్లు అల్లిగూడెం వెళ్ళి జరిగింది పదిమందికి చెప్పుకున్నారు. అందరూ 'అయ్యో' అంటే 'అయ్యో' అని సానుభూతి చూపించారు. అంతకంటే ఎక్కువ ఏం చేయగలరు.

కాస్త తెలిసినవాళ్లు-- "గిదేం అన్యాలం. నాయబ్‌సాబ్ గీ పల్లెల్ని ఎక్కడో తాసీలు వసూలుకచ్చిండంట. నిన్ననో మొన్ననో 'పిట్టబొంగారం' అచ్చిండంట. అక్కడికివోయి పటేల్‌సాబ్ అడ్గితే నాయబ్‌సాబ్ పత్తా జెప్తె చెప్తడు. లేకుంటే ఆ పటేల్‌సాబ్‌నే ఆ చౌకీదార్‌కు ఒక మాటజెప్పి సూడమనుండ్లి. కులం కులం ఒక్కటి. పని అయితదేమో?" అని సలహా ఇచ్చారు.

అందరూ కలిసి పిట్టబొంగారం పోయారు.

కాని అప్పటికే నాయబ్‌సాబ్ పిట్టబొంగారం నుండి ఎప్పుడో వెళ్లిపోయాడని తెలిసింది.

పటేలు కూడా లేడు. 'వాంకిడి' డాగ్ బంగ్లాకు నాయబ్‌సాబ్‌ని కలవటానికి పోయాడని తెలిసింది.

ఇప్పుడేం చేయాలో అర్థంకాలేదు వాళ్లకు. చేతిలో చిల్లిగవ్వ లేదు. జంగ్లాత్‌వాళ్లకు అప్పగించిన ముగ్గురు పడుచుపిల్లలను ఎలా విడిపించుకోవాలో తెలియడంలేదు.

అంతలోకే వాళ్లకు పిట్టబొంగారం గోండులు మేస్రం జంగు, కనకం బాలు, ఆత్రం భీము కలిసారు. వాళ్ల కథ విని బాధపడ్డారు.

గతిలేనివాళ్లకు గతిలేనివాళ్లే దిక్కు.

ఒకళ్ల కష్టాలు ఒకళ్లు చెప్పుకున్నారు.

అల్లిగూడెం నాయకపోళ్లకు ఈ యేటికి ఉందనుకున్న ఒక్క ఆధారం ఆ పోడు వ్యవసాయం పోయింది. ఇప్పుడు దిక్కులేని పిట్టలయ్యారు. నాయకపోళ్లు ఎన్నడూ అరకపట్టి ఎరగరు. బుద్ధి తెలిసినప్పటినుండి అలా గుట్టల వెంటబడి తిరుగుతూ పోడు వ్యవసాయం మాత్రం చేయడం తెలుసు. పోనీ కష్టపడి ఎక్కడైనా ఇంత భూమి సంపాదించి అరకపట్టి దున్నుకుందాం అంటే వ్యవసాయానికి అవసరమైన ఎద్దులు, బండ్లు, నాగలి లేవాయె. పైగా తాసీల్ కట్టాల, జంగ్లాత్ మామూళ్లు కట్టాల-- వాటన్నింటికి వాళ్లదగ్గర డబ్బు లేదు.

ఎటు చూసినా దారిలేదు. ఇక పిల్లా-జెల్లా ఎలా బతికటమో అని దిగులు పడుతున్నారు. అదే సంగతి గోండ్లతో చెప్పుకున్నారు.

గోండులు తమ గోడు వినిపించుకున్నారు.

"ఇప్పుడున్న మా పదిమంది గలిసి గీ నూటా అరవై ఎకరాల జంగలనుంటి ఈ పడీత్ భూమిని సొక్కం జేసుడు అయ్యే పనేనా! అని మా ఫికరు" అన్నాడు మేస్రం జంగు.

"ఏది అయినా మన మంచికే అనుకుంటె పాయె" అన్నాడు భీము.

"గదెట్ల" అన్నాడు నాయకపోళ్ల ముసలి ఫక్రు.

"మీకున్న అదరమానం పాయె. దేవుడు పంపినట్టు మీరు గిట్ల అస్తిరి. మాతోని గలిసి గిద పని చెయ్యరాదు. నిన్ననే మాకు నాయబ్‌సాబ్ గింత ఖరీజ్ ఖాతా భూమి ఇప్పించిండు. మేం పదిమందిమి. దాన్ని జేసుడు మా తరంగాదు. ఉత్త అడివి. మీరు సై అంటే కలిసి జేసుకుందాం. కలిసి పంచుకుందాం కష్టమైన సుఖమైనా" అన్నాడు భీము.

"అవు... గట్లనే జేయుండ్లి. మా తమ్ముండ్ల కటి మీరు ఒకటినా. కలిసి కష్టపడదాం. కలిసి తిందాం గటకనో, అంబలో. ఇయ్యేడు ఆ భూమిల అరక కట్టుడు దేవుని తరం కూడా గాదు. అట్లున్నది. జంగల్‌భూమి అనుకోండ్లి. ఇయ్యేడు మీ తరీకనే పోడు జెద్దాం. అక్కడింత ఇక్కడింత ఆటం ఉన్నతాట పంట పండించుకుందాం. చెట్టుపుట్టా సాఫయినంక సల్లగ బతికితే అచ్చేటికి పంటలేసుకోవచ్చు" అన్నాడు మేస్రం జంగు.

"మంచిగనే ఉంటది. మాకు ఇంత అదరమానం దొరుకుతది. కాని ఇయ్యాల సెట్టు పుట్ట కొట్టస్తది. కాని రేపటి దినం మాకు అరకపట్టరాదు. మరి గప్పుడెట్ల" అని తన అనుమానం వ్యక్తపరిచాడు ఫక్రు.



"ఉన్నోల్లందరం అరకనే వత్తమా ఏంది. అరక మేం వత్తం. మీరు మిగిలిన పని సూడచ్చు"

"గట్లయితే మంచిగనే ఉంటది. ఏదో శ త్రం జెప్పినట్టు పేదోడికి పేదోడే దిక్కు. ఆ మా భూమి పోకడేంది. మేం గిట్ల రాకడేంది. మీరు మమ్ములను తమ్ముండ్ల తీర్గ దగ్గర తీసు డేంది" అంటూ తబ్బుబ్బుయిపోయారు.

"పొద్దుగాల్ల లేసి గా చౌకీదార్ కలిస్తే ఎవలి ముకం జూసినమో అని తిట్టుకుంటిమి. మల్ల ఇప్పుడు అనుకుంటున్నం గిటు అస్తున్నప్పు డు ఏంతొక్కి అచ్చినమో అని" అన్నాడు ఇస్రు.

"మరి ఆ చౌకీదార్ పట్కపోయిన పొర గాండ్ల సంగతెట్లంటరు?" అని గుర్తు చేసాడు కనకం బాలు.

"అదే సమజలవత్తలేదు. ఏం జేసుడు అని. పడును పొరగాండ్లు. రోషమెక్కువ. ఆడు కానిమాటన్నా ఈల్లు ఇనుకుంటే మంచిది. కాకుంటే ఈల్లు మల్ల మాటకు మాటంటే ఆడు ఉత్త తిక్క ఫకీరు. కానిజాగల కొడ్తె పుసుక్కున ఏమన్నయితే- అని మా బయం" అని తనలో తానే గొణుక్కొని మళ్లీ-- "ఇప్పుడేం జేయ మంటవన్న" అని అడిగాడు ఫక్రు.

"ఎవల్లకు జెప్పుకుంటం. చెప్పుకున్న ఇనె టోల్లెవరు. ఆ చౌకీదార్ జాలిమ్‌సింగ్ ఉత్తర క్కసి ముండా కొడుకు. ఒకల్లు జెప్తే సూటా ఇనెటోడు కాదంట. మల్ల మీరే రేపొకసారి ఎల్లి కాల్లమీద పడుండ్లి. అన్ని కలిసినట్టుంటది. ఆల్లని ఒక సూపు సూసుకున్నట్టుంటుంది" అన్నాడు మేస్రం జంగు.

"గట్లనే జేస్తం మరి. ఇక యెల్లస్తం. రేపొక సారి అల్లనిజూసి, సామాన్లతోని అస్తం- ఈ ఊరికి. ఇయ్యాలటితోని అల్లిగూడెంతోని రునం తీరిపాయె" అంటూ లేచారు ఇస్రు, ఫక్రు, కొండడు.

"రండ్లి మా ఇంటికిబోదాం. నేను ఇటు రాంగ మా పొరగాండ్లు గింత ఇప్పపువ్వు కాయ వట్టిండ్లి. కొంత నోట్ల వేసుకొని పోదురుగాని" అని మేస్రం జంగు అనగానే అందరూ లేచి జంగును అనుసరించారు.

★ ★ ★

పొద్దున లేవగానే తిండి తిప్పలు కానిచ్చి, ముల్లెమూట- చేట ముంత సర్దుకొని తలలకె త్తుకొని, పిల్లాపాపలతో అల్లిగూడెం నుండి పిట్టబొంగారం వైపు ప్రయాణం కాసాగారు నాయకపోళ్లు.

అంతలోకే గుర్రాలపై దిగారు జంగ్లాత్‌వా ళ్లు.

జంగ్లాత్‌వాళ్ల గుర్రాలు చూడగానే నాయక పోళ్లపైప్రాణాలు పైకే పోయినట్లయ్యాయి. కాని వాళ్లు వచ్చింది నాయకపోళ్లగురించి కాదు, ప్రతియేటా వారు చేసే వసూళ్ల కోసం.

వచ్చినవాళ్లలో ఒక సేరేదారు, ఇద్దరు చౌకీ దార్లు, నలుగురు జంగ్లాత్ జవానులు, ఇద్దరు పోలీసు జమేదార్లు ఉన్నారు. సేరేదార్ భుజ నికి తుపాకి వేలాడుతోంది.

వాళ్లు రావడంతోనే పట్వారి పంతులు పిట్ట లాగా వచ్చి వాలాడు. ఇక కుక్కలాగా వాళ్ల తోకపట్టుకొని వెంట తిరుగుతాడు.

వీళ్లు వచ్చిన సంగతి కాసేపట్లో 'గుట్టపై నెగడు'లాగా ఊరంతా వ్యాపించింది. అంద రూ మూటలిప్పి హాలీ- కల్దార్ చిల్లర నాణా లు లెక్క పెట్టుకుంటున్నారు.

వచ్చినవాళ్లు పీర్లసావిట్లో సభ చేసారు.

జంగ్లాత్‌వాళ్లు ముందు 'దుంపపట్టీ' వసూ లుకై కూర్చున్నారు.

దుంపపట్టీ 'అరకకు' ఇంత అని వసూలు చేస్తారు. ఆ డబ్బులు కడితే ఆ వ్యవసాయదా రు ఒక సంవత్సరానికి అతడి కుటుంబానికి సరిపడా వంటచెరకు, అరక సామానుకు కర్ర అడవినుండి హక్కుగా తెచ్చుకోవచ్చు. అంతే గాని ఇంటికీ, కొట్టానికీ ఇంకా ఇతర వస్తువుల కోసం కర్ర తేరాదు. అలా తీసుకొస్తే ఫైన్ చేస్తారు.

ప్రతీ వ్యవసాయదారుడు ఏడాదికి రెండు రూపాయల 'దుంపపట్టీ' కట్టాలి. ఆపైన రెండ ణాల మామూలు ఇచ్చుకోవాల. ఈ రెండూ కాక పండించుకున్న పంటలో 'ఇంత' అని మామూ లు కింద ఇచ్చుకోవాలి- అది వేరే సంగతి.

వచ్చినవాళ్లు వచ్చినట్టు 'దుంపపట్టీ' కట్టి




# ఏరిన ముత్యాలు

★ అబద్ధమాడటం కంటే పెద్ద నేరం మరోటిలేదు. అంతకంటే నీచమైనది, హాస్యాస్పదమైనది వేరొకటి ఉండదు. దుర్మార్గం వల్లనో, గర్వం వల్లనో, పిరికితనం వల్లనో అబద్ధమాడవలసి వస్తుంది. అయితే అబద్ధమాడటంవల్ల ఏ ఉపయోగం ఉండదు. ఎప్పటికయినా నిజం బయటపడక పోదుకదా!

– ఎర్ల్ ఆఫ్ చెస్టర్ ఫీల్డ్

★ ప్రతి వ్యక్తి చరిత్ర మూడు రూపాల్లో ఉంటుంది. ఒకటి తన గురించి తాను తెలుసుకున్నది. రెండోది ఇతరులు అతని గురించి తెలుసుకున్నది. మూడోది అతని అసలు స్వరూపం.

– అల్ఫాన్సీకర్

★ మేము సత్యవంతులం, ఆధ్యాత్మికపరులం, నమ్రత కలవాళ్లం, అన్ని సద్గుణాలు మావేనన్న గర్వం కూడా తప్పుతాగించినంత పనిచేస్తుంది. అన్ని గర్వాలలోకీ గొప్ప హానికరమైన గర్వం నేను ధర్మపరుణ్ని అనే గర్వం.

–చలం

★ దుఃఖాన్ని, క్రూరత్వాన్ని తగ్గించేందుకు నిరంతరం ప్రయత్నించాలి. ఇదే మానవజాతి ప్రథమ కర్తవ్యం.

– రోమారోలా

★ ఉత్తమ కళాకారులు ఎందరో వుండొచ్చు. కానీ విశుద్ధమైన జీవితం గడిపేవాడే ఉత్తమోత్తముడైన కళాకారుడు.

–గాంధీజీ

★ కవిత్వమంటే ప్రీతి, చక్కని జీర్ణశక్తి- ఈ రెండే జీవనయానానికి నాకు తెలిసిన మంచిమార్గాలు.

–జోనాగే

★ అధికారం పక్కనే అవిధేయత ఉంటుంది. ఒకడు అధికారం చలాయిస్తుంటే దాన్ని లక్ష్యపెట్టనివారు పక్కనే తయారవుతారు.

–హాలీ బర్టన్

★ ఒక ఆదర్శాన్ని నమ్మిన వ్యక్తి వెయ్యి తప్పులు చేస్తే, ఏ ఆదర్శం లేని మనిషి యాభైవేల తప్పులు చేస్తాడు.

– వివేకానంద

★ అప్పు చేయడమంటే తనకున్న స్వేచ్ఛని అమ్ముకోవటం.

–గాంధీజీ

★ మన అలవాట్లు మన వశంలో ఉన్నాయని గొప్పలు చెబుతాం. వాటిని మానుకోవలసి వచ్చినప్పుడుగాని వాటి బలం తెలిసిరాదు.

–శ్యామ్యూల్ జాన్సన్

★ పెద్దవారితో స్నేహంకన్నా ఒంటరిగా ఉండటం ఎంతో మంచిది.

–జార్జి వాషింగ్టన్

పోతున్నారు.

అప్పటికి రానివాళ్ల పేర్లు కనుక్కొని వాళ్లను తీసుకురమ్మని కొత్వాలును పంపుతున్నాడు పట్వారి పంతులు.

వెనకాముందు అందరూ రానే వస్తున్నారు. లెక్క కట్టి పోతున్నారు. ఎన్ని అరకలుంటే అన్ని డబ్బులు కడుతున్నారు. ఒక్క పంతులు పట్వారే దుంపపట్టి కిందే నలభై రూపాయలు కట్టాల. కాని అతడు ఇరవై రూపాయలే కడ్తా డు. తనకు ఇరవై అరకలే ఉన్నాయంటాడు. నిజానికి అతడి భూమి ఐదువందల ఎకరాల పైనే ఉంటుంది. నలభై అరకలతో ఆ భూమిని సాగుచేస్తాడు.

దుంపపట్టి కట్టకపోతే అడవిలో కాలు పెట్ట నీయరు. రేపు ఇంట్లోగాని, వాకిట్లోగాని, చేనులో గాని ఒక్క కర్రముక్క కనిపిస్తే ఎక్కడినుండి తెచ్చావంటూ మూడు చెరువుల నీళ్ళు తా గించి మళ్ళీ పైనుండి సుంకం కట్టించు కుంటారు. అది తడిసి మోపెడవుతుంది. అందుకని ప్రతి ఒక్కరూ 'దుంపపట్టి' కట్టి తీరుతారు.

వచ్చినవాళ్ళందరిని చూసి-- "ఈ దుంపప ట్టి అయిపోంగనే మనం పండించిన పంటలకె ల్లి ఇంత అని మామూళ్ళకింద ఇచ్చుకోవాలి. అది రివాజు. ఈయేడు మనం జంగ్లాత్‌వాళ్ళ కు ఓ నాలుగు గోనెల జొన్నలు, రెండు గోనెల నువ్వులు, యాభయిసేర్ల పప్పు, గోనెడు బియ్యం, ముప్పయి సేర్ల పచ్చిపెసళ్ళు, పదిసే ర్ల మిరపకాయలు, ఐదుసేర్ల జనుము, ఇరవై మళ్ళపత్తి, పన్నెండు కోళ్ళు. ఇవి మనం ఇచ్చు కోవాల" అంటూ మామూళ్లకింద ఇవ్వాల్సిన లెక్క చెప్పాడు.

లెక్కప్రకారం మామూలు ముట్టాల. ఎవరికి ఏది ఎక్కువ పండితే అది ఎక్కువ ఇస్తారు. అందరికి మామూలుగా పండే పంటలు అర కకు ఇంత అని పట్వారి నిర్ణయిస్తాడు. ఆ లెక్కకు ఇవ్వాలి.

పంతులు ఇద్దరు బిగారిగాల్లను పిలిచి పంట మామూళ్ళు వసూలు చేయమని చెప్పా డు.

అంతలోకే ముగ్గురు పెద్దమనుషులు వచ్చారు గుర్రాలపై.

ఒకరు జనగామ (ఇప్పటి ఆసిఫాబాదు) వకీలు పంపిన గుమాస్తా. ఇంకొకరు అల్లిగూ డెం షావుకారు తమ్ముడు పుల్లయ్యాసేట్. ఈయన జైనూర్‌లో ఉంటాడు. ఇంకొకరు హస్నాపూర్ పటేలు కొడుకు రాజారాం. వీళ్ళు ముగ్గురు గుత్తేదార్లు.

జనగామ వకీలు తరపున వచ్చిన గుమాస్తా గడ్డికి గుత్తేదారు.

షావుకారు తమ్ముడు పుల్లయ్యా సేట్ ఇప్పపు వ్వుకు, ఈతచెట్లకు గుత్తేదారు.

హస్నాపూర్ పటేలు కొడుకు రాజారాం మొ ర్లివంత్లకు, సారపప్పుకు, బంకకు గుత్తేదారు.

ఈ అడవిలో ఉండే గడ్డి, ఇప్పపూవు, సారప ప్పు, బంక అన్నీ కూడా ప్రభుత్వ ఆస్తులు. ఒక్కోదానికి ఒక్కో కంట్రాక్టరు. అతడే గుత్తేదా రు. ఒక సంవత్సరం ఆ అడవిలో లభించే ఒక్కోరకం వస్తువుకు వేరువేరుగా వేలంపాట లు నిర్వహిస్తారు. వేలంపాటలో ఎక్కువ డబ్బు పోసి పాటపాడినవాడే ఆ అడవిలో, ఆ సంవ త్సరానికి ఆ వస్తువుకు రాజు. వారి అనుమతి లేనిదే ఎవరూ వారికి చెందిన వస్తువుపై చేయి వేయరాదు. అలా డబ్బుపోసి కొన్నవాడు వస్తు వును కాపాడుకోవాలి, అమ్మి సొమ్ముజేసుకోవాలి. కాని అలా చేయరు. సంవత్సరం పొడుగునా గాలికి వదిలిపెట్టి చివర్న జంగ్లాత్‌వాళ్ల తోలలు పట్టుకొని ఇలా ఊళ్లమీదపడి దోచుకుంటారు.

మొదటే ఈ ఫలానా వస్తువుకు ఇంతరేటని నిర్ణయించక సంవత్సరం పొడవునా ఊర్నోని తెలిసోతెలియకో ఆ వస్తువులను వాడుకున్నా, వాడుకోకపోయినా వాడుకొని ఉంటాడని గుడి సెకింత అని పల్లెపల్లెకీ తిరిగి సుంకంగా డబ్బులు వసూలుచేసుకుంటారు.

పల్లెల్లో ఉండేటివన్నీ గడ్డిగుడిసెలే. ఇల్లు న్నాక గొడ్డు--గోజా, కొట్టం--గిట్టం ఉండనే ఉంటాయి. ఏటా గడ్డితో పనివడుతూనే ఉంటుంది. ఒకవేళ వాళ్ల అడవిలోని గడ్డితో నీకు పనిపడకపోయినా, నీ పట్టాభూమిలో గడ్డి తోనే ఇల్లు కప్పుకున్నా ఆ గుత్తేదార్లకు 'గడ్డిప న్ను' కట్టాల్సిందే.

అలాగే ఇప్పపువ్వు పల్లె ప్రజలకు ము ఖ్యంగా గోండులకు ఇప్పపువ్వు నిత్యావసర





వస్తువు. పండగలకు పబ్బాలకు వాళ్లు ఇప్పపువ్వు సారా కాచుకొని పిల్లా జెల్లా, ఆడ--మగా అందరూ తాగి ఆనందిస్తారు. కష్టపడి పని చేసేవాళ్లు సుమారుగా రోజూ ఇప్పసారా తాగుతారు. పంటలు పండకపోయినా, తిండిగింజలు అయిపోయినా ఇప్పపువ్వు అంబలితాగి బతికేస్తారు. సంవత్సరానికి సరిపడే ఇప్పపువ్వు వాళ్లు దురాడి నెలలో (మార్చి) ఏరి జాగ్రత్త చేసుకుంటారు. అందుకని అడవిలో పండే ఆ ఇప్పపువ్వుకు కూడా సుంకం కట్టాలి.

అలాగే సారపప్పు, బంకకు కూడా డబ్బు కట్టాలి. వచ్చిన ముగ్గురు కంట్రాక్టర్లు పోలీసు జమేదార్లకు ఇచ్చే మామూళ్లు ఇచ్చి వెంటతీసుకొని ఊరిమీద పడ్డారు.

ఇంటింటికి తిరిగి ఇంటికి ఇంత అని వసూలు చేసుకుంటున్నారు.

అలా వసూలు చేసుకుంటూ కొలాముల గుడిసెలున్న చోటికి వచ్చారు.

ముగ్గురూ శ్యామకొలాము ఇంటిముందు నిలబడ్డారు.

శ్యామకొలాము పన్నెండేళ్ళ బిడ్డ ఇంటి ముందు కూర్చొని వెదురుకర్రని బాడిసెతో సన్నటి బద్దలుగా చీలుస్తున్నదల్లా లేచి నిలబడి "మా బాబల్ ఆటుమ్" అంటూ చెప్పింది గోండిభాషలో. అంతలోనే శ్యామకొలామ్ భార్య బయటికొచ్చి "మా మొగోల్లు లేరు. పనిమీద అంగడి పోయిండ్లు" అంటూ చెప్పింది.

"మీ మొగోల్లతోని మాకేంపన్లేదు. యాడాదంత అడివి మీదపడితిన్న ఇప్పపువ్వు, అమ్ముకున్న సారపప్పు, గడ్డి పైసలకచ్చినమ్" అన్నాడు పుల్లయ్య.

"నాతాట పైసల్లేవు. ఇంట్ల మొగోల్లులేరు. ఎట్లమరి?"

"తియి, తియి... పైసల్లేని ఇల్లుంటదా! ముందు పైసలు రానియ్యి. మేము ఇంకా మస్తు ఇండ్లు తిరగాల వసూలికి" అన్నాడు రాజారాం.

"గిప్పుడు లేవు మరి... మర్లరండ్రి" అంది.

"మమ్మల్నేం బిచ్చగాల్లనుకున్నావా ఏంది? కనిపిస్తలేదు పోలీసు జమేదార్ ఎంట ఉన్నడు. పైసల సంగతి జూడుముందు"

"మీకింకెట్ల జెప్పాల. లేవు... పైసల్లేవు. ఉంటే ఇయ్యనా ఏంది? మీతోని లొల్లి ఎందుకు మాకు" అని అంటుండగానే-

"గట్ల నఖరాల్ జేస్తే గీ గుల్లలు, చేటలు, గంపలు ఎత్తుకుపోతం"

"గదేం అన్యాలం. ఇంట్ల మొగోల్లు లేనప్పుడొచ్చి గీ జబర్దస్తీ ఏంది" అంటూ ఇంకా కొలామీ భాషలో ఏమేమో అనసాగింది.

"అన్యాలం ఏంది... అన్యాలం. పుక్కెంపట్క పోతున్నమా ఏంది! మా మాల్‌కింద పట్టుకుంటం" అంటూ వెంట ఉన్న కొత్వాలుకు చెప్పాడు "అరే... గీ గంపగుల్లలు, చెటపర్రెలు పట్కోనిపోయి పీర్లసావిట్ల పెట్టించు" అనిహుకుంవేసారు.

కొత్వాలు వాళ్లు చెప్పినపని చేయసాగాడు.

శ్యామకొలము భార్య పిల్లలు నెత్తీనోరు కొట్టుకుంటూ ఏడ్వసాగారు.

ఈ జులుం చూస్తున్న చుట్టుపక్కల గుడిసెలవాళ్ళు ఆలస్యం చేయకుండా డబ్బులు తెచ్చి వాళ్ల ముఖాన కొడుతున్నారు.

చూస్తుండగానే సాయంత్రం కావచ్చింది.

ఊర్లో అందరి పశువులు దినమంతా అడవిలోనే మేస్తాయి. దానిక్కూడా పన్నుగట్టాల్సిందే జంగ్లాత్ వాళ్లకు.

అటు పశువులు ఒక్కొక్కటి అడవినుండి ఇంటిదారి పట్టాయి.

ఇటు సేరేదార్ మాదిగవాణ్ణి పిలిపించి డప్పు చాటింపు వేయించమన్నాడు. ఎవరికి ఎన్ని పశువులుంటే ఆ లెక్కన డబ్బులు తీసి పెట్టుకొని జంగ్లాత్‌వాళ్లు రాగానే ఇచ్చెయ్యాలని.

మాదిగోడు "గట్లనే హుజూర్" అంటూ డప్పు పట్టుకొని ఊరి మీదికురికాడు.

పశువులు చేలనుండి, అడవినుండి ఊళ్లోకొచ్చేసాయి.

అప్పుడే చౌకీదార్ ఇంటింటికి తిరిగి ఎవరి కొట్టంలో ఎన్ని పశువులున్నాయో లెక్కజూసుకొని డబ్బులు వసూలుచేస్తున్నాడు.

ఎడ్ల జతకు రెండు అణాలు. ఆవుకు, బర్రెకు ఒక అణా. మేకకు, గొర్రెలకు అర్ధాణా

చొప్పున వసూలుచేస్తున్నాడు.

సేరేదార్‌సాబ్ పట్వారి ఇంట్లో కూర్చొని వెంట తెచ్చుకున్న మందుసీసాలోంచి గ్లాసులోకి వంచి నీళ్లు కలుపుకొని తాగుతున్నాడు. మధ్యమధ్య కోడికూర ముక్కలు నంజుకుంటు న్నాడు.

పక్కనే పంతులు పట్వారి కూర్చొని ఊరి మీది వసూళ్ల, మామూళ్ల లెక్కలు సమజాయిస్తున్నాడు.

సేరేదార్ "ఊఁ" కొడుతూ మందుసీసా ఖాళీ చేస్తున్నాడు. పంతులు పట్వారి ఇంట్లో రాత్రికి వంటలవుతున్నాయి. కమ్మటి వాసన అక్కడిదాకా వస్తూ వుంది.

అంతలో శ్యామకొలామ్ పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"హుజూర్... నేను ఇంట్ల లేకుంటి. పొద్దుగాల మాపోరి దగ్గరికెల్లి గంపలు, చాటలు గుంజుకచ్చిండ్లట- గవి ఇప్పించుండ్లి దొర" అని వచ్చిన పని చెప్పాడు రావడంతోనే.

శ్యామకొలామ్ అలా సరాసరి సేరేదార్ దగ్గరికి రావటం అటు పటేలుకు, ఇటు సేరేదార్‌కు ఏమాత్రం నచ్చలేదు. వెంటనే కళ్లు పెద్దవిజేస్తూ- "అబే సువ్వర్‌కె బచ్చే! ఎవల్లతే మాట్లాడుతున్నవో ఎరికేనా? గింత లోపట్లకు ఎందుకొచ్చినవ్ బే! వాల్లు గుల్లలు గంపలే గుంజుకచ్చిండ్లు- సీపెండ్లాం, బిడ్డలను గుంజుకు రాలేదు. నఖరాల్ జేస్తే ఆల్లను గూడా తెప్పిస్త... తెల్సిందా?"

తాగింది బాగా ఎక్కుతోంది. అందుకే అలా పిచ్చిపిచ్చిగా అరుస్తున్నాడు. అతడి అరుపులకు శ్యామ్‌కొలామ్ కొంచెం వెనుకకు తగ్గాడు.

అరవడంతో ఎక్కింది దిగిపోయినట్లుంది. మళ్లీ ఒక గ్లాసు పట్టించి "నువ్వేం పని జేస్తవ్‌బే" అని అడిగాడు.

"కొలామోన్ని హుజూర్... తడకలు అల్లుత"

"మరి తడకలల్లతందుకు బొంగు ఎక్కడిదిరా?"

శ్యామకొలామ్ మాట్లాడలేదు.

"అబ్బే హరామ్‌కే... నిన్నే అడిగేది. బొంగు ఎక్కడిదిరా నీకు? యాడికెల్లి తెస్తవ్?" అంటూ అరిచాడు.

"అడివికెల్లి తెస్తం"

"మరి దాని పైసలు కట్టినవ్‌రా! అబే మాట్లాడవ్... అడివి నీ తాతదా? దాన్ని ఉప్పుబోసి పెంచినావుర నీవు" అంటూ తూలుతున్నాడు.

శ్యామ్‌కొలామ్ ఏమీ మాట్లాడకుండా నేల చూపులు చూడసాగాడు.

ఒకదానికని వచ్చి ఇంకో దానిలో ఇరికిపోయాడు.

"ఈ పల్లెల మీ కొలాం ముండకొడుకులు ఎంతమంది ఉన్నర్రా?"

"పది గుడిసెలుంటయ్ హుజూర్"

అంతా కొలామోల్లెనా ఇంకా నాయకపోల్లు కూడ ఉన్నారా?" అంటూ పట్వారీని అడిగాడు సేరేదార్.

"కొలామోల్లయి పది గుడిసెలుంటయి. నాయకపోల్లయి కూడ ఒక పది పన్నెండు గుడిసెలుండె. అల్లు నిన్ననే ఊరు ఇడిసి ఎల్లిపోయిండ్లు" అని చెప్పాడు పంతులు పట్వారి.

"పోయి మీ మొత్తంమంది మీ కులపోల్లని పట్కరా పో. ఒక్కొక్కడు ఇరవై అయిదురూపాలు జుర్మానా కట్టాల. ఇట్లయితేనే మీ తిక్క కుదుర్తది. అడిగేదాక పైసలు కట్టర్రా. అడివంటే మీ బాప్‌కా జాగీరనుకున్నరా? కండ్లు నెత్తికెక్కుతున్నయా! ఒక్కొక్కన్ని సెట్టుగట్టి తోలు ఒలిపిస్తా- తెల్సిందిబే!" అంటూ నిలబడబోయి తూలి కిందపడ్డాడు- సేరేదార్.

ఇంకా ఉంటే ఇంకేం లెక్కలు తీస్తాడోనని "గట్లనే హుజూర్" అంటూ అక్కణ్ణించి కదిలాడు శ్యామ్‌కొలామ్.

అప్పటికే బాగా చీకటిపడింది.

★ ★ ★

అల్లిగూడెంలో వసూళ్ళు పూర్తికావడంతో జంగ్లాత్‌వాళ్ళు ఊరిబయటికి వచ్చారు. కొత్తగా ఎవరు భూమి సాగుచేసినా వాళ్ళు ముందు జంగ్లాత్ అమీనుకు, సేరేదార్‌కు, చౌకీదార్‌కు ఇంత అని మామూళ్ళు ఇచ్చుకోవాలి. అది పట్టాభూమి అయినా, తాసీల్‌భూమి




అయినా, జంగ్లాత్‌భూమి అయినా చెట్టుమీద చెయ్యేస్తే డబ్బులు కట్టాల్సిందే. లేకపోతే ఊరుకోరు.

సేరేదారు పట్టాభూములు దాటి ఎవరైనా జంగ్లాత్ హద్దుల్లోకి చొరబడ్డారా అని చూస్తున్నాడు. కళ్లతోనే కొలుస్తున్నాడు. అనుమానం వచ్చినచోట పట్వారితో కొలిపిస్తున్నాడు.

ఊరికి తూర్పున సాగుబడిలేక సుమారుగా నాలుగువందల ఎకరాల భూమి పడోత్‌గా ఉన్నది. అది జంగ్లాత్ హద్దుకు తగులుకొని ఉంది. ఆ పడోత్‌భూమిని ఆనుకొని అడవి మొదలవుతుంది. దానిపైన సేరేదార్ కన్నుపడింది.

"ఈ భూమి ఎవరిది?" అడిగాడు సేరేదార్.

"హుజూర్... ఇది పాతగోండు పటేల్ మొకాషీ రాజా నాగోరావు పట్టాభూమి" చెప్పాడు పట్వారి పంతులు.

"మరిగింత భూమిగిట్ల బేకార్‌గ సాగులేక పడోత్‌గా ఉందేంది?"

"ఆల్లకు గింతనే చాతయింది. గంత జేసుకుంటున్నరు"

"ఇట్ల భూమి బేకారుగుంటే ఏమస్తది" అని "సాగుచేస్తున్నకాడికి సీలెక్కలో ఉంచు. మిగిలింది జంగ్లాత్ జమీల కలిపేస్త నేటీనుంచి" అని చౌకీదార్‌తో "అరే... ఇస్ జమీన్‌కె పట్టెదార్‌కో బులావ్" అంటూ హుకూం వేసాడు.

చౌకీదార్ మళ్ళీ వాడికిందివాడికి హుకూంవేసాడు. అక్కడున్నవాళ్ళలో ఒకడు గాలిలాగ పరిగెత్తాడు పాత మొకాషీ నాగోరావు ఇంటివేపు.

నాగోరావు మొకాషి గోండుకుల పెద్ద. ఒకప్పుడు రాజరికం చేసిన వంశంవాళ్లది. కాలంతోపాటు అన్నీ పోయాయి. ప్రస్తుతం మిగిలింది ఆ ఐదువందల ఎకరాల భూమే. పిల్లలు చిన్నవాళ్ళు. తనే కష్టపడతాడు స్వయంగా. ఇద్దరు ముగ్గురు నౌకర్లున్నారు. అంతా కలిపి తనకోసం అతడు సాగుచేసేది నలభైయాభై ఎకరాలకు మించదు. ఒక యాభయి ఎకరాల వరకు దగ్గరి బంధువులు సాగుచేసుకుంటున్నారు. మొత్తం వంద ఎకరాల వరకు సాగుబడిలో ఉంది. మిగిలింది పడోత్‌గా వదిలేసాడు.

నాగోరావు మొకాషి ఇంటి అరుగు మీద కూర్చొని ఎద్దుల మూతులకు చిక్కాలు అల్లుతున్నాడు.

అంతలోనే గాలిలాగ ఒకడొచ్చి "ఊరవతల సేరేదార్‌సాబ్ పిలుస్తున్నడు. జల్దీ రమ్మన్నడు" అని చెప్పగానే నాగోరావు కంగారుపడ్డాడు. కాలు చేయి ఆడ్డంలేదు. ఆదరాబాదరా అంగరకా వేసుకొని, పటకాచేతుల పట్టుకొని బయలుదేరాడు.

రాజరికంచేసిన వంశంలో పుట్టి, ఉన్నఊరికి కులపెద్ద అయివుండి, ఐదువందల ఎకరాల భూమికి స్వంతదారై వుండి కూడా ఒక ప్రభుత్వాధికారి పిలుస్తున్నాడని ఎవడో కబురు తెస్తే కుక్కలాగా ఉరికి వచ్చాడు నాగోరావు.

వచ్చి చేతులు కట్టుకొని, "నేను సర్కార్! నాగోరావును. తమరు పిలిపించిర్రంట ఉరికి అచ్చిన" అన్నాడు చేతులు నలుపుకొంటూ.

"అవ్... గీ భూమి గురించి చెప్తామని పిలిపించిన. ఈణ్నించి అటే నీభూమి. ఇటు ఉన్నదంత నేటినుంచి జంగ్లాత్ జమీన్‌ల కలుస్తది. ఇగ నీదికాదు" అంటూ నిలబడ్డచోట కాలితో గీతగీసి చూపించాడు-- హద్దుగా.

"హుజూర్... ఇది మా తాతలతండ్రుల పట్టాభూమి. ఏటా తాసీల్ బకాయి లేకుండ కడ్తనే ఉంటి. మల్ల గిట్లెట్ల జేస్తరు?"

"చేస్తనే ఉంటిమి. ఇంకా ఎట్ల జేస్తమని అగవడ్తివేమిరా? గింత భూమి ఉండంగ మరి పడోత్ వెడితివేంది మరి?"

"నాకు చేతనైనకాడికి లేపుకున్న హుజూర్. ఇప్పుడు పిల్లలు చిన్నగున్నరు. పెరిగి పెద్దయితే ఆల్లే జేసుకుంటరు కష్టపడి అని ఊకున్న" అని చెప్పాడు.

అతడు చెప్పేదేమీ చెవిన పెట్టడంలేదు సేరేదార్.

"అరే.. ఇదరావ్" అంటూ కొత్వాలును, చౌకీదార్‌ను పిలిచి "యహాం సే నిశానీ మారో" అంటూ గుర్తుల రాళ్ళు పాతించడానికి ఆజ్ఞపించాడు.

"వద్దు దొర... గిట్ల అన్యాలం జేయకుండ్రి.

మా పిల్లల నోట్ల మన్ను గొట్టకుండ్లి మా కడుపుల మన్ను కొడితె ఏమస్తది మీకు?'' అని అడిగాడు దీనంగా.

''కొట్టకుంటే ఏమన్న అస్తదా మాకు?'' అడిగాడు సేరేదార్

''ఎంతోగొంత ఇచ్చుకుంట. నా నోట్ల మన్ను గొట్టకుండ్లి'' అని బతిమాలుకున్నాడు.

''అయితే ఏదో పిల్లలు గల్లోడివి అంటున్నవ్ అని జెప్తున్న- పోయి నూరు రూపాలు పట్కరా పో'' అంటూ ఇంటికి తరిమాడు.

అటు నాగోరావు డబ్బులకొరకు ఊళ్ళోకి వెళ్లగానే నిషానీరాళ్లను ముందుకు జరిపి పాతించాడు.

ఇప్పుడు నాగోరావు మొకాషీకి మిగిలింది వంద ఎకరాలు సాగులో ఉన్న భూమి. వంద ఎకరాల వరకు పడోత్ భూమి. మిగిలిందంతా జంగ్లాత్ జమీన్‌ల కలిసిపోయింది.

జంగ్లాత్‌వాళ్ళకు పట్టాభూమి తీసుకునే హక్కులేదు. ఒకవేళ తీసుకున్నా దానికి రేటు కట్టి ఇవ్వాలి.

కాని, ఇక్కడ ఒక రూలులేదు.

ఒక ఖానూన్ లేదు.

వాళ్ళు ఆడింది ఆట

పాడింది పాట-

చేసిందే సత్యం.

కాదంటే ఎముకల్లో సున్నం ఉండదు.

ఒంటి మీద చర్మముండదు.

నాగోరావు మొకాషీ డబ్బులు తెచ్చి సేరేదార్ చేతుల్లోపెట్టి పాతిన నిషానీ రాళ్ళను చూసుకుని గుండెలు బాదుకున్నాడు. ''ఇదేం అన్యాలం. పైసలు తీస్కొని కూడా మల్ల రాల్లు పాత్తిరి'' అంటూ సేరేదార్ వెంటపడ్డాడు నాగోరావు.

''ఇంక ఎక్కువ మాట్లాడకు. చేసినట్టు సూడు. లేదంటావు... నీ దిక్కున్న కాడ సెప్పుకో- నీతోని అయింది జేసుకో'' అంటూ కసిరాడు సేరేదార్.

నాగోరావుకు చేసినట్లే పడోత్ పెట్టి జంగ్లాత్ హద్దుకు పక్కనే ఉన్న ఇంకా ఇద్దరు ముగ్గురికి ఇలాగే చేశాడు. జంగ్లాత్ హద్దు వాళ్ళ పట్టాభూములకు జరిపి రాళ్ళు పాతించాడు.

సేరేదార్‌కు వందా యాభయి ఇచ్చినవాళ్లకు కొంచెం వెనకకు జరిపి, ఇవ్వనివాళ్లకు అనుకున్నవరకు రాళ్ళు పాతించి జంగ్లాత్ జమీన్‌లో ఆరోజు ఆరేడువందల పట్టాభూమి కలుపుకున్నాడు. అలా భూమి పోయినవాళ్లందరూ గోండులే. ఉన్నవారు ఇచ్చారు, లేని వాళ్ళు నెత్తీ-నోరూ బాదుకున్నారు.

ఈ పని అంతా అయ్యేసరికి సాయంత్రం నాలుగయింది.

ఊళ్ళోకి తిరిగి వస్తూవుంటే చౌకీదార్ కన్ను దారిపక్కన పట్టాభూమిలో కొట్టి కుప్పగా వేసిన కట్టెల మండీపై పడింది.

జంగ్లాత్‌వాళ్లకు ఎక్కడ ఇంత కర్రముక్క కనిపించినా కన్ను మెరమెర అంటుంది.

''ఈ చేను ఎవల్లది?'' అడిగాడు పట్వారీని.

''ఇది మారివి దేవురావుది సర్కార్''

''మరి గీ చెట్లను ఇట్ల నరికి కుప్పవెట్టిండేంది? అదు 'చౌబీనా' కట్టిండా లేదా?''

''లేదు సర్కార్. ఈ నడమనే కొట్టిండు''

''ఏం పట్వారి.. ఇవన్నీ నువ్ జూసుకోవాల. ఏం జేస్తున్నవెందో! పిలిపియ్ గాడిదకొడుకుని. ఈ గోండుముండ కొడ్కులతోని, నాయకపోళ్లతోని, కొలామోల్లతోని మా ప్రాణం ముక్కల కొస్తున్నది. అన్ని ఉల్టా సీదా పనులు. ఇప్పుడానికి ఈ చెట్టు గొట్టె పనేముండె'' అని ఇంకేమేమో తురకంలో అరుచుకుంటూ ఊళ్లో కొచ్చాడు.

అప్పటికి పొద్దు పూర్తిగా కుంకింది.

అడవిలో నుండి వచ్చిన ఆవులు దూడల మూతులు, మెడలు నాకుతున్నాయి.

దినమంతా ఎక్కడెక్కడో తిరిగిన పిట్టలు చెట్ల గూళ్లకు చేరుకుని చిన్నగా కునుకుతీస్తున్నాయి. చిన్న అలికిడికే ఉలికిఉలికి పడుతున్నాయి.

సేరేదార్ భోజనం కానీయడంతో చౌకీదార్లు, పోలీసు జమేదార్లు తిండికి ఎగబడ్డారు.

భోజనం కానిచ్చిన సేరేదార్ తీరిగ్గా సిగరెట్ అంటించుకొని డబ్బు లెక్కచూస్తున్నాడు.

అంతలోకే--

వది పన్నెండుమంది కొలాములు మెల్లగావచ్చి సేరేదార్‌కు కొంతదూరంలో వినయంగా చేతులు కట్టుకొని నిలబడ్డారు.

సేరేదార్ వాళ్లను గమనించి కూడా గమనించనట్లే ఉన్నాడు.

చివరకు శ్యామకొలామే కల్పించుకొని మెల్లగా- "పైసలు దొరకలేదు హుజూర్. గన్ని పైసలు మాదగ్గర ఎక్కడుంటయి" అని అన్నాడు.

"పైసలెందుకుండయి. మస్తుగుంటయి. అంగడంగడి తిరిగి అమ్మిన పైసలేమైనయి. అడివిలబొంగు పుక్కేనికి అస్తదిరా? అడీల బొంగుసెట్టుమీద, టేకు సెట్టుమీద చెయ్యేస్తే, అన్నీ అక్కణ్నే పాతేసి కొత్తసెట్టు పెట్టాల. అప్పుడు తెలుస్తది జంగ్లాతోల్లంటే ఏందో?" అన్నాడు సిగరెట్ దుమ్ముదులుపుకుంటూ.

"ఈసారికి ఎట్లన్న మమ్మల్ని మాఫ్ జెయ్ హుజూర్. అచ్చేట్నించి పైసలు మీరు అడగక ముందే మీకు జమకడ్తం. ఈసారికి ఎట్లన్న..." అని అంటుండగానే-

"ఈసారికి మీ పెండ్లాలను ఒకగంటసేపటికి అమ్మి పైసల్దెచ్చి కట్టు" అని అనగానే వంతులు పట్వారి ఫక్కున నవ్వాడు.

"నీకెంతమంది పెండ్లాలురా?" అని అడిగాడు సేరేదార్.

"ఒక్కతే"

"పిల్లలెంతమందిరా?" అని అడిగాడు.

సేరేదార్ మనుసు కరుగుతున్నదనుకొన్నాడు.

"అరుగురు పిల్లలు"

"అంతా మొగోల్లేనా ఆడపోరగాండ్లున్నారా?"

"పెద్దది ఆడపిల్ల. పెండ్లీడుకున్నది. మిగిలినోల్లు మగపోరగాండ్లు" అని అన్నాడు పెళ్లీకొచ్చిన బిడ్డుందంటే ఖర్చని తెలిసి యింకా మనసు'కరిగి' కనికరిస్తాడని.

"యింకేంర మరి. రెండుగంటలు నీయికదంటే పైసలేపైసలు" అన్నాడు వకవకా నవ్వుతూ

అతడి నవ్వుకు వంతులు పట్వారి కూడా శృతి కలిపాడు.

శ్యామకొలాం నవ్వలేదు. సిగ్గుతో తలవంచుకున్నాడు. అతనివెంట వచ్చిన వాళ్లకు సిగ్గుతో చచ్చినట్టయింది.

"నీకు పైసలు తక్కువైతే నువ్వుకూడా నీపెండ్లాం, పిల్లల్ని ఇంకోల్ల పక్కల పండవెట్టి పైసలు తెచ్చుకుంటవా?" అని అడుగుదామనుకున్నాడు. కాని అడగలేదు. నాలుక ఎందుకో కదలదు. మాట ఎందుకో బయటపడదు.

ఆమాట అన్నది ఒక అధికారి. కాబట్టి ఊరుకున్నాడు. అదే ఊళ్లో ఇంకోడైతే ఇప్పటికి వాడి పీనుగ పాడెకోసం ఎదురుచూస్తుండును.

"ఎందిరా సై లేదు... సప్పుడులేదు" అంటూ రెట్టించాడు చౌకీదార్.

వర్షాకాలంలో చిన్నపిల్లలు గట్లవెంట, కుంటలవెంట తిరిగి వానపాములను పడతారు. దాన్ని మధ్యలోకి కోసి అది అటుయిటు పడి కొట్టుకుంటుంటె చప్పట్లు కొట్టి నవ్వుకుంటారు. రెండుగా తెగిన వానపాము యాతన వాళ్లకు తెలియదు.

ఇప్పుడు శ్యామకొలామ్ యాతనకూడా అలాగే ఉంది.

శ్యామకొలాంను చూసి సేరేదార్ ముసిముసిగా నవ్వుకుంటున్నాడు.

శ్యామకొలాము నిలబడ్డచోటనే కాలిబొటనవేలితో నేలను తవ్వుతున్నాడు. సేరేదార్ అనే మాటలు పడేకన్న నిలబడ్డచోటె నిలబడ్డట్టు అమాంతం భూమిలోకి వెళ్ళిపోతే సుఖమని.

కాని అలా జరగలేదు.

శ్యామ్‌కొలామ్ అలాగే నిలబడి ఉన్నాడు.

మనిషికాని వానితో మాట్లాడితే విషం కక్కుతాడని ఊరుకున్నాడు.

అంతలోనే 'చొబినా' కట్టకుండ చెట్లునరికిన మారిడి దేవురావు వచ్చి నిబడ్డాడు.

"పిలపిచ్చిండ్లంట" అంటూ ముందుకొచ్చాడు.

దేవురావు అంటే ఏవడుచు పోరడో అనుకున్నడు సేరేదార్. కాని చూడబోతే అరవైఏండ్ల ముసలివాడు. కాని నడిఈడు దాటిన మనిషిలాగా ఉన్నాడు.

"సెన్ల చెట్లు ఎందుకు కొట్టినవ్" అంటూ **అడిగాడు** సేరేదార్.

సేరేదార్ **అడిగింది** వినికూడా జవాబు **చెప్పకుండా** ముందు **తీరిగ్గా** కూర్చున్నాడు. **తర్వాత** మెల్లగా- "ఎందుగ్గొట్టినవ్ అంటే కొట్టిన. అది నా పట్టాభూమి. జంగ్లాత్ భూమి కాదు. నాపట్టా భూమిని సాపుజేసుకుని పంట **వండించుకొను** కష్టపడుతున్న. అండ్ల పెద్దపెద్ద సెట్లున్నాయి. అవి గింతున్న కాడికెల్లి చౌకీదార్‌కు చెప్తనే ఉన్న 'సెట్లు కొడ్తా సెట్లుకొడ్తా' అని. నప్పుడు జెయ్యలే. ముందుకొట్టు మల్ల **జూద్దాం అన్నడు**. ఒకటా రెండా ఇరువై ఐదు సెట్లు. **ఆఖర్న** ఏమైతే అదయిందని పడగొట్టుడు సురుజేశిన" అంటూ కథలాగా చెప్పుకొచ్చాడు.

"**అయి** పెద్దపెద్ద సెట్లు. అవిటిని కోట్టే **ఇజాజత్** నీకులేదు"

"మీరు **ఇజాజత్** ఈయరాయె. ఆ- సెట్లనీడతోని ఇటు నా పంటంతా తెల్లపడ వట్టె. **ఆ**సెట్లమీద పిట్లలు, చిలకలు ఉండి అయిన కాడికి పంటను నాశనం చేయవట్టె. మరి నేనెం జేయాల చెప్పుండ్లి, ఇనుకుంట" అని కాసేపాగి-

"పోనీ సెట్లు కొట్ట ఏంజెయ్యి. సెట్లు లేంది **జూసి గింతంత భూమి** నాపేర్న పట్టాజేసి యియ్యంర్రి. ఈ భూమి సెట్లు ఇడ్సిపెడ్త" **అని అన్నాడు**.

మాట్లాడుతున్న దేవురావు ఇంతకూడా తొణకడంలేదు. సేరేదార్‌కుడా బెదరడంలేదు. **అసలు అతడు** సేరేదార్ వైపే చూడ్డం లేదు.

దాంతో తిక్కరేగిన సేరేదార్- "నాకే హుకూం ఇస్తవుర. ఎవల్లతో మాట్లాడుతున్నవో ఎరికేనా?" అంటూ కళ్లెర్రజేసాడు.

"ఇండ్ల హుకూమేమున్నది. ఉన్నమాట అన్నగంతేగద" అని మళ్లీ- "ఉన్న తకలీఫ్ **అంతా** నిర్మల్ జంగ్లాత్ మోత్మీన్ దొరకు రాపిచ్చి పంపిన. అల్లు ఎట్ల జెప్తె అట్ల జెస్త. లేదు మీరే న్యాయం జేస్తనంటె అట్లనేగాని. ఎటువోయి పనిగావాల... బస్‌గంతె. మర్కోటి లేదు. పని అయింది మతలబ్. ఎవల్లయితే ఏంది..." అంటూ చెప్పుకొచ్చాడు.

జంగ్లాత్ మోత్మీన్ పేరు వినగానే చల్లబడ్డాడు సేరేదార్.

"చెట్టుకు 'చొబినా' రూపాయి అవుతది. కడ్తవా! లేదా?"

"గంత కట్టుడు నాకుగాదు. చెట్టుకు ఆఠానా కడ్త"

ఎంత దొరికితే అంతే అనుకున్న సేరేదార్. "పో... ముందు పైసలు పట్కరా" అంటూ తొందర చేశాడు.

"ఎంటవెట్టుకొనే అచ్చిన" అంటూ నడుముకు బిగించిన ధోవతి చెంగు కొసకు కట్టిన మూటవిప్పి పదిరూపాయలు లెక్కబెట్టి సేరేదార్‌చేతిలో పెట్టాడు.

"ఇదేందిరో చెట్టుకు ఆఠానా అన్నా యింక పైసలు గావాలగద"

"ఉన్నాయి అవి, యిచ్చిన. గంతే" అంటూ లేచాడు.

సేరేదార్ డబ్బులు మళ్లీ లెక్కపెట్టి ఉంచుకున్నాడు. రసీదుమాత్రం ఈయలేదు. జంగ్లాత్‌వాళ్లు ఎవనికి రసీదులియ్యరు.

ఇటు ఈ బేరం నడుస్తుండగానే కొలాములు మెల్లగా జారుకున్నారు.

కొలాములు పారిపోయారని తెలవగానే సేరేదార్ దెబ్బతిన్న పాములాగ తోకమీద లేచాడు.

మెల్లగా జారుకున్న కొలాములు ఇళ్లకుజేరి ముందు ముల్లేమూటా సర్దుకొన్నారు. ఒక్కొక్కుటుంబం సామాన్లు ఒకరి మోతబరువు కూడా కావు. గొడ్డు--గోజా లేవు. అందుకని ఆ రాత్రికి రాత్రే ఊరి పొలిమేరలు దాటిపోయారు.

**కాని** వాళ్ల అదృష్టం బాగాలేదు.

పారిపోతున్నవాళ్లకు జంగ్లాత్ జవాన్లు ఎదురయ్యారు. పక్క ఊళ్లో ఇంత సుక్కేసుకోను పోయి తిరిగి వస్తుంటే ఈ కొలాములు ఎదురయ్యారు.

ఒక్కమాటతో వాళ్లను తిరిగి అల్లిగూడెంకు తీసుకొచ్చి సేరేదార్‌కు అప్పజెప్పారు.

సేరేదార్‌సాబ్ అప్పుడే మంచికైపులోకి వస్తున్నాడు. పారిపోయినవాళ్లు దొరకడంతో మళ్లీ కసి రేగింది. "పారిపోతార్రా గాడిద కొడుకుల్లారా! హరామ్ ఖోర్! నువ్వర్‌కె బచ్చే" అంటూ




బూతులు తిడుతూ శ్యామకొలామ్‌ను ఇష్టంవచ్చినట్టు కొట్టసాగాడు. జుట్టు పట్టుకొని ఈడ్చితన్నాడు.

నిలబడితే అడుగులు తడబడుతున్నాయి. కాని వాణ్ణితంతున్నాడు పైశాచిక ఆనందంతో క్షణక్షణానికి రెచ్చిపోతూ.

శ్యామకొలామ్ సేరేదార్ దెబ్బలకు తట్టుకోలేకపోయాడు. సేరేదార్‌ను ఒక్కతోపుతోసాడు. వెల్లికింద పడ్డాడు సేరేదార్.

సేరేదార్ మీద చెయ్యెత్తి తోసెయ్యగానే కుక్కల్లాగ ఇద్దరు జవాన్లు వచ్చి శ్యామకొలామ్‌ను గట్టిగా పట్టుకున్నారు.

కిందపడటంతో సేరేదార్ నిషా సగం దిగిపోయింది. కోపం ముంచుకొచ్చింది. ఒక కొలాం ముండాకొడుకు తనపై తిరగబడటమా అనుకొని లేచివెళ్ళి కసికొద్ది శ్యామ కొలాం కడుపులో, ఛాతిలో బూటుకాళ్ళతో తన్నసాగాడు కిందపడేసి. శ్యామకొలాం లేవకుండా ఇద్దరు జవాన్లు చేతులను కాళ్ళతో తొక్కిపట్టి నిలబడ్డారు.

కొట్టి కొట్టి....

తన్ని తన్ని... విసిగిపోయాడు సేరేదార్.

నిషా దిగిపోయింది. కోపం చల్లబడింది.

అలసిపోయాడు పూర్తిగా.

"కట్టెయ్యుండ్రి లంజకొడుకుని. ఆ చెట్టుకు" అని ఆర్డర్‌వేసి కళ్ళలోకి పడుతున్న జులపాలను సవరించుకొని సిగరెట్ వెలిగించి గట్టిగా ఒక దమ్ములాగి కళ్ళు మూసుకున్నాడు.

పొగ బయటికి రాలేదు.

అలాగే మింగేశాడు.

శ్యామకొలామ్‌ను పీనుగులాగ ఈడ్చుకెళ్ళి చెట్టుకు కట్టేశారు. ముక్కుల్లోంచి, నోట్లోంచి రక్తం కారుతోంది. మోకాళ్ళు, మోచేతులు చిట్లి రక్తం చిమ్ముతోంది.

ఇదంతా జరుగుతుంటే నోట్లో కొంగుపెట్టుకొని ఏడుస్తున్నారు కొలాం స్త్రీలు.

పిల్లలు గజగజవణికిపోతున్నారు.

మిగతా మగవాళ్ళు ప్రాణాలు అరిచేతుల్లో పట్టుకొని నిలబడ్డారు. ఇక ఇప్పుడు తమలో ఎవరి వంతో తన్నులు తినడం అని భయంభయంగా నిలబడ్డారు. నిలబడ్డవాళ్ళ బలమైన కాళ్ళు సన్నగా వణుకుతున్నాయి. భయంతో బిగుసుకున్న పిడికిళ్ళు వడగళ్ళే అయ్యాయి.

"ఈ కొలామ్ ముండకొడుకు పెండ్లాం, పిల్లలేరి?" అంటూ అడిగాడు సేరేదార్- కాలిన సిగరెట్‌తో ఇంకో సిగరెట్ అంటించుకుంటూ.

మందగా నిలబడ్డ కొలాముల నుండి శ్యామకొలాం భార్యను, పిల్లలను బయటకులాగి సేరేదార్ ముందుకు తోసారు జవాన్లు.

ముందు సేరేదార్ శ్యామకొలాం పెళ్ళాన్ని చూసాడు. నల్లగా ఉంది. ఒంటినిండా పచ్చబొట్లు. ఆరుగురు పిల్లల్ని కని ఆ వయసుకే ముసలిదైపోయింది. చీకిపారేసిన మామిడికాయ టెంకలా, పదేళ్ళు తొక్కిపడేసిన చెప్పులా ఉందనుకున్నాడు.

అటునుండి చూపు పక్కకు తిప్పాడు.

తల్లి పక్కన బిడ్డకనిపించింది.

వయసు పద్నాలుగేళ్లు.

ఇంకా పెద్దమనిషికాలేదు.

పేరు మోతి.

మోతి నిజంగా ముత్యంలాగే ఉంది.

అడవిలో పూసిన దిరిసెన పూవులాగుంది.

తేనెలో ముంచిన ఇప్పపువ్వులా ఉంది.

మోతి భయంభయంగా సేరేదార్‌వైపు చూసింది.

కళ్ళను కప్పేస్తున్న జులపాలు. పాములనే కరిచి చంపే గద్దలాంటి ముక్కు. సారా కంపు, అన్నిటికీ మించి వాళ్ళ అయ్యని రక్తంతో తడిసిన బూటుకాళ్ళు.

భయంభయంగా చూస్తున్న మోతి చేయిని చటుక్కున అందుకున్నాడు సేరేదార్. గొరగొర ఈడ్చుకుంటూ పంతులు పట్వారి దివాన్‌ఖానాలోకి ఈడ్చుకుపోయాడు.

అది చూసి నలుగురు కొలాములు ధైర్యంతో ముందుకొచ్చారు. సేరేదార్ లోపలినుండి గడి తలుపు మూసుకున్నాడు.

కొలాములు బలంగా తలుపులు తడుతున్నారు.

ఉండీఉండీ తలుపులు ఒక్కసారిగా తెరు

చుకున్నాయి.

తెరుచుకున్న తలుపుల్లోంచి ముందు తుపాకి గొట్టం తర్వాత సేరేదార్ బయటకొచ్చారు.

"లమ్డి కొడుకుల్లారా... మా మీదికే లేస్తర్రా. బగావత్ చెస్తార్రా. పిట్టలను కాల్చినట్టు కాల్సి సంపుత. ఏమనుకుంటున్నరో.... తెల్సిందా!" అంటూ తుపాకి చౌకీదార్‌కు ఇచ్చి-

"ఎవ్వడు ముందుకచ్చినా కాల్సిపారేయ్ ముందు. మల్ల సంగతి మల్లజూసుకుందాం" అంటూ లోపలకు దూరి తలుపులేసుకున్నాడు.

మోతి కాసేపు అరిచింది. గోలచేసింది. దాన్ని కూడా గుర్రం హంటర్‌తో కొట్టి హింసించి నోరు మూయించాడు సేరేదార్. మళ్లీ చప్పుడే లేదు.

అర్థరాత్రి వరకు అలా కళ్ళు నిలేసి ఆ గదివైపు అలా చూస్తూనే ఉన్నారు. అప్పుడు మెల్లగా తలుపులు తెరుచుకున్నాయి.

మోతి తూలుతూ బయటకొచ్చింది.

వెంటనే చౌకీదార్ తన బాధ్యత జవానుకు అప్పజెప్పి తను మోతీని తీసుకొని పక్కగదిలోకి దూరాడు.

ఒకరి తరువాత ఒకరు-

ముందు సేరేదార్

తర్వాత చౌకీదార్

మళ్ళీ జవాను

మళ్ళీ ఇంకో జవాను.

ఒకరి తర్వాత ఒకరు తుపాకి తూటాను కొలాముల గుండెలకు గురిపెట్టి ఆ 'ముత్యం'తో ఆడుకున్నారు.

చూస్తుండగానే తెల్లవారిపోయింది- అటు

ఈ ముత్యం నల్లబడిపోయింది- ఇటు

చౌకీదార్ వెంట గదిలోకి వెళ్ళిన మోతి మళ్ళీ లేచి నిలబడలేదు.

ఇంకా సేరేదార్‌సాబ్ లేవలేదు.

అప్పటికే మోతీ ప్రాణం పోయింది.

చౌకీదార్ సలహాపై జవాన్లు మోతీని తీసుకెళ్ళి సేరేదార్ పక్కలో పడుకోబెట్టారు.

బాగా పొద్దెక్కాక

తాగిన నిషా దిగాక

సేరేదార్ లేచాడు.

లేచిన పదినిమిషాల్లో అందరు కలిసి దొంగలలాగా గుర్రాలెక్కి ఊరుదాటిపోయారు.

కొలాములు ఏడ్చుకుంటూ, గుండెలు బాదుకుంటూ నోరు విప్పి ఇష్టం వచ్చినట్లు తిడుతున్నారు.

శ్యామకొలాము మగతగా పడివున్నాడు.

శ్యామకొలాము భార్య నోరు పడిపోయినట్లు కుమిలికుమిలి ఏడుస్తోంది.

ఒకవైపు చచ్చిపడి ఉన్న బిడ్డ.

ఇంకోవైపు చావుపొలిమేరల్లో భర్త.

మోతి చనిపోయింది. ఊరికే చావలేదు, చంపబడింది. కాని పోలీసులు లేరు. పంచనామా లేదు.

ఏడ్చిఏడ్చి మొత్తుకొని ఆఖరున బిడ్డనెత్తుకొని ఊరి బయటకు పోయారు పాతెయ్యటానికి.

ఇంత జరిగాక మళ్ళీ ఈ కొలాములు ఇదే ఊళ్ళో ఉంటే మంచిదికాదని పంతులు పట్వారి కొలామోల్ల గుడిసెలు తగలబెట్టించాడు.

దివాన్‌ఖానాను, పక్క గదిని నీళ్ళతో కడిగి సాంబ్రాణి పొగవేయించాడు.




పిట్టబొంగారం గోండులు, నాయకపోళ్ళతో కలిసి పటేలు చూపించిన మొకాషి అత్రం రామారావు భూమిని సాగుకు యోగ్యంగా చేయడానికి తిప్పలుపడుతున్నారు.

ఎటుచూసినా పెద్ద అడవిలాగుంది ఆ




# DAP
# బ్రాహ్మీ-విటా

(గ్రాన్యూల్స్)

(ఆయుర్వేదీయ ఔషధి)

జ్ఞాపక శక్తిని పెంచుతుంది.
ఆరోగ్యాన్ని పెంపొందిస్తుంది.



జ్ఞాపకశక్తిని పెంచుతుంది
శారీరిక మరియు
బుద్ధి వికాసానికి






ఆరోగ్య వర్ధకము
మానసిక ఒత్తిడులను
దూరం చేస్తుంది,
సుఖనిద్రనిస్తుంది



వ్యాధి నిరోధక శక్తిని
పెంచుతుంది
శక్తి నిల్వలను పూరిస్తుంది




డక్కన్ ఆయుర్వేదాశ్రమ్ ఫార్మసీ. లి.

సైదాబాదు, హైద్రాబాదు-500659

భూమి. ఒక్కొక్క చెట్టుని ఇద్దరు కౌగలించుకున్నా చేతుల్లో ఇమడవు. అంతలావు మొదళ్ళున్నాయి. నల్లమద్ది, టేకు, ఇప్ప, బూరుగు, చింత, దిరిశెన చెట్లతో నిండిపోయివుంది. అన్నీ మహావృక్షాలే. పొదలకు కొదువే లేదు. దర్భతె, పర్కి, నల్లగొడిసె, జిట్టిరేగు పొదలతో కాలుతీసి కాలుపెట్టకుండా ఉంది.

"ముందుగాల్ల ఈ పొదలను లేపేద్దాం" అన్నాడు మేస్రం జంగు.

'అట్లనే జేద్దాం' అనుకుంటూ గొడ్డళ్ళు పట్టుకొని పొదలు నరకసాగారు.

"మరి గా చౌకీదార్ పట్కపోయిన పోరగాండ్ల ముచ్చట జెప్పకనేపోతివి" అని అడిగాడు కనకంబాలు.

"అండ్ల చెప్పేందుకేమున్నది. మొన్న మీరు జెప్పినట్టేపోయి కలిసిన. మేం పోదు జేసిన తాటనే గుంటలు తవ్వుకుంట కనిపించిండు. ఒకడు గుంటలు తవ్వుతుంటే, ఇంకోడు టేకుచెట్లు నాటుతుండు. మాధుగా డేమో వాగులకెల్లి నీల్లుదెచ్చి చెట్లకు పోస్తుండు. ఆ జాలిమ్‌సింగ్ గా పోరగాండ్లతోని వెట్టి చేయించుకోవట్టె.

వీళ్ళు ఇలా మాట్లాడుకుంటుంటే దూరంగా కాలిబాటలో రేగిన దుమ్ము మేఘంలాగా కనబడింది. అందరు పొదలు కొట్టడం ఆపి అటువైపే చూడసాగారు. వచ్చేది ఎవరుకావచ్చు అని వారి ఆలోచన.

తెప్పలాంటి దుమ్ములో నుండి గుర్రాలు లీలగా కనబడ్డాయి.

గుర్రాలమీద అంతమంది కలిసి వస్తున్నారంటే వాళ్ళు ఏ తాసీల్‌వాళ్ళో, రెవెన్యూవాళ్ళో అయివుంటారని వారు ఊహించారు.

తాసీలువాళ్ళు నిన్నగాక మొన్న వచ్చిపోయిరి. మళ్ళీ ఇంత తొందరగా రారు. వచ్చేది ఖచ్చితంగా జంగ్లాత్‌వాళ్ళు అని నిర్ధారించుకొని 'చెట్లు కొడుతుంటే చూసి పట్టుకుంటారని' ముందు గొడ్డళ్ళు దాచిపెట్టి తలాఒక పొదకింద దాక్కున్నారు.

నాలుగు గుర్రాలు దుమ్ములేపుకుంట వెళ్ళిపోయాయి.

వాళ్ళు ఎవరోకాదు- అల్లిగూడెంలో కొలాముల పిల్లను చెరిచి చంపి పారిపోయివచ్చిన జంగ్లాత్‌వాళ్ళే. సేరేదార్, చౌకీదార్, ఇద్దరు జవాన్లు. మొత్తం నలుగురు నాలుగు గుర్రాల పై.

గుర్రాలు పిట్టబొంగారం చేరినయి.

జంగ్లాత్‌వాళ్ళు వచ్చారని తెలియగానే పటేల్ బయటకొచ్చి మర్యాద చేసాడు.

సేరేదార్‌కు పిట్టబొంగారం రావాలని లేదు. కాని రాత్రి ఆ మోతి చావడంతో పిచ్చెక్కినట్లుంది. బుర్ర పనిచేయడంలేదు. రాత్రి తనకు మందెక్కువై పడుకున్నపుడు అదెప్పుడు ఎట్లా చచ్చిందో అర్థంకావడంలేదు. తెల్లవారి లేచి చూస్తే తను పీనుగ పక్కలో ఉన్నాడు. తెల్లార్లు తను ఒక పీనుగ పక్కలోపడి నిద్రపోయిన సంగతి తలుచుకుంటే ఎట్లనో ఉంది -సేరేదార్‌కు.

ఆ కొలాముల పిల్ల మోతిచావు, మందు ఎక్కువ కావడం ఇవన్నిటితో అతడి బుర్ర మొద్దుబారిపోయింది. తలను కమ్మరి కొలిమిలోనుండి తీసి సమ్మెటతో కొడుతున్నట్లుంది. కాసేపు పిట్టబొంగారంలో ఏకాంతంగా విశ్రాంతి తీసుకొని బయలుదేరితే మంచిదనిపించింది. అందుకే ఆగాడు.

సేరేదార్‌కు సుస్తీగా ఉందని, కాసేపు విశ్రాంతి తీసుకుంటాడని జవాన్లవల్ల విని విశ్రాంతికి ఏర్పాట్లుచేసాడు పటేలు.

సేరేదార్ కళ్ళుమూసుకొని పడుకున్నాడు.

కళ్ళుమూసినా తెరిచినా 'మోతి' రూపమే కనబడుతోంది.

ఎంత మరచిపోదామంటే అంత గుర్తొస్తోంది.

ఒక సీసా, గ్లాసు, చెంబులో నీళ్ళతో పటేలు గదిలోకి వెళ్ళి చప్పుడుకాకుండా వాటిని అమర్చాడు చిన్నచెక్కటేబుల్‌పైన.

ఆ మాత్రం అలికిడికే ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు సేరేదార్. పటేలు చేసిన ఏర్పాట్లకు విసుగుతో ముఖం చిట్లించాడు. ఇంకో అప్పుడైతే మెచ్చుకునేవాడే.

"ఇవన్నీ ఇప్పుడెందుకు. అది ఎక్కువయ్యే నెత్తి దిమ్మెక్కింది"

"ఎంగాదు హుజూర్! చెడావ్‌కు ఉతార్




ఉండాలి. లేకుంటేనే గట్లయితది. ఒక్క గిలా సెడు తీస్కోండ్లి. గడిసేపట్ల అంతా ఆరామ యితది'' అంటు గ్లాసు నింపి ఇచ్చాడు.

గ్లాసందుకొని ఒక్కొక్క గుటక వేస్తున్నాడు.

''అల్లిగూడెంల కొలామొల్లపోరి నచ్చిందని తెలిసింది. దాంతోని జర పరేషానయినట్లున్న రు. దాంట్ల గంత పరేషాన్ అయ్యేదేముంది. మీరుత్తగనే ఇదవుతున్నరు. గినుంటియి మీరె న్ని జూడలేదు?'' అంటూ ధైర్యంచెప్పాడు.

''గీ చేతుల్తోని పిట్టల తీరంగ ఎంత మందిని గాల్చలేదు. నచ్చినోడు నచ్చిండు. బతికినాడు బతికిండు. ఎందుకో ఆ పోరి నస్తె ఎట్లనో అనిపిస్తున్నది'' అంటూ గ్లాసు ఖాళీచే సాడు.

పటేలు ఇంకోగ్లాసు నింపబోయాడు. కళ్ళ తోనే సైగచేసి వద్దంటూ సిగరెట్ అంటించి గుండెలనిండా పొగపీల్చుకొని నగం మింగేసా డు. మిగిలిన సగం పొగ మాట్లాడుతుంటే ఉండీ ఉండీ చిన్నగా బయటకు రాసాగింది.

''పని అయినంక నాకు మత్తుగా నిద్రవడు తుండె. నాకు మంచిగనే గుర్తున్నది. అప్పటికి పోరి బతికేవుండె. తెల్లారి లేసి నూస్తె నచ్చిప డిఉన్నది''

''ఉత్తగనే ఎట్ల నస్తది''

''గదేగద సమజ్‌ల వత్తలేదు''

మోతీని తన తర్వాత చౌకీదార్, ఇద్దరు జవాన్లు వరుసగా అనుభవించారన్న సంగతి తెలియనే తెలియదు-సేరేదార్‌కు.

ఇటు సేరేదార్ విశ్రాంతికని పటేలు ఇంట్లో కి వెళ్ళగానే చౌకీదార్, జవాన్లు ఊరిపై వడ్డారు.

ఎవరెవరు కొత్త ఇళ్ళుకట్టారు, ఎవరు కొత్తగ కొట్టాలుకట్టారు, ఈయేడు ఈ ఊళ్ళో ఏ పంట ఎక్కువగా పండింది ఏది ఎంత వసూలు చేయాలి- అని ముందే లెక్కచూసుకుంటున్నా రు.

అలా ఊళ్ళోంచి పోతూ ఉంటే వాళ్ళకి షావుకారు రాఘవులు దుకాణం కనిపించి ఆగారు.

రెండేళ్ళలో రాఘవులు దుకాణం బాగా మారిపోయింది. దుకాణంలో ఇప్పుడు ఏ సామానులకు కొరత లేదు. బెల్లంముద్దలు, నూనెపీపాలు, చాయ్‌పత్తి, బీడీలు, ఉప్పు, కిరసనాయిలు, చిన్నపిల్లల చిరుతిండ్లు, బట్ట లు అన్ని వస్తువులు కొరతలేకుండా దొరుకు తాయి.

రెండుమూడు నెలలనుండి సారాసీసాలు, బ్రాంది, మసాలాలు కూడా ఉంచుతున్నాడు- ఏ సమయం ఎలా వస్తుందో అని. సర్కార్‌వాళ ్ళతో పనితీసుకోవాలంటే సీసాలు, కోడిమసాలా లు ఉంచడం తప్పనిసరి అని గుర్తించాడు రాఘవులు.

రాఘవులు వ్యాపారం దినమొక కళగా పెరుగుతోంది.

ఇప్పుడున్న దుకాణం పూర్తిగా రాఘవులుదే. ఇంద్రవెల్లి విఠల్‌సేఠ్‌ది ఏంపొత్తులేదు. దుకా ణంతోపాటు పైనలు వడ్డీలకు కూడా ఇవ్వడం మొదలుపెట్టాడు.

భార్యాపిల్లలను తెచ్చుకున్నాడు. భార్యకు ఏడువారాల సొమ్ములు చేయించాడు. తను పొద్దస్తమానం తమలపాకులు నమలడం నేర్చుకున్నాడు. తూగుటుయ్యాల్లో కూర్చొని ఊగాలని చాలా కోరిక. అది ఇంకా తీరలేదు.

జంగ్లాత్‌వాళ్ళను చూసి తనే ముందు ''రాం రాం చౌకీదార్‌సాబ్'' అంటూ పలక రించాడు.

''గిట్ల గుసోండి'' అంటూ చెక్కబెంచీ చూ పించాడు.

చౌకీదార్ బెంచీమీద కూర్చున్నాడు.

జవాన్లు ఉప్పుపోతలెక్క కూర్చున్నారు.

''ఈమధ్య ఇటు రాకడ్నేలేదు మీరు'' అంటూ ముచ్చట మొదలు పెట్టాడు.

''ఎందుకు రాకడ్లేదు. మస్తుగనే అస్తున్నం. కాని గింత పుర్సత్‌గ రాకడకాలేదు. ఇయాల మా సేరేదార్‌సాబ్ పానం కొంచం మంచిగలే దు. గడిసేపు ఈడ ఆగిపోదమంటే, ఆయిన్ని పటేల్‌సాబ్ ఇంట్ల దింపి మేంగిట్ల ఎల్లినమ్, ఊరి ముఖాన'' అన్నాడు చౌకీదార్.

ఒక ఇత్తడిగిన్నెలో సారవప్పు పోసి చౌకీదార్ ముందుపెట్టి తినమని ''ఎట్నించి రావట్టిండ్లు మీలు? ఏమయింది సేరేదార్‌సాబ్‌కు?'' అంటూ కనుబొమలు ముడేసుకుంటూ అడిగా

డు. సేరేదార్ సాబ్‌కు ప్రాణం బాగాలేదంటే, తన సొంత బామ్మరిదికే ప్రాణంబాగా లేనట్టు ముఖంపెట్టాడు.

"నిన్న అల్లిగూడెంకు వసూలుకి పోయి నమ్. రాత్రి గొంత "ఇ"దెక్కువైంది. తలకాయ నొస్తున్నదట" అని మూర చూపించాడు. మందుసీసాకు గుర్తుగా "ఇది" అన్నప్పుడు.

"గట్లనా" అని నవ్వేసాడు రాఘవులు.

"సిగిరెట్లున్నయా" అని అడిగాడు చౌకీదార్. అగ్గిపెట్టె చేతుల్లో పట్టుకొని.

"అరె... మర్చేపోయిన" అంటూ సిగరెట్ పెట్టెతీసి చౌకీదార్‌కు అందించాడు. ఒక సిగరెట్ ముట్టించుకొని, ఉప్పాపర్సునే పెట్టుకున్నాడు. ఇక అది తిరిగిరాదని తెలిసే ఇచ్చాడు రాఘవులు.

జవాన్లకు తలా ఒక బీడీ ఇచ్చి, ఇంట్లోకి చూసుకుంటూ "ఏమేయ్... చౌకీదార్‌సాబ్ అచ్చిండు మనింటికి. జర ఓ నాలుగు కోపుల చాయ్‌జెయ్యి. జర చాయ్‌పత్తి డబల్ ఎయ్యి" అంటూ భార్యను కేకేసాడు.

"ఉండని తియి. గిప్పుడు గవన్నెందుకు" అంటూ సారపప్పు బుక్కుకుంటూ మధ్యమధ్యలో సిగరెట్ పీలుస్తున్నాడు.

రాఘవులు దుకాణానికి ఎదురుగా ఇంటి ముందు పచ్చటి పందిరి కనిపించింది. ఈమధ్యనే ఆ ఇంట్లో ఏదో శుభకార్యమైనట్లుంది. అది చూసి చౌకీదారు "ఆ ఇల్లెవరిది" అంటూ అడిగాడు.

"అదా... అది పటాడీల బాజీరావ్ ఇల్లు"

"ఏమిట్టోల్లు ఆల్లు. గోండులా, నాయకపోళ్ళా, కొలాంలా?"

"కాదు పరదానోల్లు. పటాడీలు అంటే పరదాన్లని మతలబు"

"మల్ల ఈ పందిరి గిందిరేంది. ఏమయ్యిందాల్ల ఇంట్ల"

"మొన్ననే బాజీరావు బిడ్డ లగ్గమయింది. గీణ్నే పక్కపల్లె, చిన్నరురికిచ్చిండు పొల్లను" చెప్పాడు షావుకారు.

"ఆడు ఇంట్లనే ఉంటడా ఇప్పుడు" అడిగాడు చౌకీదార్.

"అవు... వున్నడు. గిప్పుడే సేన్లకెల్లి అచ్చి గడ్డిమోపు పారేసి బెల్లం గొనుక్కొనిపోయిండు"

"అరే... గా పందిరేసిన ఇంట్ల పర్దాని బాజీరావుగాన్ని పిల్సురురా పో. చౌకీదార్‌సాబ్ పిలుస్తుండు, అని చెప్పు" అని జవాన్ను తరిమాడు.

నిమిషాలమీద బాజీరావును వెంటపెట్టుకొని వచ్చాడు జవాను.

బాజీరావు రావడంతోనే "దండాలు దొర" అంటూ నమస్కరించాడు చేతులు జోడించి.

"ఏంపేర్రా నీది?" అన్నాడు చౌకీదార్.

"బాజీరావు దొరా"

"ఈ పందిరెందుకేస్తివిరా?"

"బిడ్డలగ్గం జేసిన దొర... గందుకని పందిరేసిన"

"మరి గాలగ్గం పందిరికని గింత పారక కొట్టివి, పబ్బు గొట్టివి. మరి పందిరి మామూలిచ్చినవ్‌రా?"

రాఘవులు విచిత్రంగా చూస్తున్నాడు సేరేదార్‌వైపు. "అదనా లగ్గం పందిరిగ్గూడ జంగ్లాతోల్లకు మామూలియ్యాల్నా" అని మనసులోనే అనుకున్నాడు.

"ఇయ్యలేద్దొర" అన్నాడు బాజీరావు తప్పు చేసినట్టు.

"మరి లగ్గం పందిరికి గిన్ని గుంజలు, వాసాలు, పబ్బు, పారక గొట్టినందుకు అన్నిటికి గలిపి 'గింత' మామూలుంటదని తెల్వదురా నీకు?"

"ఇప్పటికి ఎంతకాదన్న ఈ సేతుల్తోని పది లగ్గాలన్న జేసిన్నా. కాని ఎప్పుడు లగ్గం పందిరికి మామూలిచ్చుకోలేదు. లగ్గమంటే సుబకార్యం. దానికి కూడా మామూలేంది దొర. బుద్ది ఎరికైందగ్గర్నుంచి అర్కపట్టి గట్టినంగాని, గివన్ని మాకు తెలవవ్. అన్ని కొత్త కొత్త కానూన్లు, కొత్త కొత్త కాయిదాలు"

"అవురా... ఇది కొత్త కానూనే. లేకుంటే జంగలేమన్నా నీ తాత జీగీరా, నీ అవ్వ సొమ్మా ఇష్టమచ్చినట్టు నరికిపోగులవెట్ట. నీ జంగ్లీమంది గిట్ల జేయవట్టే కొత్త కొత్త కానూన్లు

 

# చతుర ప్రపంచం

## "పక్షి బాంబులు"



ఇజ్రాయిల్ విమానాలకు పక్షులతో పెద్ద బెడద తయారయ్యింది. ఏటా వందల సంఖ్యలో గుంపులుగా వలసపోయే గ్రద్దలు, కొంగలు, బాతులు, పెలికాన్లు వంటి పక్షులు ఇజ్రాయిల్‌దేశ గగనతలంగుండా పోతూ, ఆ దేశవిమానాల గుండెల్ని గుబగుబలాడిస్తున్నాయి.

వినటానికి పెద్ద సమస్యగా అనిపించదు కానీ నిజానికి గంటకు ఎనిమిదివందల కిలోమీటర్ల వేగంతో వెళుతున్న విమానాన్ని ఒక్క రెండుకిలోల బరువున్న కొంగ కొన్ని టన్నుల శక్తికి సమానమైన బలంతో ఢీకొట్టగలదు.

వలస పక్షుల సమస్య ఇజ్రాయిల్‌కు తీవ్రంగా కనిపించటానికి దాని భౌగోళిక, రాజకీయ కారణాలు కూడా కారణం. యూదుల ఏకైక దేశమైన ఈ దేశం ప్రపంచంలోని పెద్ద వైమానిక దళాల్లో చెప్పుకోదగ్గంత విమానసర్వీసుల్ని నిర్వహిస్తుంది. చిన్నదేశమైన ఇజ్రాయిల్ గగనతలం కూడా పరిమితమైనదే. దీని నైసర్గిక స్థానంవలన ఇది వలసపోయే అనేక పక్షులకు ముఖ్యమార్గమయింది. ముఖ్యంగా ఐరోపా, ఆసియా దేశాలనుంచి ఆఫ్రికాకు వలసపోయి, మళ్లీ అక్కడినుంచి తిరిగి వచ్చే పక్షులన్నీ ఇజ్రాయిల్ ఆకాశం గుండానే ప్రయాణిస్తాయి.

ఈ సమస్యను పరిష్కరించటానికి 1983లో పక్షి పరిశీలకుల (బర్డ్ వాచర్స్) సహాయాన్ని అర్థించింది ఇజ్రాయిల్ వాయుదళం. ఈ బర్డ్‌వాచర్స్‌లో అధికులు అరబ్బులు కావటం మరో విశేషం. ఈ పక్షి పరిశీలకులు అంతా కలిసి, కృషిచేసి, ఒక్కొజాతికి చెందిన పక్షులు ఒక నిర్ణీతకాలంలో, ఒక నిర్ణీతవాయుమార్గంలో మాత్రమే ప్రతిఏటా పయనిస్తున్నట్టు తెలుసుకుని, ఆయా కాలాలనూ, మార్గాలనూ వివరించారు. ఈ మార్గాలను ఇజ్రాయిలీలు "పక్షి రాక్షసమార్గాలు" అని కసిగా పేర్కొంటే, పక్షి పరిశీలకులు "పక్షి అభయమార్గాలు అని ముద్దుగా పిలుచుకున్నారు. మొత్తానికి ఆయా సమయాల్లో, నిర్ణీతమార్గాల్లో పక్షులు అడ్డురాకుండా విమానాలు తొమ్మిదివందల మీటర్ల ఎత్తుకు తక్కువకాకుండా ప్రయాణించాలని నిర్ణయించారు. సాధారణంగా పక్షులు అంతకుమించిన ఎత్తులో ప్రయాణించవు ముఖ్యంగా గుంపులుగా వలసపోతున్నప్పుడు. అంతటితో ఇజ్రాయిల్ విమానాలకు "పక్షి బాంబుల" బెడద తగ్గిపోయింది. ★

పుడుతున్నాయి. ఎవలిస్టమచ్చి ఆల్లు అడివిని నరికి నాశనం చేస్తే ఇక మేం ఉండెందుకురా! మా జంగ్లాత్ ఖానూనెందుకు? పో... పోయి మామూల్ పట్టుకురా'' అంటూ కసిరాడు.

బాజీరావు లేచి ఇంటిదిక్కు నడిచాడు.

పర్ధానులు జాతికి గోండులే. ఈ పర్ధాను లకు గోండులతో కంచం పొత్తువుంది. కాని మంచం పొత్తు మాత్రం లేదు. పర్ధానులు సాధారణంగా మరాఠీ మాట్లాడతారు. గోండి కూడా వచ్చు వీళ్ళకు. వీళ్ళలో ఎవరికీ స్వంత భూములు వుండవు. కాని వ్యవసాయం చేయడం బాగా తెలుసు. అందుకని ఎవరికిందో వ్యవసాయకూలీగానో, నౌకరుగానో పనిచేసి పొట్ట నింపుకుంటారు.

బాజీరావు మరీచిన్నవాడేంకాదు. యుక్తవయస్కులైన ఆరుగురు కొడుకులకు, ఒక కూతురికి తండ్రి. వయసు యాభయి పైనే వుంటుంది. అందరిలో ఆఖరిబిడ్డ పెళ్ళి మొన్ననే చేసాడు. కొడుకులందరూ కష్టపడేవాళ్ళే. అంతకష్టం చేసినా కడుపులు సరిగా నిండవు. ఉన్న నాలుగురాళ్ళు చిన్నదాని పెళ్ళికి ఖర్చయిపోయాయి. ఇంట్లో చిల్లిగవ్వ లేదు. ఇప్పుడు ఈ చౌకీదార్ ఎన్నడూ లేంది 'పందిరి' మామూలు' అడుగుతున్నాడు. ఏంచెయ్యాలో అర్ధంగావడంలేదు బాజీరావుకు. సమయానికి పిల్లలుకూడా ఇంట్లో లేరు. ఎవరి పనులకు వాళ్ళుపోయారు.

ఇంట్లో ఉన్న ముల్లెమూట, కుండలు, గుల్లలు అన్నీ వెతికాడు. ఎందులోకూడ 'చిల్లికొత్త' లేదు. ఆఖరుకు నువ్వులు, సారపప్పు ఏమైనా వున్నాయా అని చూసాడు. అన్నీ నిండుకున్నాయి. లగ్గానికి ఇంట్లో ఉన్నవి అన్నీ అమ్మి ఉప్పు-పప్పు, చీర-సారె తెచ్చారు. అందుకని అన్నీ ఖాళీగానే వున్నాయి.

ఒక్క కుండలో ఇన్ని తెల్లజొన్నలు కనిపించాయి. అంతకుమించి బాజీరావు ఇంట్లో ఆరోజు ఇంకేమీలేవు. ఉన్నవాటినే మూటగాగట్టి చౌకీదార్ దగ్గరకు బయలుదేరాడు. అడిగినపుడు కాదనకుండ, ఉట్టిచేతులతో పంపకుండ ఉన్నదేదో ఇచ్చిపంపాలని బాజీరావు తాపత్రయం.

బాజీరావు చౌకీదార్ దగ్గరకు వెళ్ళేసరికి అందరూ చాయ్‌లు తాగుతున్నారు వాళ్ళు.

చౌకీదార్ ముందర మూట వుంచి విప్పాడు.

జొన్నలు.

తెల్లని ముత్యాల్లాంటి జొన్నలు.

ఆ జొన్నలను కన్నతండ్రి బిడ్డను ప్రేమతో లాలించినట్లు నిమురుతూ ''గియ్యే ఉన్నయి దొర. ఇంతకుమించి ఇంకేంలేవు ఇంట్ల'' అని అన్నాడు.

''గియ్యెందుకు మాకు గీ జొన్నలెందుకురా! పోనీ ఇవి మా గుర్రాలకైతయి. మరి మాకిచ్చేందుకు రూపాలేయిరా'' అన్నాడు చౌకీదార్ నుదురు చిట్లించుకుంటు.

''లేవుదొర... నీబాంచను. నా ఇంట్ల ఒక్క సిల్లిగవ్వగాని ఉంటె నా కొడుకును సంపుకుతిన్నంత ఒట్టు'' అన్నాడు దీనంగా.

ఏడుపొక్కటే తక్కువ.

''గంత దిక్కులేనోడివి గింత పెద్దపంది రెందుకేసినవురా లమ్డీకొడకా?''

''కానూన్‌గిట్లున్నదని తెల్వక ఏసినం దొరా! లేకుంటే మా గరీబ్‌గాల్లకు గింత పైసకర్చయ్యే పోకడలెందుకు పోతం. ఎప్పటితీరుగనే అనుకొని గిట్ల జేస్తిమి''

''ఇగిప్పుడు కానూ న్దెలిసిందిగద! పైస ల్దీయ్''

''సెప్తిగద దొర లేవ్వని''

''లమ్డికొడకా... ఒకటే మాటనా లేవంటే లేవని''

ఏం మాట్లాడాలో తెలియడంలేదు బాజీరావుకు.

''పైసల్లేవు పైసల్లేవు అంటవేందిబే! పైసలేకనే ఇప్పుడు ఇంట్ల ఉన్నగా జొన్నలు తెస్తివి. గట్లనే పైసలేనపుడు గానడుముకున్న మొలతాడు తీసి ఇయ్యరాదురా'' అని ఉపాయం చెప్పాడు ఒక జంగ్లాత్ జవాను.

చౌకీదార్ కన్ను బాజీరావు నడుంమీద పడింది.

అక్కడ వెండి మొలతాడు మెరుస్తూ కనిపించింది.

గొలుసుతీసి ఇవ్వమన్నాడు చౌకీదార్.





ఈయనన్నాడు బాజీరావు.

"మనిషి సస్తేనే మొల్దారం తెంపుతరు దొర... మీకెరికె లేదా! ఈ మొల్తాడు నేనియ్యను" అన్నాడు.

"మరి మంచిగ అడగంగ ఇయ్యకపోతే నంపి పట్కపొమ్మంటవా ఎందిరా?" అంటూ గొలుసును గట్టిగా పట్టుకొని లాగాడు. కొలికి తెగి, గొలును ఊడి చౌకీదార్ చేతికొచ్చింది.

బాజీరావు కిందపడ్డాడు.

బుద్ధి తెలిసిననాటినుండి కట్టుకున్న వెండి మొలతాడు అది. ఆ మొలతాడు బాజీరావు తాతది. ఆ మొలతాడు బాజీరావు తాత చచ్చాక తండ్రి కట్టుకున్నాడు. తన తండ్రి చచ్చాక అది 'పెద్దకొడుకుగా' బాజీరావుకు వచ్చింది. బాజీరావు చస్తే అది అతడి 'పెద్దకొడుకుకు' దక్కుతుంది.

తరాలుగా వస్తున్న వెండి మొలతాడు నేడు బతికుండగానే తెగిపోయింది. తన తండ్రి 'పెద్దకొడుకు' హక్కుగా తనకా మొలతాడిచ్చాడు. వంశపారంపర్యంగా వస్తున్న ఆ వెండి మొలతాడును తను తన పెద్దకొడుక్కి ఈయనీయకుండ బతికుండగానే తన మొలనుండి లాక్కున్నందుకు బాజీరావుకు ఎంతో బాధగా ఉంది. కోపంగా ఉంది. కాని ఏమీ అనలేకపోయాడు.

బాజీరావుకు తెలుసు పేదవాడి కోపం పెదవికి చేటని.

"సచ్చే ముసలోడివి! నీకు ఈ ఎండి, బంగారాల మీద ఇంత ఖాయిషేందిరా? నువ్వు సావకముందే నీ మొలతాడు తెగింది. చూడు" అంటూ చౌకీదార్ మొలతాడును ఒకసారి గాలిలోకి విసిరి, మళ్ళీ చట్టుక్కున గద్దలాగ అందుకున్నాడు.

బాజీరావు ఆశగా వెండి మొలతాడుకేసే చూస్తున్నాడు.

"అరే ముసలోడ! మొల్తాడు తెగిందిగదా ఇక నేను సచ్చిన అనుకొని పోయి పాడె మీద బండేవు! ఇంటికి బోయి నల్లమొల్దారం గట్టుకో... గట్టిగుంటది." అనగానే జంగ్లాత్ జవాన్ పకపకా నవ్వాడు.

చౌకీదార్ పగలబడి నవ్వుతున్నాడు.

రాఘవులు కూడా నవ్వుతున్నాడు- కాని చిన్నగా.

కిందపడ్డ బాజీరావు మోచేయి ఒరుసుకుపోయింది. నెత్తురు పేరుకుపోయింది. ముసలి ప్రాణం గాయంతో విలవిలలాడిపోతోంది. పైనుండి కారం జల్లినట్లు నవ్వుల మీద నవ్వులు. లేసి జొన్నలు మూటగట్టబోయాడు.

"ఉండనియి... మా గుర్రాలకైతయి" అన్నాడు చౌకీదార్.

"నాతలపాగ వున్నద్దొరా.... అద్దీసుకుంట"

"అదేం పట్టుపోగుదా ఏంది. ఉండనియి. దాన్ని నువ్ తీస్కపోతె ఆ జొన్నలు మేం మా కీసల పోసుకొని పోతమా ఏంది? చల్... నడువ్ ముందు ఇక్కడికెల్లి" అంటూ కసిరాడు.

బరువుగా నడుచుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ ఇంటివైపు నడుస్తున్నాడు బాజీరావు.

వెనకనుండి వాళ్ళ నవ్వులు.

జంగాత్ నవ్వులు.

జంగ్లీ నవ్వులు...

వినిపిస్తూనే ఉన్నాయి.

కన్నబిడ్డ 'లగ్గం పందిరిమామూలు' కింద–

ప్రాణంలాంటి కన్నతండ్రి మొలతాడు పాయె.

మానంలాంటి తలపాగపాయె.

ముత్యాల్లాంటి జొన్నలు పాయె.

★ ★ ★

'చెడావ్'– మీద 'ఉతార్' పడటంతో సేర్దార్ తలదిమ్ము సగం వదిలిపోయింది. పటేలు మాటలు ఇంకా ధైర్యానిచ్చాయి.

మళ్ళీ వచ్చేవారం జంగ్లాత్ పట్టీల, అరకపట్టీల వసూలుకు వస్తామని, అందరు డబ్బులతో సిద్ధంగా ఉండాలని నుంకరోనితో డప్పు చాటింపు వేయించి, గుర్రాలు ఎక్కి వెళ్లిపోయారు.

గోండులు, నాయకపోళ్ళు కలిసి చేసుకుంటున్న అత్రం రామారావు భూమిలో కొడుతున్న చెట్లకు "చౌబినా", రాఘవులు, మరాఠాల్లు, తురుకోడు కలిసి కట్టుకుంటామన్నారు-

వటేల్‌సాబ్ మాట మీద.

చేస్తున్న భూమికి 'చౌబినా' లేకుండా జేసాడ నుకొని గోండులు, నాయకపోళ్ళు పటేలును దేవుడు అని అన్నారు.



# 6

**అ**ది కార్తీక మాసం.

గోండులకు ఇష్టమైన, గొప్ప పండగ 'ఘుసాడి పండగ' ఈ కార్తీక మాసంలోనే వస్తుంది. జంగు, దేవులకు పెళ్ళయ్యాక వచ్చిన మొదటి ఘుసాడి ఇది.

ఘుసాడి వేషం కట్టడంలో, ఘుసాడి నృత్యం చేయడంలో జంగు దిట్ట.

ఘుసాడికి ముందే, దసరా పండగ నుండి 'దండోరా' వేయడం మొదలవుతుంది. ఒక ఊరి గోండులు ఇంకొక ఊరికివెళ్ళి దండోరా వేస్తారు. ఒక ఊరి నుండి ఇంకొక ఊరికి వెళ్తున్నప్పుడు ముందుగా ఆ ఊరి 'మహాజన్' ఇంటికి వెళ్ళి దండోరా వేస్తారు. మహాజన్ భార్య వారికి ధాన్యం, డబ్బులు ఇస్తుంది. దండోరాకు 'తాషా' అనే చిన్న నగరా వాయించుతారు. ఘుసాడికి డప్పులుంటాయి.

జంగు ఘుసాడి వేషం కట్టడానికి వీలుగా గోచి బిగించి పైనుండి నల్లటి 'ఘగ్ర' వేసుకున్నాడు. దేవు మెత్తటి సుద్దను జంగు ఒంటికి పూతగా రాసాక, జంగు గొలుసులతో ఒంటిపైనున్న తడిసుద్దపై వంకీలు పెట్టుకుంటున్నాడు. మసితో కనుబొమలు దిద్దుకున్నాడు. వెదురుతో చేసిన టోపీని, నెమలి ఈకలతో అలంకరించి తలపై పెట్టుకున్నాడు. మెడలో 'పులిగోళ్ళు, లింగి మిర్యాలదండలు, రంగుపూసల పేర్లు వేసుకున్నాడు. జనపనారతో చేసిన గడ్డాలు, మీసాలు తగిలించుకున్నాడు. కళ్ళకింద నలుపు తెలుపు నిలువుగీతలు గీసి వాటి చుట్టూ నల్లటి వలయాలు గీసుకున్నాడు. పూర్తయిన వేషాన్ని ఒకటికి నాలుగుసార్లు తృప్తిగా చూసుకున్నాడు.

దేవు, జంగు తలపైన నెమలి ఈకలను ఒక్కపద్ధతిగా సవరించింది. రోకలిని జంగుచేతికిచ్చి, నాలుగడుగులు దూరం జరిగి కంటినిండా చూసుకుంది. ఘుసాడి వేషం అందరికి నప్పదు. కాని జంగ్గుకు చక్కగా కుదిరింది. చూస్తేనే దిష్టితగిలేలా ఉందనుకుంది దేవు మనసులో.

బావ జంగు అలంకరించుకొంటుంటే తదేకంగా అటే చూస్తున్నాడు సోము. తను బావంత పెద్దగయ్యాక ఇంతకన్న జోరుగా ఘుసాడి కట్టాల- అని మనసులోనే అనుకున్నాడు.

సోముకు నాలుగు రోజులక్రితం అడవికెళ్ళి వస్తుంటే కాలికి కొయ్యగుచ్చింది. గాయమయింది. రెండురోజుల్నుంచి ఒకటే జ్వరం. నరం మీద పుండేమో నడవలేకపోతున్నాడు. పుండు ఉండీ ఉండీ కలుక్కుమని సలుపుతోంది. పైనుండి ఈగలు దోమల బాధ. పుండుమీంచి చేయితీస్తే కరుస్తున్నాయి.

జంగు బావ ఘుసాడి జోరుగకడ్తడని విన్నాడు. చూద్దామని లేని ఓపిక తెచ్చుకొని, వచ్చి చూరుకింద కూర్చున్నాడు.

జంగు వేషం కట్టడం అయిపోవడంతో దేవులోనికెల్లి ముగ్గురికి ఇప్పసారా తెచ్చింది. సోముకు రుచించక వద్దని పక్కన పెట్టేసాడు. జంగు, దేవులు సారా తాగుతున్నారు- తీరిగ్గా కూర్చొని.

మిగతా ఘుసాడీలు రావడంతో వారికి కూడా ఒక్కోగ్లాసు ఇప్పసారా వంచింది దేవు. ఒకరి వేషాలు ఒకరు చూసుకొని తృప్తిపడ్డాక ఇక బయలు దేరుదాం అంటే బయలు దేరుదాం అనుకొని పక్క ఊరికి ఘుసాడి నృత్యం చేయటానికి బయదేరారు.

జంగు దిగాలుపడి కూర్చున్న సోము దగ్గరకు వచ్చి- "ఏం ఫికర్ జేయకు, రేపటికి తక్కువైతది. బుక్కెడంత తిని పండు. కడుపుల ఏ ఆధరమానం లేకుంటే పానం మరీ

పెన్వోతది'' అని అంటూ తలనిమిరి ''పో... లోపలికి బోయి పండు. అచ్చేటికి సల్లగుంటే నీతోనిగూడ ఘుసాడి కట్టిస్త'' అని, దేవుతో ''ఆనితోని రెండుబుక్కలు బువ్వ తినిపిచ్చ్ ఎట్లన్నజేసి. నేను రేపు మాపిట్యాల్లదాంక అస్త'' అంటూ అందరితో కలిసి ముందుకు కదిలాడు.

అందరి వేషాలు ఒక్కతీరే ఉన్నాయి. అందరి తలలపై నెమలి ఈకల టోపీలు, చేతిలో రోకళ్ళు.

ఘుసాడి పండగ సందడి జోరుగా ఉంది.

ఇంటింటికి ఇప్పపూవు సారా బట్టీలు కాస్తున్నారు.

కొందరు ఘుసాడీలు ఐదు-పదికలిసి ఒక జట్టుకట్టి ఇంకో ఊరికి ఆహ్వానంపై పోతున్నారు. కొందరు ఆహ్వానంపై ఈ ఊరొచ్చి ఘుసాడి వేస్తున్నారు.

ఆడ-మగ, పిల్లా-పాప, ముసలి-ముతక అందరికీ ఘుసాడి పండగంటే ఇష్టం. వారం పదిరోజులు సాగే ఈ పండగలో వారు తింటారు, తాగుతారు, ఆడతారు-పాడతారు - అందుకే ఈ పండగంటే అందరికీ ఇష్టం.

ఇటు ఊరివాళ్ళు ఘుసాడి పండగ ఆనందంతో ఆటపాటల్లో మునిగి తేలుతుంటే, అటు ఆబ్కారీ జవానులు ఊరి చివర ఈతచెట్ల లెక్కజూసుకుంటున్నారు. ఈ పండగకు వీళ్ళుతాగి తందానాలాడతారని, ఇప్పపూవు బట్టీలు పెడతారని ఆబ్కారీ వాళ్ళకు తెలుసు. దొరికితే ఇప్పసారా బట్టీలు పట్టుకుందామని బయలుదేరారు. పనిలో పనిగా ఊరూరు తిరిగి ఈత చెట్ల లెక్కచూసుకుంటున్నారు. ఒక్కో ఊరికి ఎన్ని ఈత చెట్లున్నాయో లెక్కరాసుకుంటున్నారు. ఈయేడు కల్లుగీత గీసేటియ్యెన్ని కల్లురాని చెట్లెని, కొత్త చెట్లెన్ని ఉన్నాయో చూసుకొని రాసుకుంటున్నారు.

ఈ లెక్కతో ఒక్కోఊరి శివారంలో ఎంత కల్లువస్తుందో తేలుస్తారు. ఏడాదికి ఇంత అని లెక్కేసి వేలం వేస్తారు. ఇన్ని వ్యవహారాలు ఉన్నాయనే అమీన్సాబ్ స్వయంగా బయలుదేరాడు.

పొద్దుట్నించి వాగులు- వంకలు, లొద్దులు- లొంకలు తిరిగి తిరిగి అలిసిపోయారు ఆబ్కారీ సిబ్బంది. ఇక ఊళ్ళో కచేరి చావిడికి వెళ్లి కాసేపు విశ్రాంతి తీసుకొని తిండిసంగతి చూద్దామని ఊళ్లోకి బయలుదేరారు.

అమీన్సాబ్ ముందుంటే వెనక గుర్రం పట్టుకొని జవానులు అతణ్ణి- అనుసరిస్తున్నారు.

ఆబ్కారి అమీన్ ఊళ్ళోకి పోవడంచూసి, పసుల పోరగాళ్ళు రయ్మని ఊళ్ళోకి ఉరికి ఆబ్కారీ అమీన్ వస్తున్నాడని తెలియజేసారు. అందరూ బెంబేలెత్తిపోయారు. ఉన్నఫళంగా ఇప్పసారా బట్టీలు ఆర్పేసారు. ఉన్న కల్లు తాగినంత తాగి మిగిలింది ధైర్యమున్నవాళ్ళు దాచుకున్నారు. ధైర్యం చాలనివాళ్ళు నేలపాలు చేసారు.

ఆబ్కారీవాళ్ళ రాకతో ఘుసాడి పండగ ఆనందమంతా గంగలో కలిసిపోయింది. ఎవరి ఇళ్ళలో వాళ్ళు దూరి తలుపులేసుకున్నారు.

ఆబ్కారీ అమీన్ ఊళ్ళోకి రావడంతోటే ముక్కుకు పని కల్పించాడు. ఈ ఆబ్కారీ అమీన్సాబ్ కుక్కలాగా ముక్కుతో ఆబ్కారీ వాసనలుచూసి ఆబ్కారీ దొంగలను పట్టగలడు.

ఆబ్కారీ ముక్కుకు పని తగిలింది. ఏదో వాసన వస్తుంది. అదేమిటో చప్పున తట్టడంలేదు. చేతిని గాలిలోతిప్పి మంత్రగాడు వస్తువుల్ని పట్టినట్టు అమీన్సాబ్ ఒకసారి ముక్కుని వెడల్పుజేసి గాలిపీల్చి, తల విదిల్చి, గాలిలో ముక్కుని వదిలి వాసన వున్నవైపు నడుస్తున్నాడు.

వచ్చిన గాలిని గట్టిగా గుండెలనిండా పీల్చి, పరీక్షించి తేల్చేసాడు. ''గంజాయి సెట్ల ఆసనస్తున్నది గదరా!'' అంటూ జవాన్లనడిగాడు.

వాళ్ళుకూడా తలను నాలుగుదిక్కులా తిప్పి, అమీన్సాబ్ పద్ధతిలోనే వాసన చూసారు. గాలిని పీల్చారు, వదిలారు. కాని వాళ్ళకే వాసన రాలేదు.

వాళ్ళకు ఈతకల్లు వాసన తెలుసు. అంత కుమించి ఏం తెలియదు.

వాళ్ళేం మాట్లాడకపోవడంతో "నేను వాసన నూసే చెప్తబె అంత దూరంకెల్లి. అది ఈతకల్లు వాసననా, ఇప్పకల్లు వాసననా అని. గట్లనే చివిడి పండ్లతోని, ఈతపండ్లతోని, చింత పండుతోని, బెల్లంతోని, పాతర జొన్నలతోని-- దేంతోజేసిన ఇట్లనే జెప్త. ఇప్పుడీ ఆసన గంజాయి సెట్లది. గీణ్నే యాణ్నో వుంటయ్ సూడుండి" అంటూ ముందుకు కదిలాడు.

అమీన్‌సాబ్ మాటలకు "అవ్‌దొర... వాసన గట్లనే వుంది. ఈణ్నే ఎక్కణ్నో వుంటయి" అంటూ అమీన్‌సాబ్‌ని అనుసరించారు. నిజానికి వాళ్ళకే వాసన రావడంలేదు. అడిగినోడు తమ పైవాడు కాబట్టి అవంటే అవన్నారు.

ఇప్పుడు అమీన్‌సాబ్ ముక్కు అతడి శరీరంలో ఒక భాగంకాదు. ఇప్పుడు అమీన్‌సాబ్ ముక్కుతో నడుస్తుంటే మిగతా శరీరం, తల, కాళ్ళు, చేతులు వెంట వెళుతున్నాయి.

"ఈ గొంద ముండాకొడుకులు గీడేన్నో గింతట్లనే ఆ సెట్లు పెంచుతున్నరు. దొరకవట్టాల... ఎట్లన్న దొరకవట్టాల" అంటూ వాసన ఎక్కువైన దిక్కున అడుగులు వేయసాగాడు.

అమీన్‌సాబ్ అడుగులు టక్కున ఆగిపోయాయి.

అది దేవు, జంగుల గుడిసె.

అప్పుడు గుడిసె వెనక , మిరపచెట్ల మధ్య ఖాళీస్థలంలో కూర్చుని వుంది దేవు. నగం ఎండిన చేపలను తడికెపైవేసి ఆరబెడదాం అని అప్పుడే వచ్చింది దేవు.

గుడిసెలోపల సోము మగతగా నిదురపోతున్నాడు. దేవు బలవంతంపై నాలుగు ముద్దలు కరిచినట్టు చేసి, దేవు ఇచ్చిన చేదుకషాయం తాగాడు. ఇమడలేదు-- వాంతయింది. తిన్న నాలుగు మెతుకులు బయటపడ్డాయి. సొమ్మసిల్లి అలా పడిపోయాడు. కాలుమీద పుండు వాచిపోయి ఇంతయింది. పోట్లు పొడుస్తోంది. జ్వరం అందుకోవడంతో ఒళ్ళు సలసలకాగుతోంది.

గబగబ చేపలను ఎండకువేసి, తమ్ముని పక్కన కూర్చుందామని అనుకుంటుంటే బయట ఎవరో వచ్చిన అలికిడయింది.

జంగు ఇంటిపక్క గుడిసెముందు ఒక ముసల్ది కూర్చునివుంది. ముసల్దానిముందు ఒక మంచంలో ఒక పాతగుడ్డపైన అనుములు ఆరబోసి వున్నాయి. ముసల్దాని నెత్తి తెల్లగా నెర్సిపోయివుంది. గింతంత గుడ్డపీలిక నడుంకు చుట్టుకుంది. రవిక లేనేలేదు. వట్టిపోయిన ముసలి ఆవులాగుంది ఆ ముసల్దాని ఛాతి. పక్కనే ఒక పెద్దకఱ్ఱ వుంది.

ఆబ్కారీవాళ్ళ అడుగుల చప్పుడుకి ముసల్ది వులిక్కిపడి కఱ్ఱ అందుకొని మంచందిక్కు గాలిలో తిప్పింది. జాగ్రత్తగా చూస్తేనేగాని తెలియదు ఆ ముసల్ది గుడ్డిదని.

"ఎయ్... ముసల్దానా! గీ ఇల్లెవర్ది" అని అడిగాడు ఆబ్కారీ అమీన్‌సాబ్.

అలికిడి ఏ గొడ్డో- గోజో అనుకొని కఱ్ఱ లేపబోయి, మనిషి అలికిడి అని గుర్తించి కఱ్ఱ దించింది. ముసల్దానికి కళ్ళేకాదు, చెవులు కూడా అంతంత మాత్రమే.

మళ్ళీ అడిగాడు మరో జవాను. అప్పుడు పలికింది ముసల్ది.

"జంగు ఇల్లిది" మాటలు ఎటువైపునుండి వచ్చాయో తెలియక తలపైకెత్తి గాలిలోకి కళ్లాడిస్తూ అంది.

"ఒకసారి పిలువ్ వాన్ని" అంటూ హుకుం జారీచేసాడు వాసన ముక్కు ఆబ్కారీ అమీన్.

"లేడు. పక్కూల్లెకు ఘుసాడి ఆడతందుకు వోయిండు. పొద్దుగాల్లన గింత తిని వోయిండు. మాపటేల్లకు అస్తడేమో! మీలోల్లు" అని అడిగింది.

అంతలోకే గుడిసెలోనుండి దేవు బయటకొచ్చింది. చూడగానే గుర్తించింది, ఎవరో సర్కారు మందని.

దేవుని చూసి "జంగు-- అదే మీ ఇంటోడు ఎటుబోయిండు. పిలు ఒకసారి" అని అన్నాడు ఒక జవాను.

"ఊరికిబోయిండు. రేపు పొద్మీకస్తడు" అని చెప్పింది దేవు.

"మీ ఇంటెనక ఏమన్న సెట్లున్నాయా?" అని తనే అడిగాడు అమీన్‌సాబ్.

"ఉన్నయి. అంకాయసెట్లు, అనపకాయసెట్లు, మిరపసెట్లు, పొప్పడిసెట్లు..." అని అంటుండగానే మధ్యలోకే అమీన్‌సాబ్ కలుగ




జేసుకొని—

"ఆ సెట్లని ఒకసారి సూడాల. పెరట్లకు తోవ ఎక్కడికెల్లి?" అని అడిగాడు.

"ఇంట్లకెల్లె" అని దారి చూపించింది దేవు.

దబదబ బూట్లు చప్పుడు చేసుకుంటు ఇంట్లోంచి పెరట్లోకి వెళ్ళాడు అమీన్‌సాబ్. అతణ్ణి అనుసరించారు ఇద్దరు జవాన్లు.

వీళ్ళ ఇళ్ళలోకి చెప్పులతో రావడం రివాజుకాదని తెలిసిన జవాన్లు బాధపడ్డారు. మరచిపోయి అమీన్‌సాబ్‌వెంట పడిపోయారు కాని అలాపోవడం చాలా తప్పని తెలుసు.

దేవు కుంపట్లోంచి ఇన్ని నిప్పులుతెచ్చి వాళ్ళు నడిచిన దారినిండా పోసింది.

దేవు చెప్పినట్టు అన్ని చెట్లున్నాయి. అక్కడక్కడ బంతిపూల చెట్లున్నాయి. బంతిచెట్లు రకరకాల రంగుల్లో విరగబూసాయి. పెరటితో టంతా తిరుగుతున్నాడు అమీన్‌సాబ్.

బంతిచెట్లల్లో వాసనెక్కువ వస్తోంది. వంగి పరీక్షగా చూసాడు.

"ఆ... దొరికినయ్! నా ముక్కెప్పుడు ధోకాతినదు" అంటూ బంతిచెట్ల మధ్యలోంచి ఒక చెట్టు పీకాడు.

అదే గంజాయి చెట్టు.

అచ్చం బంతిచెట్టులాగుంది. కాని వాసన బాగా వస్తోంది.

గంజాయి చెట్టునుజూసి "వా! అమీన్‌సాబ్ దే ముక్కంటే ముక్కు, తెలివంటే తెలివి. మనకు వున్నయి మనిషికో ముక్కు ఎందుకు... చీమిడి తుడుసుకుంతందుకు" అన్నాడు ఒక జవాను.

"గీ తోట ఎవరు నాటిండ్లు" అనడిగాడు అమీన్‌సాబ్ గంజాయి చెట్లు లెక్కపెట్టుకుంటు. ఈతచెట్లు లెక్కపెట్టి, లెక్కపెట్టి ఇప్పుడు ఎక్కడ ఏ చెట్టు కనిపించినా లెక్కబెట్టడం అమీన్‌సాబ్‌కు అలవాటయిపోయింది.

దేవు భర్తపేరు చెప్పటానికి తటపటాయిస్తోంది. గోండు స్త్రీలు భర్త పేరును అంత సులభంగా ఉచ్చరించరు. వారికి తమ పెనిమిటి పేరు చెప్పాలంటే చాలా సిగ్గు. అందుకే ఏం మాట్లాడలేదు.

"ఏయ్... నిన్నే అడుగుతున్న గీ తోట ఎవరు పెట్టిండ్లు" అని మళ్లీ రెట్టించాడు అమీన్‌సాబ్ పైపైకి వస్తూ.

బెదిరిపోయింది దేవు.

"మా తమ్ముడు సోము, ఆని బావ పెట్టింర్రు" అంది భయంగా.

"నీ తమ్ముడేం జేస్తడు"

"గోజలు కాస్తడు. ఇయ్యాల పోలే. కాలికి కొయ్యగుచ్చి జరమస్తే ఇంట్లనే ఉన్నడు" అంది దేవు.

"పిలు ఆన్ని" అన్నాడు అమీన్‌సాబ్.

"జరమచ్చి సుండిమొండి పడున్నడు. కాలు నడస్తలేదు"

"దెబ్బకు జరం దించుత పిలు ఆన్ని ముందు. నఖరాల్ జెయ్యకు. రమ్మను ఆన్ని ముందు"

దేవు ఆదరాబాదరా ఇంట్లోకి పోయి, సోమును మెల్లగా నడిపించుకుంటు తీసుకొచ్చింది. జ్వరంతో సోము ఒళ్ళు కాలిపోతోంది.

సోమును అమీన్‌సాబ్ ఒకసారి ఎగాదిగా చూసాడు. వయసు మహావుంటే పదకొండు, పన్నెండేళ్ళుంటయి అనుకుని ఆశ్చర్యపోయాడు. గింతపోరడు గంజాయి చెట్లు పెంచడమా!

"ఏం పేర్రా నీది?"

"సోము" అని జవాబిచ్చాడు సోము నీరసంగా.

"గీ సెట్లు ఎక్కడ్నుంచి తెచ్చిండ్లురా?" అని కూపీలాగడం మొదలుపెట్టాడు.

"బంతి చెట్లల్ల అవే మొలిసినయి. బంతి సెట్లుగావని నేను పీకుతనంటే మా బావ అద్దంటే ఇడిసిపెట్టిన. అట్లనే పెరుగుతున్నాయి" అన్నాడు సోము.

"గీ నడుమ గీ అడిముండకొడుకుల్ని జంగ్లాతోల్లు ఇప్పపూవు లేరుడుమీద కానూన్ సక్త్ జేసిన కాడ్నుంచి, ఆబ్కారోల్లు కల్లుబట్టీ పెట్టుడుబంద్ అని జెప్పిన కాడ్నుంచి ఈల్లు ఈ గంజాయి చెట్లు పెంచుడు సురుజేసిండ్లు" అని చెప్పుకొస్తూ, మళ్ళీ చెప్తున్నాడు జవానులతో—



"ఎల్లన్న కష్టపడి ఒక ఇత్తు దొరికిచ్చుకొని దాన్ని నాటి ఇత్తనం జేసుడు, మల్ల ఆ ఇత్తనాలను దూరంగ అడీలనో లేక ఏ పడోత్ భూమిల్లో మందికి కానరాని జాగల జల్లుడు. సెట్లు మంచిగ పెరిగినంక ఎల్లి తెచ్చుకొనుడు. గిట్ల జరుగవట్టె'' అని అమీన్‌సాబ్ చూసినట్టు చెప్పసాగాడు.

''ఇసువంటి సెట్లు ఇంకా ఎక్కడున్న యిరా?'' అని అడిగాడు అమీన్‌సాబ్

''అడీల అక్కడక్కడ గనిపిస్తయి. మేం గోజలమేపుతుంటే''

''ఎక్కడున్నయో జూపిస్తవా నాకు''

''ఎడేడనో జూసిన. అన్ని జాగలు గుర్తు లేవు'' అన్నాడు సోము.

''నీకుగుర్తున్న జాగలే జూపియ్యి నడు'' అని పెరటితోటలోంచి అమీన్‌సాబ్ మల్లీ నట్టింట్లోంచి చల్లారిన నిప్పులను బూటుకాల్లతో తొక్కుకుంటు బయటకొచ్చాడు. జవాన్లు చెప్పులు చేతబట్టుకొని బయటకొచ్చి మళ్ళీ కాళ్ళకు వేసుకున్నారు. అమీన్‌సాబ్ ఇదేం గమనించే స్థితిలో లేడు.

''గంజాయి చెట్లు పీక్కొచ్చిండ్లా!'' అంటూ జవాన్లడిగాడు అమీన్‌సాబ్.

''అఁ... తెచ్చినమ్'' అంటూ ఎనిమిది గంజాయి మొక్కల కట్ట చూపించారు.

సోము వచ్చి దిగులుగా, బితుకుబితుకుమంటూ చూస్తూ నిలబడ్డాడు. కాలుకు కొయ్యి గుచ్చి పుండు ఇంతయి వాసింది. పైగా జ్వరం. ఇలాంటి పరిస్థితితో దూరం జంగల్లోకి వెళ్ళాలంటేనే సోముకు ఎలాగో ఉంది. చిన్న ప్రాణం తటపటాయిస్తోంది.

''మస్తుదూరం బోవాల జంగల్లకు'' అన్నాడు సోము. చాలా దూరం పోవల్సి వస్తుందంటే వద్దని అంటాడనే ఆశతో.

''ఎంత దూరం బే! నడుముందు నఖరాల్ జెయ్యకొ'' అని కసిరాడు అమీన్‌సాబ్.

''కోసెడు మీద నాలుగు చేన్లన్న పోబడ్తది'' అన్నాడు దిగులుగా సోము.

''పోదాం పా!'' సోముతో అని, అరే కచేరి ముందు కట్టేసిన గుర్రంకు ఎవలన్న గిన్నినీల్లు తాపిచ్చుకరండి'' అని జవాన్లను ఆదేశించాడు.

''గిప్పుడు గీ పగటిపూట గా ఆడీలకు గీ పోరన్ని తోలకపోకడమేంది. పోరడు నడువరాకనే ఇంట్ల పడుండే. జెరంగూడ అస్తున్నది. ఏమన్నంటే అల్ల బావ అన్తడు మాట్లాడు కొండ్లి. గీ పోరన్ని మా తమ్మున్ని ఇడిసిపెట్టుండ్లి'' అంటూ వేడుకుంది దేవు.

అమీన్‌సాబ్ ఏమీ మాట్లాడలేదు.

అప్పటికే చుట్టుపక్కల గుడిసెల వాళ్ళు చాలామంది గుమిగూడారు. కాని ఎవరూ ఏమీ మాట్లాడ లేదు.

అంత దూరం ఇక నడవాల్సివస్తుందనే దిగులుతో సోము ముఖం చిన్నబోయింది.

''పోరడు పొద్దుగాల్లనుంచి గింత బుక్కెడు కూడు సుక తినలేదు. అంతదూరం నడువ చాతకాదు ఆనికి... దయుంచి ఇడిసిపెట్టుండ్లి'' అని బతిమాలింది దేవు.

అమీన్‌సాబ్ ఇవేమీ వినడంలేదు.

అంతలోకే గుర్రానికి నీళ్ళు తాగించి పట్టుకొచ్చాడు జవాను.

గుర్రాన్ని చూసి, తనని కూడా గుర్రంపైనే ఎక్కించుకొని వెంటతీసుకుపోతాడని అనుకున్నాడు సోము.

కాని అలా జరగలేదు.

అమీన్‌సాబ్ ఒక్కడే గుర్రమెక్కి కూర్చుని– ''నడువ్ బే ముందు'' అంటూ కసిరాడు.

అడుగుతీసి అడుగేస్తే కాలు నొప్పి, మంటలు-పోట్లు.

సోము కళ్ళల్లో నీళ్లు చిమ్మాయి.

పుండున్న కాలు గజగజ వణుకుతోంది.

సోము నడవలేక కూలబడిపోయాడు.

దేవు కళ్ళల్లో కూడా నీళ్ళు తిరిగాయి. తమ్ముడు సోముని ప్రేమతో అక్కున చేర్చుకుంది.

అమీన్‌సాబ్ గుర్రం దిగి– ''ఒక పెత్తాడు తేరా'' అంటూ జవానును ఆజ్ఞాపించాడు.

జవాను ఎవరినో బెదిరించి ఒక కొట్టంలోంచి ఒక తాడు తెచ్చి అమీన్‌సాబ్ కిచ్చాడు.

తాడు ఒక కొస సోము నడుముకు కట్టి,




ఇంకో కొస చేతిలో పట్టుకొని లటుక్కున గుర్ర మెక్కి కూర్చున్నాడు అమీన్‌సాబ్.

అది చూసి దేవు గుండెల్ని ఎవరో పిండిన ట్లయింది.

"ఇదేం అన్యాలం. పోరనికి తాడుగట్టి కుక్క మేరం ఇగ్గుకుపోకడేంది. అని పానం మంచిగ లేదని ముందే జెప్తి. మల్లగిదేంది. ఆన్ని ఇడిసిపెట్టుండ్లి. మీ కాల్మొక్కుత. అల్ల బావచ్చి నంక పట్కపొండ్లి. గిప్పుడిడ్సవెట్టుండ్లి" అని దేవు గుర్రానికి అడ్డంగా నిలబడింది.

"నడు పక్కకు... ఎక్కువ మాట్లాడుడు నాక ల్యాల్లేదు. గంజాయి తోటలు ఇంట్ల పెంచుడు ఎంత తప్పొ గుర్తా. గీ బుద్ధి ముందుండాల గిప్పుడేడ్సిఏంఫాయిదా" అంటూ కదలటానికి సిద్ధంగా లగాంను పొదివి పట్టుకున్నాడు.

"అద్దుదొర తల్లిదండ్రి లేని పోరడు. తప్ప యిపోయింది. ఈసారికి ఇడిసిపెట్టు. కాదంటే ఆని జరం దిగినంక పట్కపో. ఇగో నీ కాల్లు మొక్కుతున్న, ఇగ ఆన్ని ఇడ్సిపెట్టు" అంటూ దేవు దీనంగ అమీన్‌సాబ్ కాళ్ళు పట్టుకుంది.

అయినా అమీన్‌సాబ్ మనుసు కరగలేదు. కదలకుండ కాలు పట్టుకున్న దేవుబాయిని అదే కాలుతో ఒక తన్ను తన్ని, గుర్రాన్ని ముందుకు ఉరికించాడు.

ముందర గుర్రం పరిగెడుతుంటే, వెనక సోము కుంటుకుంటూ పరిగెత్తుతున్నాడు. అంతా విచిత్రంగా చూస్తున్నారు తప్ప ఇందే అన్యాయం అని అడిగేవాళ్ళులేరు. ఇలా మని షిని అందులో చిన్నపిల్లవాణ్ణి అందులో జ్వర మొచ్చినవాణ్ణి కాలుకు పుండయి నడవలేని వాణ్ణి ఇలా గుర్రానికి కట్టి ఈడ్చుకుపోవడం వాళ్ళు ఎప్పుడు చూసి ఎరగరు.

అంతా నోరుమూసుకొని, కళ్ళప్పగించి చూ స్తున్నారు. సోము కుంటికాలుతో గుర్రంతో సమానంగా పరుగెత్తలేకపోతున్నాడు ఉండీ వుండీ గుర్రం సోమును లాక్కెళుతోంది. పడు తూ, లేస్తూ పరుగెత్తున్నాడు సోము. ఊరు దాటడంతో ఎటుపోవాలో తెలియక గుర్రం లగాం గుంజి పట్టాడు అమీన్‌సాబ్.

గుర్రం ఆగిపోయింది.

అప్పటికే సోము మోకాళ్ళు పగిలాయి.

కాలి పుండుకు కట్టిన కట్టు జారిపోయింది. పుండులోంచి రక్తం– రసి కారుతోంది.

సోము ముఖమంతా చెమటతో తడిసిపో యింది.

కిందకు వంగి మొలకు కట్టుకున్న గుడ్డపే లికతో ముఖం తుడుచుకున్నాడు. ఒంటిమీద అంగిలేదు. చెమటలు కారుతున్నాయి.

దెబ్బలు తగిలి తగిలి నిలబడితే కాళ్ళు వణుకుతున్నాయి.

"ఇక్కడికెల్లి ఇగిప్పుడెటుబోవాల్రా" అని అడిగాడు అమీన్‌సాబ్.

సోము కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ– "గ టు" అంటూ ఉత్తరం దిక్కు చేయి చూపించా డు.

"నడు మరి ముంగట" అంటూ తాడు పట్టి సోమును గుర్రం ముందుకు లాగాడు.

ముందర సోము ఉరుకుతున్నాడు.

వెనక గుర్రం నడుస్తోంది.

కాసేపట్ల గుర్రం ముందయింది. సోము వెనకబడ్డాడు. గుర్రం ఎంత మెల్లగా పరిగె త్తినా దాని వేగాన్ని కుంటికాలుతో అందుకోలేక పోతున్నాడు.

సోముకు అడుగుతీసి అడుగు వేయడమే కష్టమైపోతుంటే గుర్రంతోపాటు ఏం పరిగెడు తాడు.

దుఃఖంతో, బాధతో కన్నీళ్ళు కారుతు న్నాయి. కన్నీళ్ళు తుడుచుకోటానికి కూడా వీలులేదు. కళ్ళలోంచి నీళ్ళు జారి నోట్లో పడు తున్నాయి ఉప్పుగా.

కొంతదూరం అలా పోయాక అమీన్‌సాబ్‌కు గంజాయిచెట్ల వాసన రాసాగింది. అమీన్‌సాబ్ హుషారుగా గుర్రాన్ని అదిలించాడు.

దూరంనుండే పచ్చగా కనిపించాయి గంజా యిచెట్లు. అక్కడ వనమే ఉంది. ఆ చెట్లను చూసి అమీన్‌సాబ్ కళ్ళు మెరవసాగాయి. గు ర్రందిగి గంజాయితోటను చూసాడు. ఎవరో ఒక పద్ధతిప్రకారం వేసిన చెట్లని గుర్తించాడు. పోడు పద్ధతిలో భూమిని తవ్వి విత్తనాలు చల్లారు.

"ఇంకా ఇసుంటి తోటలు, సెట్లు ఎక్కడు

న్నయిరా?" అని అడిగాడు సోమును ఉద్దేశించి.

"తెల్వదు. గీణ్నే జూసిననేను" అన్నాడు సోము.

"అబే... ఇంకేడ్నన్న సూసినా అంటే అక్కడికి గ్గూడ గిట్లనే గుంజుకపోతడని సూడలేదంటున్నగదరా! చెప్పు. మంచి మాటలతోని చెప్పు. ఇంకా గిసుంటి సెట్లు ఈ శివారంలో ఎక్కడెక్కడున్నయ్!" అని గద్దించాడు.

"ఇంకెక్కడున్నయో నాకు తెల్వదు. నేను జూసింది గీ ఒక్కతోటనే. నా ఇమానం కొద్ది జెప్తున్న. నాకేం తెల్వదు" అంటూ ఏడ్వసాగాడు సోము.

పాపం ఆ పిల్లవాడికి ఈ ఒక్కచోటు తప్ప ఇంకోచోటు తెలియదు. కాని ఆబ్కారీ అమీన్ నమ్మడంలేదు.

"చెప్పుసాలే... ఇంకెక్కడ ఉన్నయ్ ఇసుంటి తోటలు" అంటూ రెట్టించాడు.

"తెల్వదు. నాకు గీఒక్క జాగన్లే గంజాయి సెట్లు కన్పించినయి. నామాట నమ్ముదొర! మా పెద్దదేవుడు 'పెర్కపెన్కు' మీద ఒట్టు నాకేం తెల్వదు" అని అంటుండగానే సోము జుట్టుపట్టి దవడమీద బలంగా కొట్టాడు అమీన్‌సాబ్.

సోము వెళ్లి కిందపడ్డాడు.

బూటుకాళ్లతో తన్నాడు. కాని ఎంత కొట్టినా, తిట్టినా సోమునుండి ఒకటే జవాబు "నాకు తెల్వదు అంటే నాకు తెల్వదు" అని. ఆ ఒక్కమాట తప్ప ఇంకో మాటలేదు ముచ్చటలేదు.

"నువ్విట్ల జెప్పవ్. నీమీద ఖానూన్ కార్వాయి జేసి, మూడు చెర్లనీళ్లు తాగిపిస్త బిడ్డ నీతోని. అప్పుడు తెలుస్తది ఈ అమీన్‌సాబ్ అంటే ఏందో!" అని సోమును తీసుకెళ్లి నడుముకు కట్టిన త్రాటితోనే ఒక చెట్టుకు కట్టేసి, గుర్రమెక్కి ఊళ్లోకిపోయాడు.

పోయినవాడు పోయినట్టేపోయి వస్తూ ఇద్దరు ఆ ఊరి మనుషులను వెంటబెట్టుకొని వచ్చాడు– సాక్షులుగా కేసు నమోదుచేయటానికి.

రానంటే తంతాడేమోనని వెంటపడి ఉరికి వచ్చారు ఇద్దరు. వచ్చిన ఆ ఇద్దరితో వేలిముద్రలు వేయించుకొని పంచనామ చేసి– "ఈ గంజాయి సెట్లు పీకి మోపులుగట్టి ఊల్లె కచేరి సావిట్లకురండి. నేను సెట్లన్ని లెక్కపెట్టుకున్న. ఒక్కటి తక్కువైన బొక్కలిరిసేస్త. నాసంగతి మీకు తెల్వదు. నేను శానా కర్కోటకున్ని తెల్సిందిబే!" అని సోమువైపు తిరిగి– "ఈల్లతోని గల్సి కచేరి సావిడికి రా. నేను యెంటలేనని ఇటు ఎటన్న పారిపోతివో నీబొక్కలిరగతంత... సమజయిందా!" అని సోముని బెదిరించి గుర్రమెక్కాడు.

గుర్రం దుమ్ములేపుకుంటూ వెళ్లిపోయింది.

వచ్చిన ఇద్దరు గంజాయిచెట్లుపీకి మోపులుకట్టి తలలకు ఎత్తుకున్నారు. సోమును మెల్లమెల్లగా నడిపించుకుంటూ ఊరివైపు కదిలారు.

సోము పరిస్థితి చూసి వచ్చిన ఇద్దరు జాలిపడ్డారు. ముక్కుపచ్చలారని, పాలపండ్లు పూర్తిగా రాలని పోరడు సోముని చూసి వచ్చిన వాళ్ల గుండెలు తరుక్కుపోయాయి.

కొయ్యగుచ్చిన కాలు భూమిమీద ఆనడంలేదు. భూమి మీద మోపితే కాలు గజగజ వణుకుతోంది. శరీరం వేడితో కొలిమిలా కాలుతోంది. వెంటనే ఒకడు సోమును ఎత్తుకున్నాడు. ఇంకొకడు ఇద్దరి గంజాయి మోపులను కలిపి కట్టి తలపై ఎత్తుకున్నాడు.

ఎలాగో అలా కష్టపడి సోమును ఒకరి తరువాత ఇంకొకరు మార్చుకుని ఎత్తుకొని ఊళ్లోకి చేరారు.

అప్పటికే ఆబ్కారీ అమీన్‌సాబ్ సావిట్లో కూర్చుని షరబత్ తాగుతున్నాడు. రావడంతోటే ఇంత తిని, ఒక చిన్న కునుకు తీసి, లేచి ఇప్పుడు తీరిగ్గా షరబత్ తాగుతూ కూర్చున్నాడు.

పోరన్ని సావిడి మెట్లమీద దించి, గంజాయి మోపును ఆబ్కారీ జవాన్లకు అప్పగించి, చేతులు కట్టుకొని నిలుచున్నారు.

"మీరింక మీ మీ ఇండ్లకు పొండి. మల్ల కార్వాయికి అక్కరపడ్డప్పుడు పిలిపిస్త. ఎక్కడికి రమ్మంటే అక్కడికి రావాల. నఖ్రాల్ జేస్తిరో మాడుండ్రి. నా సంగతి మీకు తెల్వదు... పోయిరండి" అని వాళ్లను పంపించేసాడు.




గంజాయి మోపులతో సోమును పట్టుకొచ్చారని తెలియగానే ఊరి జనం గుంపులు గుంపులుగా కచేరి సావిడికాడికి రాసాగారు.

"ఆ పోరన్ని ఆ కంబకు కట్టేయుండ్లి" అనగానే ఇద్దరు జవాన్లు సోమును చేతుల మీద లేపుకొచ్చి గుంజకు ఒరిగించి అలాగే తాడుతో కట్టేసారు. సోము ఉలకలేదు, పలకలేదు. సోముకు అసలు స్పృహలేదు.

సోము అక్క దేవు, తమ్ముడు ఏక్షణాన వస్తాడో, ఎలా వస్తాడో అని దిగులుబడ్డ మనసుతో ఇంటిదగ్గర కళ్లు ఇంతజేసుకొని ఎదురు చూస్తోంది.

అంతలోకే ఎవరో వచ్చి చెప్పారు– సోము వచ్చాడని, గంజాయి మొక్కలతోపాటు సోముని తెచ్చి కచేరిసావిట్లో వడేసారని, ఒంటిమీద తెలివిలేదని చెప్పడంతో దేవు గుండెలు పగిలినట్లు ఏడ్వసాగింది.

ఛాతి కొట్టుకుంటు ఏడుస్తూ, ఒక్క పరుగున కచేరి చావిడివైపు కదిలింది దేవు.

స్పృహతప్పి పడివున్న తమ్ముడి పరిస్థితి చూసి దేవుగుండె తరుక్కుపోయింది. ఒక్కపెట్టున ఏడ్వసాగింది దేవు.

దేవు ఏడుపునకు అమీన్‌సాబ్ చిరాగ్గా ఉండి–

"మొగడు జచ్చినట్టుగా ఏడుపేందే! నోరు మూసుకో. ఆడేం సావలేదు. కాదని అరిస్తివంటే నిన్ను కూడా ఈ గంజాయిసెట్లు పెంచిన కార్యాయిల పరీక్‌జేసి, ఏకీలుకాకీలు ఇరిసేస్త. నాసంగతి నీకు తెల్వదు. నేను లావ్‌సెడ్డోన్ని" అని కాసేపాగి "అసలు నీ మొగడేడి. ఇంటికి పోయి ఆన్ని తోలియ్" అని గదిరించాడు.

దేవు వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక, నోట్లో చీరకొంగు కుక్కుకొని మౌనంగా రోదించసాగింది.

సోము ఎంత పిలిచినా పలకడంలేదు. 'పోరడు చచ్చేనా ఏంది' అని మనసులోనే అనుకొని ముక్కుదగ్గర వేలుపెట్టి చూసింది దేవు. చేయి కమిలిపోతదా ఏంది అన్నట్టు వేడిగాలి తగిలింది. దేవు మనసుకు కొంత ఊరటకలిగింది– తమ్ముడు ప్రాణాలతోనే ఉన్నాడని.

దేవు రెండు చేతులతో, కళ్లతో తమ్ముణ్ణి నిమురుతోంది ప్రేమగా.

సోము మెడలు వడేసి గుంజకు ఆనుకొని పడి ఉన్నాడు. మోకాళ్లు ఒరుసుకుపోయి, నెత్తురు గడ్డకట్టింది. కొయ్యగుచ్చిన కాలు ఇంతయింది వాపుతో. గాయం చితికిపోయింది. నిన్న ఆడుతూ పాడుతూ ఉన్నోడు, నేడు ఉదయం సుస్తీజేసి పడి ఉన్నోడు పగటి వేళకల్లా పీనుగులాగా మారాడని మనసులోనే అనుకుంది దేవు.

"అరే తమ్మీ! సోము సోము" అంటూ ప్రేమగా పిలిచింది. కాని సోములో ఉలుకులేదు, పలుకులేదు.

అంతలోకే ఏదో గుర్తుకొచ్చినట్టు పరుగెత్తుకుంటూ పోయి చెంబుతో నీళ్లు తెచ్చి ముఖం మీద చిలకరించింది. పైట కొంగు తడిపి ముఖం, ఒళ్లు తుడిచింది.

తడి గుడ్డతో తుడుస్తూ మళ్లీ పిలిచింది "తమ్మీ సోము! జర కండ్లుదెరిచి ఇటు సూడురా! ఒకసారి పలుకు, మల్ల పడుకో. తమ్మీ... సోము-సోము" అంటూ కన్నీళ్లతో పలకరించింది.

సోము కొద్దిగా కదిలి, మెల్లగా కళ్లు విప్పి చూసాడు.

"తమ్మీ!" అంటూ దేవు సోమును గుండెలకేసి అదుముకుంది. సోము ప్రాణానికి ఎంతో హాయిగా ఉంది. పుండు పుండయిన ఒళ్లుతో అక్క కౌగిట్లో ఒదిగిపోయాడు సోము. తల్లి ముఖమెరుగని సోముకు తల్లి-అక్క-చెల్లి అన్నీ దేవుయే. అందుకే తల్లి గుండెల్లో బిడ్డలా దేవుకు హత్తుకుపోయాడు సోము.

తెలివివచ్చినప్పట్నించి సోము ఉండిఉండీ ఉలిక్కిపడుతున్నాడు భయంతో.

ఉలికిపడే తమ్ముణ్ణి గట్టిగా పొదివిపట్టుకొని కూర్చోబెట్టి నీళ్లు తాగించింది. సోముకు పోతున్న ప్రాణం తిరిగి వచ్చినట్లయింది. అలాగే ముడుచుకొని పడుకున్నాడు దేవు ఒడిలో పసిపిల్లాడిలా.

అంతలోకే అమీన్‌సాబ్ "ఏయ్... నీ మొగన్ని రేపు నన్ను కలువమను. రేపు ఊర్లెనే




ఉండమను... నేనస్త రేపు మల్లా. నేనచ్చినంక లేడు గీడు, పంచాయితీలకు వోయిండు అని లేనిపోని మాటలు జెప్పినవంటే ఇగ నీ తోలు వొలుస్త. నేను అసలే మంచోణ్ని కాదు. సూస్తున్న వుగదా!'' అని జవాన్లవైపు తిరిగి-

''అరే గీ గంజాయి సెట్లను, గీ పొరన్ని రేపు నేను అచ్చిందాంక హిఫాజత్‌గ కావలిగా యుండ్లి. ఏమన్న కిందా మీద అయిదంటే ఊరుకునేది లేదు. మన సంగతి ఎరికేగద... నేను మనిషినిగాను... ఆఁ'' అని బెదిరించి గుర్రమెక్కి వెళ్లిపోయాడు.

పొద్దుగుంకింది. గంజాయి చెట్లకు, సోమూకు ఒకడు కావలి కూర్చున్నాడు. ఇంకొక డు రాత్రి వంట తయారికి దిగాడు. ఊళ్లో పటేల్‌సాబ్ లేడు. ఉంటే అతనే ఏదో పెట్టేవా డు. పటేల్‌సాబ్ పనిమీద జనగామ వెళ్లాడు. అందుకని ఆబ్కారీ జవాన్లకు చేతులు కాల్చు కోక తప్పడం లేదు.

దేవుబాయి ఇంత జొన్న అంబలి బెల్లం ముక్క వేసి కాచి పట్టుకొచ్చింది. అప్పటివరకు సోము అలాగే మగతగా పడి ఉన్నాడు. దేవు బాయి తమ్ముడితో బలవంతంగా ఇంత అంబలి తాగించింది. అంబలి కడుపులోపడ టంతో కాస్త నెమ్మదయింది సోముకు. మాట్లాడ సాగాడు. జ్వరం ఇంకా అలాగే ఉంది. ఒళ్లు సలసల కాగుతోంది.

జ్వరానికని ఇన్ని నాగసరం వేళ్లు, ఆకులు దంచి తీసిన రసం సోము నుదుటికి, కాళ్ల కు-చేతులకు రాయసాగింది దేవు.

కొయ్యగుచ్చిన కాలుకు గాయం ఇంతయి పిట్టపిల్లలాగా నోరు తెరిచింది. ఇంత లావుగా వాసింది. గాయం మానటానికి ఎర్ర ఉసిరి ఆకులు, నేలేరు ఆకులు-వేళ్లు, వన్‌సాలాంగ్ వేళ్లు, కుప్పావర చెట్టు వేళ్లు --ఈ నాలుగు కలిపి దంచిన ముద్ద గాయం మీద పెట్టి, గుడ్డ పేగుతో గట్టిగా కట్టు కట్టింది.

కడుపులోకింత అంబలిపడి, ఒంటికి నాగ సరం రసం తగలగానే సోము కళ్లపైకి నిద్ర ముంచుకొచ్చింది. అలాగే అక్క తొడమీద తలవుంచి నిదరపోయాడు. దేవు తమ్ముడి ఒంటినిండా గుడ్డ కప్పి, అపేక్షగా ఒళ్లంతా తడుముతూ ఉండిపోయింది.

ఏ క్షణమైనా జంగు వస్తాడని దేవు కళ్లు ఆత్రంగా ఎదురుచూస్తున్నాయి. పొద్దున సోముని గుర్రానికి కట్టి లాక్కెళ్లినపుడే జంగు ను రమ్మని పక్క పల్లెకు కబురు పెట్టింది. ఈపాటికే రావాలి. రాని జంగు కోసం వస్తూ ఉన్న నిద్రను ఆపుకుంటోంది దేవు. దిన మంతా ఉద్వేగంతో, ఆతురతతో, కన్నీళ్లతో గడిపిన దేవు శరీరం అలసిపోయి నిదురలోకి జారిపోయింది.

సోము తెల్లవార్లూ మూసిన కన్ను తెరవ కుండ నిదురపోయాడు. జ్వరం కాస్త నెమ్మ దించింది. పుండు కూడా కాస్త వాపు తగ్గి తగ్గుముఖం పడుతోంది. పసర్లు వేళ్లు పనిచే సాయి. ఒకపూటకే గుణం చూపాయి.

దేవుకు జంగు రాకుండానే కలత నిదురలో తెల్లవారిపోయింది.

సోము ఇంకా లేవకుండానే, దేవు లేచి ఇంటి ముఖంపట్టింది. మళ్లీ గంటసేపట్లో కొంగు చాటున తినటానికి ఇంత ఏదో తీసుకొని వచ్చింది. అలాగే తిండితోపాటు జ్వరానికి రాత్రి తాగించిన నాగసరం రసం, గాయానికి కట్టడానికి ఇంత వేళ్లు, ఆకులు దంచిన ముద్దపట్టుకొని వచ్చింది. అప్పటికి పొద్దు ఇంతెక్కింది.

తమ్ముణ్ణి లేపి, నోరు కడిగి తెచ్చిన తిండి ఇంత తినిపించి, జ్వరానికి ఇంత రసం కడు పులోకి తాపింది. కొంత రసం నుదుటికి, చేతులకు, కాళ్లకు రాసింది. గాయానికి మందువేసి కట్టుకట్టింది. గాయానికి కట్టుకట్టి లేస్తుంటే వచ్చాడు జంగు. జంగుని చూడ టంతోనే దేవు దుఃఖం కట్టలు తెంచుకొంది. ఏడుస్తూ జరిగిందంతా చెప్పింది. సోము పరి స్థితి, దేవు ఏడుపు చూసి జంగు కళ్లలో నీళ్లు తిరిగాయి.

జంగు సోము ఒంటిని ఆప్యాయంగా నిమి రాడు. జంగు చేతి స్పర్శకు సోము ఉలిక్కిపడ్డా డు. కళ్లు తెరిచి బావను చూసిన సోముకు కొండంత అండ దొరికినట్టయి జంగును కావ లించుకొని గట్టిగా ఏడ్వసాగాడు.

అంతలోకే దూరంగా ఎర్రటి దుమ్ము లేపు కుంటూ ఆబ్కారీ అమీన్‌సాబ్, అతడి వెనుక

మరో గుర్రం మీద ఒక పోలీసు ఇన్‌స్పెక్టరు వస్తూ కనిపించారు. పోలీసు ఇన్‌స్పెక్టర్ వెంట మరో ఇద్దరు కానిస్టేబుళ్లు వెనక ఎడ్లబండిపై వస్తున్నారు.

గుర్రం దిగీదిగడంతోటే జంగును చూసాడు ఆబ్కారీ అమీను. 'ఎవడుబే నీవు' అన్నట్లు బొమ్మలెగరేసాడు.

"నేను ఈ పోరని బావని దొర. పేరు జంగు. అది నా పెండ్లాం. ఈ పోరన్తోని ఏదైన తప్పయితే మాఫ్ జేయుండ్లి. ఈ ఖానూన్‌లు ఖాయిదాలు మాకు తెల్వవు. తెల్వక ఏమన్న జేసుంటే జర మన్నించుండ్లి" అంటూ జంగు బతిమాలుకున్నాడు.

ఆబ్కారీ అమీన్‌సాబ్ ఉలుకుపలుకు లేకుండా గుడ్లురిమి చూస్తున్నాడు. ఆ గుడ్లు చూసి జంగుకు భయమయింది. "ఎట్లన్నజేసి ఆ పోరన్ని ఇడ్సవెట్టుండ్లి" అని అంటూ అమీన్‌సాబ్ కాళ్లపైపడ్డాడు జంగు.

"మొదట ఈ లమ్డీ కొడుకుని ఆ కంబకు కట్టుండ్లి" అంటూ హుకూం వేసాడు అమీన్.

అప్పుడే బండి దిగిన పోలీసులు, ఆబ్కారీ జవాన్లు నల్గురు కలిసి జంగును లాక్కెళ్లి స్తంభానికి కట్టేసారు.

"ఆ పోరన్ని కూడా కట్టేయుండ్లి" అని అమీన్‌సాబ్ అనడంతో, జంగును కట్టిన స్తంభానికే ఇంకో వైపు సోముని కట్టిపడేసారు. కట్టిపడేసిన సోము నిలబడలేకపోతున్నాడు. కాళ్లు గజగజ వణుకుతున్నాయి. అక్క దేవు ప్రేమతో గాయాలకు కట్టిన కట్లు జారిపోయాయి. గాయాలపై ఈగలు కూర్చుని కొరుకుతున్నాయి. సూదులతో పొడిచినట్లుంది. ఈగలు తోలుకోకుండా చేతులు కట్టిపడేయడంతో బాధతో విలవిలలాడిపోతున్నాడు సోము.

గుర్రం దిగి మంచంలో చతికిలబడ్డ పోలీసు ఇన్‌స్పెక్టర్ ఇదేం పట్టించుకోవడం లేదు. రాత్రి ఎక్కించిన మందు ఇంకా దిగలేదు. తల దిమ్ముగా ఉంది. మళ్లీ కొంత మందు పడితే తప్ప అతడికేం అర్థమయ్యే పరిస్థితిలో లేడు. అదే సంగతి పోలీసు కానిస్టేబుళ్లకు చెప్పాడు. పోలీసులు ఇన్‌స్పెక్టర్ ఎక్కి వచ్చిన గుర్రం జీను వెనుక చిన్న సంచిలో, రాత్రి తాగాక మిగిలిన సీసా అలాగే ఉంచారు. అదే తెచ్చి ఇచ్చారు. ఇన్‌స్పెక్టరుగారు మందు కార్యక్రమంలో పడ్డారు.

చూడబోతే ఈ సంగతి ఇంతటితో పోయేలా లేదని గ్రహించిన దేవుబాయి డబ్బులు పోసైనా తమ్ముణ్ణి, భర్తను విడిపించుకుందామని గుడిసెదిక్కు కదిలింది.

స్తంభానికి ఒకవైపు సోము, మరోవైపు జంగు కట్టేసి ఉన్నారు. ఒకరికొకరు కనిపించరు. కాని ఒకరి మాటలు ఇంకొకరికి వినిపిస్తాయి.

ఆబ్కారీ అమీన్ లేచి "చెప్పుబే లమ్డీకే! గంజాయితోటలు ఎక్కడెక్కడ పెంచుతున్నావో సెప్పు. ఒక తోట నీ ఈ బామ్మర్ది జూపిండు. నీ పెరట్ల వున్న తోటసుగ జూసిన. మిగిల్నాయి ఏడున్నయొ మంచి మాటలకు జెప్పు. లేకుంటే నీ కడుపు పేగుల్దీసి నీ మెడలేస్త. ఆ(... నా సంగతి నీకు తెల్వదు. నేను ఉత్త సువ్వర్ మనిషిని. తెల్సిందా!" అంటూ మొదలుపెట్టాడు.

"నాకు దెల్వదు సర్కార్! రెండుద్దుల్నుంచి నే నూర్లనే లేను"

"గీ రెండొద్దుల మాట గాదుబే సాలే! గంజాయితోటలు ఎక్కడెక్కడ పెంచుతున్నవో సెప్పు. గంజాయిచెట్లు బెంచుడు ఖానూనన్ తప్పని తెల్వదా? గొండుముండకొడుకువి నీగ్గింత తెల్వేందిరా"

"తప్పయింది దొర నీ బాంచను కాల్మొక్త. ఈసారి ఈ ఒక తప్పు కాయుండి. మమ్మల్ని ఇడ్సవెట్టుండ్లి. మీ పేరుజెప్పుకుని బతుకుతం" అన్నాడు జంగు దీనంగా.

"నువ్వు, నీ బామ్మర్ది గలిసి అడీల ఎన్ని గంజాయితోటలు పెంచుతున్నరో అవన్ని జూపియ్. మీ ఇద్దర్ని ఇడ్సిపెడ్త" అన్నాడు అమీన్‌సాబ్.

"ఇమానం కొద్ది నేను ఏ తోటలు పెంచుత లేను. నాకే సంగద్దెలవది. ఆ పెద్దమనుష్ మీద ఒట్టు. నాకే సంగద్దెలవది"

"నాకెర్క లేదర మీ సంగతి! నా ముందటి మీ టక్కులు. గంజాయి తోటలన్ని జూపించినంకనే మిమ్మల్ని ఇడిసిపెట్టుడు. అంతదనుక

# చతుర ప్రపంచం

## రక్తార్హతలు




సాంకేతికంగా అగ్రస్థాయిని చేరుకున్న జపాన్ అభివృద్ధికి కారణం పనితనంగానీ, ఆర్థికవిధానంగానీ, ఉద్యోగి - యజమాని సంబంధాలుకానీ కాదనీ, అందుకు ఏకైక కారణం రక్తమేననీ తోషితకానోమీ అనే మహాను భావుడు అంటున్నాడు.

'అనువైన రక్తపు గ్రూపులను జోడు కలపటానికి సలహాలు' అనే పుస్తకాన్ని రాసిన నోమీ, వ్యక్తిత్వాన్ని ఆయా వ్యక్తుల్లో ప్రవహించే రక్తపు గ్రూపులతో విశ్లేషిస్తూ ఈ పుస్తకాన్ని ప్రచురించాడు. ఈ విశ్లేషణ కోసం ఈయన మూడులక్షల పైచిలుకు కేసులను నమోదు చేశాడుట.

ఈ పరిశోధనల్లో 'ఓ' గ్రూపు రక్తంగల వ్యక్తులు పట్టుదల కలవాళ్లు, ముక్కుసూటిగా ఆలోచించేవాళ్లూ అవుతారని తేలిందట. 'ఏ గ్రూపు రక్తం కలవాళ్లు వివరాల కోసం పాకులాడేవాళ్లు. ప్రతి వివరాన్నీ క్షుణ్ణంగా తెలుసుకోగోరే వీళ్లు, ఇంజనీర్లుగా, సాంకేతిక విజ్ఞానులుగా బాగా రాణించగలరు. జపాన్ జనాభాలో నలభై శాతం 'ఏ' గ్రూపుకు చెందినవారేనట. ఇక 'బి' గ్రూపువాళ్లు సృజనాత్మక శక్తిని కలిగివుంటారనీ, 'ఏబి' గ్రూపు రక్తం కలవాళ్లు మానవుల్ని ప్రేమించేవాళ్లనీ నోమీ తేల్చి చెప్పాడు.

ఈ పరిశోధనా గ్రంథం అధికసంఖ్యలో అమ్ముడవటమే కాకుండా, ప్రతి విషయానికీ ముందు రక్తం గ్రూపు తెలుసుకోవాలనే అభిలాషను జపాన్ ప్రజల్లో వెర్రిగా కలిగిస్తూంది. ప్రేమికులు తమ తమ జతగాళ్ల రక్తం గ్రూపుని తెలుసుకుని, ఈ పుస్తకాన్ని సంప్రదించి, వాళ్లు తమకు ఈడూజోడూ అవుతారో లేదోనని ఆలోచిస్తూండగా కొన్ని సంస్థలు తమ ఉద్యోగ నియామకాల్లో, అభ్యర్థుల రక్తం గ్రూపునుబట్టి వారి అర్హతల్ని నిర్ధారిస్తున్నారు. ఈ పద్ధతి సరైనదికాదని కొందరు వాదిస్తున్నారు. మేధావులీపద్ధతి పట్ల రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. అయితే ప్రజల్లో ఈ పుస్తకం తీసుకొచ్చిన మార్పు, రక్తం గ్రూపుపట్ల యువతరానికి ఏర్పడిన ఆసక్తీ జపాన్‌లో సంచలనం కలిగిస్తున్నాయి. ★

ఇడిసే ముచ్చటనే లేదు'' అని పోలీస్ ఇన్స్పెక్టర్ వైపు తిరిగి ''సూస్తున్నరు గద! ఠానేదార్ సాబ్, గీ మొండి ముండకొడుకుల తరీఖ. మీరిక మీ తరీఖన కోషిష్ జేసి జూడుండ్లి'' అని అన్నాడు అమీన్‌సాబ్.

ఠానేదార్‌సాబ్ నవ్వుతూ లేచి నిలబడి, ''గీల్లు మాకొక లెక్కనా! ఈల్లకన్న మంచి మంచోల్లతోనే పలికిస్తం పలుకులు. మా దెబ్బదగిల్తె మూగోడికి కూడా మాటలొస్తయి- అట్లుంటది మా దెబ్బ'' అని కానిస్టేబుల్స్ వైపు తిరిగి ''ఖోల్‌దో సాలేకో'' అంటూ ఆజ్ఞాపించాడు.

పోలీసు జవాన్లు జంగు కట్లిప్పి రెక్కలు విరిచి పట్టుకున్నరు. ఠానేదార్‌సాబ్ చేతిలోవున్న రూలుకర్ర జంగు మోకాళ్లపై 'ఠప్'మని పడింది.

'ఫట్'మన్నాయి మోకాళ్ళు.

బావని కొట్టొద్దని ఏడుస్తున్నాడు సోము. కాని ఎవరూ వినిపించుకోవడం లేదు.

దెబ్బమీద దెబ్బ పడుతూనే ఉన్నాయి.

జంగును రెక్కలు విరిచి పట్టుకున్నారు జవాన్లు.

దెబ్బమీద దెబ్బ. చురుకులు పెడుతున్న అంబోతులా గుంజుకుంటున్నాడు జంగు.

''ఇగిప్పుడు జెప్పరా? ఎక్కడున్నయి మిగిల్న గంజాయి తోటలు?'' అని జంగు జుట్టుపట్టి లాగుతూ అడిగాడు ఠానేదార్‌సాబ్.

''సత్తెం జెప్తున్న దొర... నాకు దెల్వదు'' అని అంటుండగానే ఠానేదార్ చేతిలోని రూలుకర్ర జంగు మూతిపై పడింది.

పెదవులు చిట్లి రక్తం జలజలకారసాగింది. దెబ్బకు ఒక పన్ను కదిలిపోయింది. ఠానేదార్ సాబ్ రూలుకర్ర పడేసి లాఠీ అందుకున్నాడు.

''సెప్పుబే! ఇంకెక్కడున్నయి తోటలు'' అంటూ విరిచి పట్టుకున్న మోచేతులపై లాఠీతో కొట్టసాగాడు. దెబ్బదెబ్బకు గిలగిల కొట్టుకుంటున్నాడు జంగు. ఎన్ని కొట్టినా ఒకటే మాట- తెల్వదు అంటే తెల్వదు అని. మరో మాట రావడంలేదు జంగు నోటినుంచి.

మళ్ళీ లాఠీతో మోకాళ్ళ దెబ్బమీద దెబ్బ-పడాపడామని.

'చలావ్ సా లేకో' అని ఠానేదార్ అనడంతో జవానులు జంగును బలవంతంగా నడిపిస్తున్నారు. అడుగుతీసి అడుగేయాలంటే ప్రాణంపోతోంది. మోకాళ్ళు వంగడంలేదు. కాని బలవంతంగా నడిపిస్తున్నారు- ఈ కొస నుండి ఆ కొసకు. మోకాళ్లపై అన్ని- లాఠీదెబ్బలు తినడం ఒక బాధయితే మళ్ళీ నడవడం ఇంకోబాధ. ఆ బాధ అనుభవించినవాడికే తెలును. అది ఎంతటి బాధో జంగును చూస్తే తెలుస్తుంది.

ఎంత కొట్టినా అంతే- ఒకటే మాట.

కొట్టి కొట్టి అలిసిపోయాడు- ఠానేదార్‌సాబ్.

జంగు నోటితో ఒక పలుకు కొత్తది పలికించకపోయేసరికి అబ్కారీ అమీన్ ముసిముసిగా నవ్వసాగాడు.

ఆ నవ్వు చూసి ఠానేదార్‌కు రోషమొచ్చింది. వెంటనే జవాన్లవైపు తిరిగి ''బాంద్ దో సాలేకే, దోనో హాథ్'' అని హుకూం వేశాడు. వెంటనే జవాన్లు జంగు రెండు చేతులు కలిపి కట్టేశారు.

''లట్‌కాదో సాలేకో ఖూటీకో'' అని అనగానే, జవాను గోడకున్న ఒక చిలక్కొయ్యకు జంగును కట్టేసిన చేతులపై వేలాడదీసారు.

జంగు బరువంతా కట్టేసిన చేతులపై ఉంది.

జంగు కాళ్లకు ఆధారంలేదు, గాలిలో తేలివున్నాయి. వేలాడదీసిన జంగుని ఇప్పుడేం జేస్తాడో అని ఆశ్చర్యంగా చూస్తున్నాడు అబ్కారీ అమీన్.

సోముకు ఇవన్నీ ఏమీ కనిపించడంలేదు. బావను ఏంచేస్తున్నారో తెలియడంలేదు. వాడు ఒకటే ఏడుస్తున్నాడు, బావను ఇడిచిపెట్టమని.

''అబ్ దే ఖో సాలేకో మజా చకాతవ్'' అంటూ ఠానేదార్ లాఠీలతో జంగు అరికాళ్లపై, మోకాళ్లపై దెబ్బమీద దెబ్బకొట్టసాగాడు. జంగు గిజగిజ కొట్టుకుంటున్నాడు గోడకు.

అరికాళ్లపై దెబ్బపడ్డప్పుడల్లా జంగు మెదడులో నరాలు కదులుతున్నాయి. మోకాళ్లపై దెబ్బపడ్డప్పుడల్లా కణతలు అదురుతున్నాయి.




మోకాళ్లు పగిలాయి. రక్తం కారుతోంది.

చర్మం లేచి కీళ్లు కనిపిస్తున్నాయి.

"మీకాల్లు మొక్కుతగని కావాల్నంటే ఒకసారే పొడిచి సంపుండ్లి. గిట్లగోదకన్న అన్యాలంగ గొట్టకుండ్లి" అని బతిమాలుకున్నాడు. అయినా వాళ్లకు దయరావడంలేదు. జంగు మాట మారడం లేదు. "తెల్వదు"— "తెల్వదు" అనేదొకటే సమాధానం.

అబ్కారీ అమీన్ నవ్వసాగాడు.

"మేమంటే అబ్కారోల్లం. ఈమనుమలతోని మాట్లాడించుడు మాతరంకాదని మిమ్మల్ని పిలిపిస్తిమి. మీరు కూడా మా అంతట్లోల్లే అని తెల్సిపాయె" అని అబ్కారీ అమీన్ అనగానే ఠానేదార్‌సాబ్‌కు తలతీసేసినట్టయింది. ఏం చేయాలో తోచక ఒక సిగరెట్ వెలిగించాడు.

గోడకు జంగు సామ్మసిల్లి అలాగే గూటానికి వేలాడుతున్నాడు.

కొన్ని క్షణాలు అక్కడ నిశ్శబ్దం ఆవరించడంతో— ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ- "మా బావను ఏం జేసిండ్లు. ఇంక కొట్టకుండ్లి మాబావను మీ కాల్మొక్త. మీ బాంచనైత. మీ పెండదింట. మాబావను ఇడ్సివెట్టుండ్లి" అంటూ ఏడ్వసాగాడు సోము.

ఠానేదార్‌సాబ్‌కు మరో ఆలోచన తట్టింది. వెంటనే జవాన్లతో- "వో పొట్టేకో ఖోల్‌కర్ ఇదర్ లావ్" అని అనగానే జవాన్లు సోము కట్లు విప్పి ఠానేదార్ ముందు నిలబెట్టారు.

సోము నిలబడలేకపోతున్నాడు.

జ్వరంతో ఒళ్లు సలసల కాగుతోంది. సోము కాళ్లు సత్తువలేక వణుకుతున్నాయి.

ఠానేదార్‌సాబ్ సోము జుట్టుబట్టి లాగుతూ- "ఇప్పటికన్న జెప్పుబే! లేకుంటే నిన్ను కుక్కసావు జంపుత" అని అంటూ జవాన్లవైపు తిరిగి- "దో ఛోటే పత్తర్ లావ్" అనగానే జవాన్లు పరుగెత్తి రెండు చిన్న గులకరాళ్లు తెచ్చి ఠానేదార్‌కిచ్చారు.

"ఔర్ ఏక్ పలంగ్ లావ్" అనగానే ఒక మంచం తీసుకొచ్చి పెట్టారు.

"సులావ్ సాలేకో" అనగానే, జవాన్లు సోమును నేలపై వెల్లకిలా పడుకోబెట్టారు. వెల్లకిలా పడుకున్న సోము రెండు అరచేతుల్లో రెండు గులకరాళ్లు ఉంచి, ఆరాళ్లపై మంచం కోళ్లను ఆనించి మంచంవేసాడు ఠానేదార్. ఒక జవానును పిలిచి మంచంపై ఎక్కి ఎగరమన్నాడు.

మంచంపైకెక్కాడు జవాను. సోము అరచేతులకు మంచంకోడుకు మధ్య గులకరాళ్లున్నాయి. "పలంగ్‌మే ఖడే హోకర్ ఖూదో" అని ఠానేదార్ అనడంతో జవాను మంచంపై ఎగురుతున్నాడు.

కిందనేలపై సోము గొడ్డులాగా అరుస్తున్నాడు.

తల తెగిన కోడిలాగా సోము కాళ్లు రెండూ కొట్టుకుంటున్నాడు.

సోము అరుస్తూనే ఉన్నాడు.

జవాను ఎగురుతూనే ఉన్నాడు.

సోముకు పెడుతున్న నరకయాతన జంగుకు కనిపించడంలేదు. గోడ అడ్డంగా ఉంది. సోము పెట్టే కేకలకు జంగు కడుపులో పేగులు కదులుతున్నాయి.

అంతవరకు దూరంగా నిలబడి చోద్యంచూస్తున్న పిల్లలు సోముపెట్టే అరుపులకు భయపడి అక్కడినుండి పారిపోయారు. పెద్దవాళ్లు ఆ ఘోరం చూడలేక కళ్లుమూసుకున్నారు.

ఇటు సోము నరకయాతన అనుభవిస్తుంటే, ఠానేదార్ జంగు దగ్గరికెళ్లి "అబేఁ... ఇప్పటికయినా జెప్పు. లేకుంటే ఆ పోరడు చస్తడు. చెప్పు ఎక్కడున్నయి ఇంకా మిగిల్న తోటలు" అంటూ జంగునడిగాడు.

"తెలిస్తే చెప్పనా. తెల్వదనే గదా సెప్తలేను. నాకు తెల్వంది ఎట్లజెప్పేది. ఆ పోరన్ని ఏమనకుండ్లి. తల్లీదండ్రి లేని పోరడు. ఇంకా మీ మనసు నిండకుంటే నన్ను కొట్టుండ్లి, సంపుండ్లి కాని అన్ని ఇడ్సిపెట్టుండ్లి. మీకు పున్యముంటది" అంటూ ఏడవసాగాడు జంగు.

ఇంత చేసినా వాళ్ళు చెప్పకపోయేసరికి ఠానేధార్‌కు, అమీన్‌సాబ్‌కు పట్టుదల పెరిగిపోయింది. రోషంతో పళ్ళు పటపట కొరుక్కున్నారు. చెప్పించాలి... ఎలాగైనా వాళ్ళతో నిజం చెప్పించాలి.

ఠానేదార్ బుర్రలో మరో ఆలోచన మెరిసింది. వెంటనే జవాన్లను పిలిచి "ఏక్ ఛోటా

మటకా లావ్'' అనగానే ఒక చిన్న కుండ తెచ్చారు.

"కైసాఫీ కర్‌కే జల్దీ ఎక్ చుహ్వా లావ్" అనగానే గుమ్ములు, గాదెలు వెతికి ఒక ఎలుకను పట్టుకొచ్చారు.

సోమును మంచంకింద నుండి తీసి, మంచంపై పడుకోబెట్టారు.

సోము కడుపుపై ఎలుకనుంచి పైనుండి కుండను బోర్లించాడు ఠానేదార్. కుండ కదల కుండ పైనుండి ఒక పేలిక సోము నడుంకు కట్టాడు.

సోము కడుపుపైన, కుండలోపల ఎలుకకు ఊపిరి ఆడటంలేదు. ఎలుక సోము పొట్టపై పిచ్చిగా తిరుగుతోంది. సోము తట్టుకోలేక గింజుకుంటున్నాడు.

ఎలుక తన కాళ్ళ గోళ్ళతో - పళ్ళతో సోము పొట్టను ఉండీ ఉండీ కొరుకుతోంది.

క్షణక్షణానికి కుండలోపల ప్రాణవాయువు తరిగిపోవడంతో ఎలుకకు ఊపిరి అందక పిచ్చిదవుతోంది.

పొట్టను కొరికి బయటపడాలని ఎలుక ప్రయత్నం. సోము "అమ్మో" "అక్కా" అంటూ తన శక్తికొద్ది గింజుకుంటున్నాడు. కాని నలుగురు జవానులు బలంగా మంచానికి అదిమిపట్టారు.

కుండ చుట్టూ - సోము కడుపులోంచి రక్తం ధారకట్టింది. సోము నడుం నరక యాతనకు ఎగిరెగిరిపడుతోంది.

గోడ పక్కన ఏం జరుగుతోందో జంగుకు అర్థంకావడంలేదు. సోము కేకలు జంగు ప్రాణాలను లాగేస్తున్నాయి. జవాన్లకు, ఠానేదార్‌కు, అమీన్‌కు ఈ వినోదం కొత్తగా ఉంది. ఇప్పుడు వారి దృష్టి సోము నిజం చెప్తాడా, గంజాయి తోటల ఆచూకి చెప్తాడా, సోము బాధ చూడలేక జంగు నిజం చెప్తాడా - అనే విషయంపైలేదు.

ఎలుక ఏం చేస్తోంది లోపల.

కడుపుపైనే ఉందా?

కడుపును కొరుక్కుని లోపలికి పోయిందా?

పోతే ఎటువైపు నుండి సోము పొట్టను చీల్చుకొని బయటకొస్తుంది - అనే విషయాల పైనే ఉంది.

అంతలోకే ఇంట్లో ఉన్న నగానట్ర మూటగట్టుకొని భర్తను, తమ్ముణ్ణి అవి ఇచ్చి, ఇడిపించుకుపోదామని వచ్చింది దేవుబాయి. కళ్ళ ముందు కనిపించిన దృశ్యం చూసి అవాక్కయి, ఒకక్షణం శిలలా నిలబడిపోయింది దేవుబాయి. వెంటనే తేరుకొని తేరపారి చూస్తే ఏముంది? నలుగురు రాక్షసుల్లాంటి జవాన్లు తన తమ్ముణ్ణి మంచానికేసి అదిమి ఆనందిస్తున్నారు. సోము కడుపుపైన కుండ ఎగిరెగిరి పడుతోంది. సోము గొడ్డులా అరుస్తూ, నడుం ఇంతెత్తు లేపి నిస్సహాయంగా కొట్టుకుంటున్నాడు.

కడుపులోంచి రక్తం కారుతోంది.

తమ్ముడి కడుపుమీద కుండ ఎందుకు కట్టారు? ఆ కుండలో ఏముంది?- దేవుకు అర్థంకాలేదు.

"ఇదేం అన్యాలం. మీరు మనుసుల గోజలా! ఆ పోరన్ని అట్ల మంచంలకేసి ఎందుకు ఒత్తుతున్నారు. ఆ కడుపుమీద కుండేంది? ఆ కుండలేమున్నది? ఈ నెత్తురేంది ఇట్ల కారుతున్నది?'' అంటూ పిచ్చిగా ఏడుస్తూ అరవసాగింది.

"ఒసే ముండా... మొండితనం మీ గోండోళ్లకే కాదు.... మాకూ ఉన్నదే. గంజాయి సెట్లు ఎక్కడున్నయ్యంటే చెప్పరా! ఇప్పుడు జూడు ఆ పోరడు సస్తడు. ఆ పోరని కడుపు మీది కుండ కింద ఎలుక ఉన్నది. కుండకింద దానికి ఊపిరాడక అది కడుపులకెల్లి ఇప్పుడు బయటకస్తది.... చూసుకుంట నిలవడు'' అన్నాడు ఠానేదార్.

ఈ మాటలు విని దేవుబాయి ఒక్కసారి ఘొల్లుమంది.

అప్పుడే సోము దిక్కులు అదిరిపోయేలా అరిచాడు.

ఠానేదార్ మాటలు, దేవుబాయి శోకం, సోము అరుపు విన్న జంగులో ఆవేశం గట్లు తెగింది. ఒక్కసారి కాళ్ళతో గోడను తాటించి, పైకి ఎగరడంతో గోడకు వేలాడుతున్నవాడల్లా భూమిపై పడ్డాడు.

జంగుకు పరిస్థితి అర్థమయింది. చేతులు




ముడుచుకుంటే సోము ప్రాణాలు గాల్లో కలిసిపోతాయి అని గ్రహించి ఒక్క అంగలో కచేరి చావిడి వాకిట్లోకి దుమికి అక్కడ పాతిన ఒక గుంజను నిలువునా నేలనుండి పీకి ఠానేదార్, అమీన్‌సాబ్‌లపై తిరగబడ్డాడు.

ఊహించని పరిణామానికి జవానులు, ఠానేదార్, అమీన్‌సాబ్ ఆశ్చర్యంనుండి తేరుకోకముందే జంగు ఒక్క కాలి తోపుతో సోము పొట్టమీదగల కుండను పగలకొట్టాడు. చావు బతుకులమధ్య, కొన ఊపిరితో ఉన్న ఎలుక సోము పొట్టపై నుండి జారిపడింది. ఒడ్డునున్న చేపను నీళ్ళలోకి వేసినట్టు ఎలుక తిరిగి ప్రాణం పోసుకుంటోంది.

"అరే... హరామ్‌ఖోర్, ఎంత ధైర్యం నీకు. పకడ్‌లోప్ సువ్వర్‌కె బచ్చేకు" అంటూ ఠానేదార్‌సాబ్ హూంకరించాడు.

"పట్టి కట్టేయుండ్లి.... లమ్డీ కొడుకుని" అని ఆబ్కారీ అమీన్ గర్జించాడు.

జంగు ఇదేం పట్టించుకోకుండా సోమువైపు కదిలాడు. జంగు చేతులు ఇంకా అలాగే కట్టేసి ఉన్నాయి. అది చూసి దేవుబాయి జంగు చేతులకట్టిప్పటానికి ముందుకు కదిలింది. ఠానేదార్ దేవుబాయి చేయి ఒడిసి పట్టుకున్నాడు. దేవుబాయి ఠానేదార్ చేతిలో వున్న తన చేయిని విడిపించుకొని జంగును చేరి, జంగు చేతికట్టు విప్పసాగింది. ఠానేదార్ బూతులు తిడుతూ అడ్డం పోయాడు.

జంగు కట్టి ఉన్న చేతులతోనే ఊడబెరికిన గుంజతో విసురుగా ఒక్కటిచ్చాడు ఠానేదార్ తలపై.

ఠానేదార్ పుర్రె పగిలి మెదడు బయటపడింది. ఠానేదార్ నేలపై కుప్పలా కూలిపోయాడు.

మిగతావాళ్లకు ఏం జరుగుతోందో......

ఏం జరిగిందో.....

అంతుపట్టేలోగా జంగు, సోము, దేవుబాయి ఆ స్థలం వదిలి వెళ్లిపోయారు.

ఊరి పొలిమేరలు దాటిపోయాక, మనసు స్థిమితపడ్డాక ఏం జరిగిందీ అర్థమయింది జంగుకు. మామూలుగానే బతకనీయని ఈ సర్కారు, ఒక ఠానేదార్‌ను చంపాక తనను ఉరితీయకుండా ఊరుకుంటుందా? అందుకనే ఆ ప్రాంతం వదిలి పారిపోవాలనుకున్నాడు. అదే సంగతి దేవుకు చెప్పాడు.

"దేవూ... అయిందేదో అయిపోయింది. నేనీ ఊళ్లోనే ఉంటే పోలీసోల్లు నన్ను ఇడ్సిపెట్టరు. అందుకని నువ్వు, సోము తిరిగి మన ఊరు పొండ్లి. నేను యాడాది రెండేండ్లు ఎక్కడన్న దాక్కుంట. బతికుంటే మల్లకలుస్త, లేకుంటే లేదు" అని జంగు అనడంతో దేవుకు దుఃఖం ఆగిందికాదు. తమ్ముణ్ణి వదిలి జంగును పసిపిల్లలా వాటేసుకుంది – దేవు.

కన్నీళ్ళు తప్ప మాటలు రాని స్థితి.

ఇదే ఆఖరి చూపన్నట్టు జంగు దేవుని కంటికి నిండుగా చూసుకొని, గట్టిగా గుండెలకు హత్తుకున్నాడు.

"పోయొస్తా" అంటూ జంగు దేవుని వదిలి సోమును తనివిదీరా చూసుకొని కన్నీళ్ళతో, "సోమును మంచిగ జూసుకో. మనకిక వాడే తమ్ముడు. వాడే కొడుకు. బతికుంటే మల్ల కలుసుకుందాం" -- అంటూ అడవి దారిపట్టాడు జంగు.

పోతున్న జంగును కన్నార్పకుండా చూస్తోంది దేవు. ఒక్కసారి కూడా వెనకకు తిరిగి చూడలేదు జంగు. వెనకకు తిరిగి చూస్తే కన్నీళ్ళతో వీడ్కోలు చెప్పే దేవు, దీనంగా సోము కనిపిస్తారు. వాళ్ళను అలా చూస్తూ ముందుకు కదలలేనన్నట్టు జంగు మనసు రాయిచేసుకొని ముందుకు అడుగులేస్తున్నాడు.




**మూ**డు పగళ్లు, మూడు రాత్రులు అడవిలో ప్రయాణం సాగించాడు జంగు. కొన్నాళ్ళపాటు

అడవిలోనే తలదాచుకొని, మళ్లీ కొన్నాళ్ళకు ఎవరూ తెలియని దూరప్రాంతంలో బతుకుదామని జంగు ఆలోచన. అందుకని అడవి దారిన నడుస్తూ కాలిబాటలు కనిపించినా దాటేసి, అడవిలోనే దారీతెన్నూ లేని ప్రయాణం సాగించాడు. మొదట్లో పల్లెలు, గూడాలు, కాలిబాటలు కనిపిస్తే ఉద్దేశపూర్వకంగా వద్దనుకొని ముందుకుసాగాడు. సుదూర తీరాలకు తనవెవరూ గుర్తించనిచోటికి వెళ్లాలని జంగు కోరిక.

అడవిలో దొరికిన కాయకసరు తిని నీళ్ళు తాగి బతుకుతున్నాడు. ఓపికున్నంత సేపు నడవడం, అలసిపోతే దొరికింది తిని ఇన్ని నీళ్ళు తాగి ఏ చెట్టుకిందో విశ్రమించడం- ఇలా వారంరోజులు గడిచిపోయాయి. ఓపిక నశించింది. ఉడికిన తిండి ముఖం చూసి వారంరోజులపైనే అయింది. ఒంట్లో శక్తి సన్నగిల్లుతోంది. నడక చేత కావడంలేదు. ఏదయినా ఊరుగాని, కాలిబాటగాని కనిపిస్తే బాగుండని అనుకుంటూ నడుస్తున్నాడు జంగు.

జంగు నడుస్తున్న అడవి బహుచిత్రమైనది. దాని రహస్యాలు దానికే అంతపట్టని కీకారణ్యం. ఆ అడవి-ఆ నేల పుట్టి బుద్దెరిగిన ప్పట్నించి ఆ నేలపై- ఆ అడవిలో కాలిడిన మొదటి మానవుడు జంగు. వర్షాకాలం వెళ్లి నెలరోజుల పైనే అయింది. అయినా ఆ అడవిలో నేల ఇంకా తడిగానే ఉంది. అంత దట్టమైన అడవి అది. పన్నెండు నెలలు ఆకాశమార్గాన తన ప్రచండ కిరణాలతో రాజ్యమేలే ఆ సూర్యుడి చేతులకే అందని నేల అది. అంత దట్టమైన అడవిలో తను ఎటుపోతున్నాడో తెలియడంలేదు జంగుకు.

అలిసిపోయిన జంగు ఒకచోట గుహలాగున్న రాళ్ళసందులో విశ్రమించాడు. అలిసిన శరీరం నిదురలోకి జారిపోయింది.

హఠాత్తుగా చెంపలకు చల్లటి తడి, తడితోపాటు ముఖంపై ఏదో పాకినట్లయి ఉలిక్కిపడి లేచి చూసాడు. ఎదురుగా గునగున పాకుతున్న పులిపిల్లలు కనిపించాయి. ఇంకా పాలుమరువని పిల్లలవి. పులితనం రాని పసికూనలవి. నిదురలో జడుసుకున్నాడు కాని ఇప్పుడు చూస్తుంటే ముద్దొస్తున్నాయి. మొత్తం మూడున్నాయి. జంగుచుట్టూచేరి కాళ్ళతో బరుకుతూ గారంచేస్తున్నాయి. జంగువాటిని ప్రేమతో అక్కున చేర్చుకున్నాడు. జంగు అక్కున చేరిన పులిపిల్లలకు వెచ్చగా ఉండటంతో ఇంకా ముడుచుకొని జంగును అతుక్కున్నాయి.

దూరంగా పులి వాసన రాసాగింది. ఒక రకమైన గెదడు వాసనను పసికట్టాడు జంగు. పులి పిల్లలు ముద్దుగా ఉన్నాయి కాని వాటి తల్లి గుర్తుకు రాగానే అరచేతుల్లో చెమటలుపట్టాయి. వెంటనే పిల్లల్ని కిందకు దించి, పరుగున వెళ్లి ఒక చెట్టెకి కూర్చున్నాడు. కాసేపటికి పులి గాండ్రింపుతో ఆ అడవి దద్దరిల్లింది. కాసేపటికి హుందాగా అటే వస్తున్న పులి కనిపించింది. రావడంతోటే పిల్లల్ని ప్రేమగా నాకసాగింది. పులిపిల్లలు పాలకోసం గారం చేస్తున్నాయి తల్లితో. పులి ప్రేమగా ముందుకాళ్ళతో దువ్వసాగింది పిల్లల్ని.

ఉన్నట్టుండి పులి భళ్ళున వాంతి చేసుకుంది. పులి ముందర ఇన్ని మాంసం ముక్కలుపడ్డాయి. పాలకోసం మారాంచేస్తూ గారాలుపోతున్న పులిపిల్లలు ఆ మాంసం ముక్కలపై ఎగబడ్డాయి. పులి తన పిల్లలకు ఇలాగే ఘన ఆహారాన్ని అలవాటు చేస్తుంది. తరువాత నగం ప్రాణంతో ఉన్న చిన్న చిన్న జంతువులను తెచ్చి ఎలా పంజావిసరాలో, ఎలాంటి పట్లు పట్టాలో చేసి చూపుతుంది. పులిపిల్లలు తల్లి నుండే వేటాడ్డం నేర్చుకుంటాయి. జంగు పులి సంగతులు చాలాసార్లు విన్నాడు కాని ప్రత్యక్షంగా చూడ్డం ఇదే మొదలు.

అక్కడ పులి ఉన్నంతసేపు జంగు చెట్టుపైనే ఉన్నాడు. పులి మళ్లీ తన షికారి కొరకు వెళ్ళగానే, అది వెళ్లిన దిక్కుకు వ్యతిరేక దిశలో తన నడకను సాగించాడు.

పొద్దుపడమటి కొండల్లో పడబోతోంది. మళ్ళీ ఈ రోజు కూడా అడవిలోనే గడపాల్సిందేననే నిశ్చయానికి వచ్చాడు. ఒక చెట్టు కింద కాళ్ళు జాపుకొని కూర్చున్నాడు. అంతలోకే ఏదో జంతువు అలికిడయింది పొదలచాటున. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. జాగ్రత్తగా గమనిస్తే ఇరవై గజాల దూరంలో ఒక పొదలో ఏదో ఒక జంతువు కదిలినట్లయింది. ఏమయి




ఉంటుందో జంగు ఊహించలేకపోయాడు. భయంభయంగా ముందుకు కదిలి పరికించి చూసాడు. పొదలో ఒక ఆవు ఈనటానికి అవస్థ పడుతోంది.

ఆవును చూసిన జంగు కళ్ళు కాంతితో మెరిసాయి. తన కష్టాలు తీరాయి. తను ఎలాగైనా ఈ రాత్రికి ఏ పల్లెకో, గూడానికో చేరుకుంటాననే నమ్మకం ఏర్పడింది.

చూస్తుండగానే ఆవుకు సుఖప్రసవము యింది. కొల్లేగ పుట్టింది. వెంటనే జంగు కొల్లేగ కళ్ళు తుడిచి పిడ్డను తీసుకెళ్ళి తల్లి ముందుంచాడు. ఆవు ప్రేమగా కొల్లేగ ఒంటిపైగల చెమ్మను నాకసాగింది. కాసేపట్లో కొల్లేగ కడిగిన ముత్యంలా మెరవసాగింది. పచ్చిగా ఉన్న కొల్లేగ గిట్టలను గిచ్చి సరిచేసి చేతులతో పట్టుకుని నిలబెట్టి, నోటికి పొదుగునందించాడు. మెల్లమెల్లగా కొల్లేగ తల్లిపాలు తాగసాగింది. లేగ జున్నుపాలు కడుపునిండ తాగింది. మావి పడ్డాక, మావిని గోతి తీసి మట్టి కింద కప్పిపెట్టాడు. గబగబ చేతితోనే ఇంత పచ్చిగడ్డి తుంచి ఆవుముందు పడేశాడు. ఆవు మెల్లమెల్లగా గడ్డి మేయసాగింది. ఎప్పటి నుంచి నొప్పులుపడుతోందో, మంచి ఆకలిమీదున్న ఆవు గడ్డిని ఆబగా మేస్తోంది.

పొద్దు గుంకటానికి ఇంకా అట్టే సమయం లేదని జంగు మనసు హెచ్చరించింది. నేడు రోజులాగా ఈ అడవిలో రాత్రి గడపటానికి వీలులేదు. ఇప్పుడు తనొక్కడే కాదు. వెంట మరో రెండు ప్రాణాలున్నాయి. తనుతాను ఎలాగో రక్షించుకోగలడు. కాని ఆ ఆవును, లేగను రాత్రిపూట క్రూరమృగాలనుండి రక్షించటం కష్టం. అందుకని లేగను భుజాల పై వేసుకొని ఆవును అదిలించాడు.

ముందు జంగు నడుస్తున్నాడు. వెనక ఆవు వస్తోంది. కాసేపటికి ఆవు ముందయింది. జంగు ఆవును అనుసరిస్తున్నాడు. అంత పచ్చమైన అడవిలోకూడా ఆవు దారి మరవలేదు. కాసేపటికి కాస్త నలిగిన దారి కనిపించింది. మరి కాసేపటికి కాలిబాట కనిపించింది. అలా నడుస్తూపోతే కాసేపటికి బండిబాట దొరికింది.

ముందుకు నడుస్తున్న జంగుకు మూరంగా మంటలు - పొగలు కనిపించాయి ముందు. తరువాత కాలుతున్న గుడిసెలు కనిపించాయి.

ఆవు ముందు నడుస్తోంది. జంగు వెనక నుంచి దాన్ని అనుసరిస్తున్నాడు. ఆవు ఊరుచేరింది. అప్పటికే ఆ ఊరు కాలి-కూలి బూడిదయింది. ఆ బూడిదకుప్పల నడుమ మనుములు కంటికిమింటికి ఏకధారగా ఏడుస్తున్నారు. ఆవు వెళ్ళి ఒక గుడిసె ముందాగింది. బూడిదకుప్పల నడుమ కూర్చున్న ఒకతను జంగును చూసి లేచివచ్చాడు. భుజాన ఉన్న లేగను అతనికి అందించాడు జంగు. పరిచయాలయ్యాయి. జంగు తాను ఠానేదార్‌ను చంపిన సంగతి చెప్పలేదు. ఏదో నోటికొచ్చిన కథ చెప్పి, "ఇదేంటి...? ఊరెట్లంటుకున్నది" అని వివరాలడిగాడు.

"ఇది బాబెరుురి. ఇది అంటుకోలేదు. జంగ్లాతోల్లు అంటవెట్టిండ్లు. మేం అడివిని నరికినమ్. అల్లు మంటలతోని మా ఊల్లు నరుకుతున్నరు. మా గోజలకు అడీలకు తరిమింద్రు. మేం పొందిచ్చుకున్న పన్నెండు ఊల్లను గిట్లనే బూడిదచేసిండ్లు ఆ జంగ్లాతోల్లు. జంగ్లాతోల్లు ఊర్లెకు రాంగానే పడుసోల్లందరు గుట్టలు వట్టి ఉరికిండ్లు. అల్లుఇంట్ల దొరికిన మునలోల్లను తన్నుకుంట పట్టకపోయిండ్లు. ఇగ కేసులు వెట్టి తిప్పి తిప్పి సంపుతరు" అంటూ విషయం అంతా వివరించుకొచ్చాడుఏసు.

"అంతా నీతోనే అయింది. అడివి నరికి భూమి సాగుజేస్తమంటివి. నీమాట నమ్మి నష్టేట మునిగినం గద. భూమి మీద ఆశపడితే ఉన్న కొంపవాయె. తిండిగింజలు కాలి బూడిదయ్యె ఏవని జేసిన సొంచ్ సమజ్‌తోని జెయ్యాల" అంటూ ఖస్సుబుస్సులాడాడు ఒక నడీడు మనిషి.

"నేను మొగోల్లమారం అతిసరకమన్న, కాని ఆడోల్లమారం జంగ్లాతోల్లు రాంగానే గుట్టల పొంటి ఉర్కుమనలేమ. మొగోల్లమై అడివి నరికినప్పుడు ఎవలొచ్చిన మొగోస్తీరు నిలవడాల అదీ మొగతనం..." అంటూ ఈసడించాడితను. ఇతని పేరు ఏసు.

అంతలోకే కుర్దు కలగజేసుకుని- "అ

యిందేదో అయింది. అల్లు మన గుడిసెలు కాలవెట్టిండ్లు, కాని మన రెక్కలు ఇరిసెయ్యలే దు. మల్లా కట్టుకుందాం. మన భూమి మనకే ఉంటది. జంగ్లాతోల్లు కేసులు పెడ్తె పెట్టని-తిరుగుదాం కచేరీలకు. నేను ఆరేండ్లపట్టి కోర్టుల చుట్టు తిరుగుతలేనా! ఓపికుండాల మనిషికి. కష్టమొచ్చినప్పుడే కలిసి కట్టు గుండాల. మనమీద కేసులువెట్టి తిప్పితే, మనం కూడా ఎవర్నయినా సాయం తీసు కుందాం. ఖానూన్‌తోని కొట్లాడదాం. ఖానూన్ మనకు తెల్వకుంటె తెలిసినోళ్లను తోడుతెచ్చు కుందాం. ఏమంటరు?'' అని అడిగాడు కుర్దు.

ఈ మాట అందరికి నచ్చింది. అలాగే చేద్దాం అంటే, అలాగే చేద్దాం అనుకున్నారు-- అందరూ. కాని సహాయానికి ఎవరిని తెచ్చుకు నేది? కాగితాలు చదవగలిగినవాడు, అంతో ఇంతో వ్యవహారం తెలిసినవాడు కావాలి. అదే అనుమానం వ్యక్తంచేశాడు ఏసు.

''నేను చెప్పేది ఇనుండ్రి. మన గోండు, కొలామ్, పరదాన్లల్ల సదుకున్నోడు, కచేరీలు, కోర్టులు తిరిగేటోడు ఎవల్లూ లేరు. కాని దేవ డంల లచ్చుడుపటేల్ దగ్గర కొమరం భీము ఉన్నడు. అతడు చానొద్దులు దేశంకాని దేశాలు తిరిగి అచ్చినోడు. ఎంత పెద్దదితోనైనా మాట కుమాట జవాబిచ్చెటోడు. అతన్ని తెచ్చు కుందాం ముందు'' అని ఒక కొలామ్ యువకు డు చెప్పేసరికి ఆమాట నిజమే అనిపించింది కుర్దుకు, ఏసుకు.

కొమరం భీము ఎవరో కాదు- తమ అన్నకొ డుకే. అప్పుడెప్పుడో సిద్దిక్ అనే భూస్వామిని చంపి, చాలాఏండ్లు పారిపోయి అటుఇటు తిరిగి ఈమధ్యనే దేవడం చేరి లచ్చుడుపటే ల్‌కు కుడిభుజంగా ఉంటూ అన్ని పనులు చేస్తున్నాడని విన్నాడు. తమకు కొమరం భీము సంగతి గుర్తు రానందుకు చాలాబాధపడ్డారు కుర్దు, ఏసులు. ఎప్పుడో భీమును తమకు తోడుగా తెచ్చుకోవల్సింది అని విచారపడ్డారు.

తమకు తోడుగా నిలబడటానికి కొమరం భీమును తీసుకురావలసిందిగా నిర్ణయమ యింది. అందుకు అతణ్ణి ఒప్పించటానికి





అతడి చిన్నాయనలైన కుర్దు, ఏసులు వెళ్లా లని కూడా నిర్ణయమైంది.

మరునాడు కొమరం భీమును రమ్మని అడ గటానికి కుర్దు, ఏసు బయలుదేరారు. వారి వెంట జంగు కూడా వెళ్ళాడు. తోవలో కుర్దు, ఏసులు కొమరం భీము గొప్పదనాలు చెప్పుకొ స్తున్నారు. ''మా తాతల్తండ్రులు, జనగామకు (నేటి ఆసిఫాబాదు) రెండున్నర కోసుల దూ రంలున్న 'శాంకిపెల్లి'ల వుంటుండ్రి. సూడంగ సూడంగ శాంకపెల్లిలున్న భూమి, ఇల్లు, గొడ్డు గోజ అన్నీ వోయినై. అక్కడికెల్లి పొట్టసే వట్టు కొని సుర్దాపూర్‌ల ఉన్నమ్. మల్ల ఆడ ఉండ లేక తురక పట్టేదార్ బాధలు పడలేక కాకన్ ఘాట్‌కు కొమరం భీము అన్నలు వోతే, మేము గిట్లబాబెఝరి కచ్చినమ్'' అంటూ చెప్పుకొ చ్చాడు ఏసు.

మిట్టమధ్యాహ్నాం భోజనాల వేళకు దేవడం చేరుకున్నారు కుర్దు, ఏసు, జంగు.

కొమరం భీము చిన్నాయనల్ని సాదరంగా ఆహ్వానించాడు. భార్యలను పిలిచి వంటలు చేయమన్నాడు. కొమరం భీముకు ఇద్దరు భార్యలు. ఒకరు సోమి. మరొకరు పైకుబాయి. ఇద్దరూ వంట ప్రయత్నంలో పడ్డారు. ఇటు మగవాళ్ళు మాటల్లో పడ్డారు.

''మేము నీ ఇంట్లో తిండి తినేందుకు రాలేదు భీమూ. అక్కడ బాబేఝరిల పన్నెండూళ్లమంది ఆకలితోని నకనకలాడుతు న్నరు. తమ కండ్లముందే గుడిసెలు కాలితే చూసుకుంట నిలుచున్నరు. అడవి నరికిన పాపానికి జంగ్లాతోల్లు మా గుడిసెలు కాలవె ట్టిండ్లు. గోజలను పంటలమీదికి ఇడిసిపె ట్టిండ్లు. దొరికిన ముసలోల్లను కొడుతున్నరు. కేసులు పెడుతున్నరు. భూమిలేక అడివి నరి కి జంగ్లాతోల్లతోని రోజుకో సావు సస్తున్నం'' అంటూ పరిస్థితి వివరించాడు ఏసు.

''భీమూ... నీవు మాదగ్గరుండాల. మన భూముల్ని మనం గెలవాల. మాకు దిక్కెవరు లేరు నీవు తప్ప. ఈ తురకల రాజ్యం మమ్మ ల్ని గోల్‌మాల్ చేస్తున్నది. అల్ల ఖానూన్‌లు మాకు తెలుస్తలేవు.

నువ్వు అస్తే అందరం నీమాట మీద నిలుస్తం.... నువ్వు రావాల కొడుక'' అంటూ

దీనంగా, కన్నీళ్లతో అర్థించాడు కుర్దు.

కుర్దు కన్నీళ్ళు భీమును కదిలించాయి. చిన్నాయన తనవాళ్లకోసం, తన పన్నెండు గూడాల జనంకోసం పడుతున్న క్షోభకు భీము హృదయం ఆర్ద్రమయింది.

భీము చిన్నాయినను గుండెలకు హత్తుకుని, కళ్ళనీళ్ళు తుడిచి- "నేను వస్త చిన్నాయినా! నేను తప్పకుండ వస్త!" అంటూ భార్యల్ని కేకేసి తొందరగా సామానులు సర్దమన్నాడు.

సాయంత్రానికి కొమరం భీము సకుటుంబంగా దేవడం నుండి బాబెఝరి చేరుకున్నాడు.

వచ్చిన వెంటనే కుర్దు, ఏసు, కొమరం భీము, ఇంకా కొందరు కలిసి జనగామ వెళ్ళి జంగ్లాత్‌వాళ్ళు పట్టుకుపోయిన ముసలివాళ్లను విడిపించుకొచ్చారు.

భీము వచ్చి అప్పుడే వారంరోజులు గడిచిపోయాయి. భీము గూడెం గూడెం తిరుగుతున్నాడు.

ఒక్కొగూడెంలో ఒక్కోగోండు, కొలామ్ గుండె వినిపించే కథలు వింటుంటే భీము రక్తం ఉడుకెత్తుతోంది.

జానెడు పొట్టకోసం, పిడికెడు మెతుకుల కోసం ఆ మనుమలు పడుతున్న పాట్లు వింటుంటే అధికారం ముసుగు కింద సాటిమనుమలు చేస్తున్న నైచ్యం చూస్తుంటే మనిషన్నవాడెవడూ ఓర్చుకోలేడు. భుక్తికోసం భూమి, భూమికోసం పోరాటం. ప్రతిగోండు గుండెలో కళ్ళలో భూమి కనిపిస్తుంది.

భూమికోసం ఎక్కడినుండో ఇక్కడికొచ్చారు. భూమికోసం ఎన్నో ఇబ్బందులు పడ్డారు. ఈ భూమి పోరాటంలో ఎంతమంది చనిపోయారో, ఎన్ని కుటుంబాలు చెల్లాచెదురయ్యాయో... తలుచుకుంటే గుండె చెరువవుతుంది. గోండుల బాధలు- బరువులు, కష్టాలు-కన్నీళ్ళు చూస్తుంటే భీముకు దుఃఖం, కోపం ఉప్పెనలా ముంచుకొస్తున్నాయి.

భీము ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి. కొన్ని వందలమంది గోండులు కలిసి అడవి నరికి పన్నెండు గూడేలు పాతంచేసుకున్నారు. అది తెలుసుకొని, ఎక్కడినుంచో, ఇద్దరు ముగ్గురు సర్కారు మనుమలు వచ్చి గూడేలు కాలబెడుతున్నారు, పంటలు నాశనంచేస్తున్నారు. గూడేలు కాలుతుంటే, తమ కళ్ళముందే చేతికొచ్చిన పంట నాశనమవుతుంటే ఏం చేయలేక చేతులు కట్టుకొని జనం చూస్తున్నారు.

తమ చిన్నాయనలు ఇద్దరూ, ఇంతమంది గోండు, కొలామ్‌లను ఒకటిచేసి పన్నెండూళ్ళు పొందించారు. ఉండటానికి ఇళ్ళు, సాగుకు భూమి పాతం చేసుకున్నారు. కాని ఇప్పుడు సర్కారుకు, గోండులకు జరిగే ఈ లడాయిలో గెలుపు ఎవరిది?

సర్కారు ముందు తలవంచేది లేదంటున్నారు తమ చిన్నాయనలు, కుర్దు, ఏసులు.

గెలిచి తీరాల్సిందే... కాని ఎలా గెలవటం- అర్థంకావడంలేదు. ఎంతో నమ్మకంతో తనని తీసుకొచ్చారు. దీనిని సరిగా నడిపి విజయం సాధించాలి. ఏంచేయాలో, ఎలా చేయాలో, తెలియక సతమతమౌతున్నాడు భీము.

దినం, రాత్రి ఒకటే ఆలోచన భీముకు- ఏంచేయాలి? ఎలా చేయాలి.

సిద్దిక్‌ను చంపి తను దేశాలు పట్టి తిరిగినప్పుడు తను విన్నవన్నీ భీముకు స్ఫురణకొచ్చాయి.

ఎక్కడ అన్యాయం జరిగితే అక్కడ పోరాటం జరుగుతుంది. సర్కారు, జంగ్లాతువాళ్ళు ఈ పట్టేదార్లు ఉన్నంతకాలం కొట్లాటలు తప్పవు. భూమి సమస్యకు పరిష్కారంగా ఏంచేయాలి అనేదానికి జవాబు దొరికింది- పోరాటం చేయాలి.

అయితే ఆ పోరాటం ఎలా చేయాలి? అనేదానికి జవాబు దొరకలేదు.

ఒక బొగడమీద అందరూ సమావేశమయ్యారు. జంగులేచి "అందరూ ఇనుండ్రి... ఎంతో అనుభవంతోని మన పెద్దోలు కుర్దు, ఏసులు ఈ పన్నెండూళ్లు పాతంజేసిండ్లు. అందుకు సర్కారు, జంగ్లాతువాల్లు ఏం జేసిండ్లో మీకెరుకనె. అల్లు ఏంజేసినా మనం చేతులు కట్టుకొని సూనుడుదప్ప మనం మన నోరు తెర్వలేదు యిన్నొద్దులు. ఎందుకంటే

ఆల్లకు మన బాసరాదు, మనకు ఆల్లబాసరాదు. అందుకని మనం ఇన్నొద్దులు నోరుమెదపలేదు. మనకిప్పుడు భయంలేదు. మనకు మన కొమురం భీముదాద ఉన్నడు. ఆల్లతోని మాటకుమాట జవాబిస్తడు- ''అని ఇంకేమో చెప్పబోతుంటే-

''అంత మంచిగనే ఉన్నది. మరి సర్కారు మనమీద కోరట్ల కేసులు పెడతది- అప్పుడెట్ల?'' అంటూ అనుమానం వ్యక్తంచేసాడో కొలాము యువకుడు.

''ఉన్న కేసులకే తిరగలేక సస్తున్నమ్ మల్ల కొత్తకేసులేంది? ఉన్నదేదో తిని, కాళ్ళు కడుపులపెట్టుకొని పండక ఈ కొట్లాటలు, దంపులాటలెందుకో' అని నసిగాడొక ముసలిగోండు.

'నువ్‌నోరుమూసుకో' అని అందరూ అతణ్ణి కసిరారు.

''వాల్లు మనమీద కేసులు పెడ్తరు. అందుకని ఆ కోరటు మర్యాదలు, ఖాయిదాలు, కానూన్‌లు తెలిసినమనిషి మన కులమొడే వావుదంల ఉన్నాడు. పేరు మహదు. అతన్ని పిలిపించుకుందాం'' అని జవాబు చెప్పాడు కొమురం భీము.

''మీరేం జేసిన మంచిగ సోంచ్ సమజ్‌తోనే జేయుండ్లి. తెలిసినోల్లను, నలుగుర్ని చదువార్లను, నాలుగు మాటలడిగి జేయుండ్లి- ఏది జేసినా అని సలహా ఇచ్చాడు ఒక కొలామ్ ముసలాయన.

కొమురం భీము, మహదు కలిసి జనకాపురం సాలెపంతుల్ని, జనగామ వకీలు రామచంద్రరావ్ పైకాజీని మాట్లాడాలనుకొన్నారు.

''అడవుల్ని బాగా నరుకుండ్లి. నైజామ్‌నవాబు రోగానికి ఇదే మందు. అటు ఉట్నూరు నుండి ఇటు జనగామదాక అడవుల్ని నరుకుండ్లి... వాడే దిగి వస్తడు. ఇప్పటికే వాని మనసుల బిక్కుబిక్కుమంటుంది. ఒకవైపు నిర్మల్ల తెల్లోల్లు ఇప్పటికే రికానవెట్టిండ్లు. వాల్లంతా చూస్తునే ఉన్నరు. ఏమన్నయితే నైజాం నవాబ్‌ను 'నువ్ జర పక్కకు జరుగు. మేం రాజ్యంచేసి చూపిస్తం' అని ఎక్కడంటరో అని ఆ లోపల లోపల పీకుతోంది అందుకని ఆడు మీతోని ఎక్కువ దుష్మనీ చెయ్యడు. అడవులు నరికితే వాడే లొంగుతడు'' అని జనగామ పంతులు సలహాఇచ్చాడు.

వకీలు రామచంద్రరావ్ పైకాజిని కలిసి మాట్లాడితే . అతడు జంగ్లాత్ ఖానూన్ చెప్పసాగాడు ''చూడండ్లి... 1918 కి ముందు మన. అడవి భూముల మీద సర్కారుకు ఎటువంటి హక్కులేదు. సివాయి జమాబందీ (పన్నులేకుండా దున్నుకునే భూములు)ల కింద మన జిల్లాల అడవి భూమంత ఉండేది. 1918 లో ఉట్నూర్‌ల కొత్తగా మొదటిసారి తాసీలు అఫీలు పెట్టిండ్లు. అప్పటికే మహారాష్ట్ర ఇంకా చుట్టుపట్ల జిల్లాలనుండి కోమట్లు. పైకాజీలు ( బ్రాహ్మలు ), తురకలు వచ్చి ఇక్కడ ఉంటున్నారు. ఇతరచోట్ల భూముల్లేనివాళ్ళంతా ఈవైపే వచ్చారు. వచ్చిన వాళ్ళు అప్పట్లో అంటే 1918 కి ముందు వచ్చి ఉన్నోల్లు అడివి నరుక్కొని వ్యవసాయం చేసుకుంటే ఏ పరేషానీ ఉండేదికాదు. కాని వాళ్ళు మాయోపాయాలతో తాకట్లుపట్టి, దొంగ వేలిముద్రలు వేయించుకొని, పది రూపాయలిచ్చి వేయి రూపాయలనిరాయించుకొని, పైసల కింద భూమి లాక్కొని మిమ్మల్ని భూమి లేనోల్లనిజేసిండ్లు. ఇంకొందరు పట్నాలనుండి వచ్చినోల్లు సర్కారుతో మంచిగుండి గోండు కొలామ్‌లు అడవికొట్టి బంగారం పండిస్తున్న భూములకు తమ పేర పట్టాలు తెచ్చుకున్నారు. అట్లకూడా మీలో చాలామందికి అన్యాయం జరిగింది. అసలు రెక్కలుముక్కలుజేసుకొని అడవి నరికి పాతం చేసుకున్న అసలుదారుకే హక్కు లేకుండాపోయింది. మధ్యలో వచ్చినవాళ్ళు తెలివితో పట్టా తెచ్చుకున్నారు. ఈ సంగతి తెలవని గోండులు ఉన్న భూమి వదులుకొని ఇప్పుడు కొత్తభూమి కొరకు అడవిని నరికితే కానూన్ ఒప్పుకోదు. తెలిసిందా ఇదీ సంగతి'' అంటూ చెప్పాడు వకీలు రాంచంద్రరావ్ పైకాజి.

''మరి ఇప్పుడు మాకు భూమి ఎట్ల?'' అడుగాడు భీము.

''పట్టా ఉంటేనే భూమి''

''మాది పోడు వ్యవసాయం'' అన్నాడు భీము.

''అయినా సరే... జంగల్‌లో చారెడు భూమి




మీదకూడ ఎవరికి హక్కులేదు''

"ఉన్న భూములు తెలిసో తెలికనో పాయే. ఇప్పుడు మీరు అడవి నరకద్దంటున్నారు. మరి మేం బతికెదెట్ల. గోండోనికి భూమి లేకుంటే ఏం పండిస్తడు, ఏం తింటడు?''

"నేను ఉన్న కానూన్ చెప్పిన తర్వాత మీ ఇష్టం. మీరు పోయి మన తురకరాజునే కలువుండ్లి- మీ కష్టాలు చెప్పుకొండ్లి. రాజు తలచుకుంటే భూమికి కొదవనా'' అంటూ ముగించాడు.

★ ★ ★

రాజును తీరిగ్గా కలవచ్చు. ముందు నిలవనీడ కావాలి. కాలిపోయిన గుడిసెలు నిలబెట్టుకోవాలి.

ఆ గుడిసెలకు కర్ర కావాలి.

కనుక మళ్ళీ అడవులు నరికారు.

బాబెఝురిలో గోండులు మళ్ళీ అడవి నరికారనే వార్త జనగామకు చేరిపోయింది. తెల్లారేసరికి నాలుగు గుర్రాలపై నలుగురు అధికారులు బాబెఝురి వైపు కదిలారు. ఒక గుర్రంపైన చౌకీదారు దారి చూపుతుంటే మూడు గుర్రాలపై అమీన్, సారేదార్, గిర్దావర్ కదిలివచ్చారు. పట్వారి లక్ష్మణ్‌రావు ఎడ్లబండి మీద వాళ్ళ వెనకే బయలుదేరివచ్చాడు. వాళ్ళ వెనకే అరబ్బులు వచ్చారు. అధికారుల వెంట వెళ్తే తిండి, తాగుడు, వేట చేయొచ్చని వాళ్ళ ఆలోచన; ఎంత ఎక్కువమంది ఉంటే అంత మంచిదని అధికారుల ఆలోచన.

వచ్చిన అధికారులకు దారి చూపటానికని, హవల్దార్ కొమరం సూరు ముందునడుస్తుంటే అధికారులు బాబెఝురి చేరారు.

బాబెఝురి బంగ్లా ముందు నాలుగైదు మంచాలు వేసి ఉన్నాయి. రావడంతోటే వాటిలో కూలబడ్డారు. ఆ గూడెంలోకి అధికారులు వచ్చినట్టులేదు- ఎవరో దారినపాయే దానయ్య వచ్చినట్టుంది. ఎలాంటి హంగామాలేదు, హడావుడిలేదు.

ఊళ్లోవాళ్లందరు నింపాదిగా నిలబడి ఏంజరుగుతుందోనని చూస్తున్నారు. ఎవరి ముఖంలో కూడా భయం లేదు. అందరిలో నిర్లక్ష్యం, మొండితనం కనిపిస్తున్నాయి.

"తెరీ మాకా హర్రామ్ గోండ్! మాకు ఇంతెజాములు లేవు. చల్‌బె చల్....'' అంటూ చౌకీదార్‌ను కేకలేసాడు అమీన్‌సాబ్. మళ్లీ ఒకసారి గూడెంను పరికించి చూసి- "లక్ష్మణ్‌రావు సాబ్, గిర్దావర్‌సాబ్. ఛలో.. మనం ఈల్లు జంగిల్ నరికిన దగ్గరికి పోదాం'' అంటూ ముందుకు కదిలాడు. గూడెం వాళ్లవెంట కదిలింది.

"బాప్‌రే బాప్! ఎంత జంగల్ నరికిపారేసిండ్లు'' అంటూ గుండెలు బాదుకున్నాడు అమీన్‌సాబ్-

"లక్ష్మణ్‌రావ్‌జీ! దేఖో కితనా జంగల్ కాటే. దమాక్ నహీహై సాలోఁకో! అల్లని అడుగుండ్లి. ఇంత జంగల్ నరికినందుకు ఏం ఇచ్చుకుంటరో'' అని అడిగాడు అమీన్.

"నడిమిట్ల ఆ లక్ష్మణ్‌రావు ఎందుకు. సూటిగ నాతోని మాట్లాడు. జంగల్ కొట్టినమ్... ఇంకా కొడతం కూడ. ఎవడికి ఒక కొత్త ఇచ్చేది లేదు. దమ్ముంటే ఖానూన్ కార్వాయి జేసుకో. లేదంటవ్, వచ్చిన దారిన ఎల్లిపో'' అంటూ గర్జించాడు భీము.

"అబే బేకూఫ్... నామీదికే కళ్లు తీస్తవ్. నేను ఎవరో ఎరికేనా?'' అంటూ తన భుజాలు తడుముకున్నాడు అమీన్.

"నీవెవరవో నాకు దెలుసు, ఈల్లందరికీ దెలుసు. సర్కారి దొంగవు. ఈ అడవి నీ తాతదా, తండ్రిదా! ఈ అడవిల చెట్టుగొడ్తె నీకు మేం పైసలలియ్యాల. ఇస్తే నువ్ చూసి చూడనట్టు పోతవా! ఈడొక చౌకీదార్, ఈడొక సేరేదార్, నువ్వొక అమీన్ అనుకుంటున్నవా? మీరంతా దొంగలు. చిన్న దొంగ, పెద్దదొంగ'' అంటూ కొమరం భీము ఒక్కొక్కర్ని వేలెత్తి చూపించాడు.

"అబే సువ్వర్ కీఁ ఔలాద్... మమ్ముల్ని దొంగలంటావా?'' అంటూ ఇంతెత్తున ఎగిరాడు అమీన్‌సాబ్.

"ఒకసారికాదు నూరుసార్లంట. చోర్‌చోర్ చోర్'' అని అంటుంటే భీము గుండెలు ఆవేశంతో ఎగిసిపడుతున్నాయి.

భీముని చూసి మిగతావాళ్లు కూడ విజృంభించారు.

"మీలు దొంగలు కాకుంటే ఏందయ్యా! మీరు మాకు చేసిన మేలేందయ్యా? మేం నోరుదెరిస్తే కేసులు పెట్టుడు. మీరు జేయవట్టే మా గూడెంలకెళ్లి మీ కచేర్లకు, కోరట్లకు తోవలుబడ్డయి. ఎంతసేపు మీరు తెల్సిందొక్కటే గూడాల మీదబడి కోళ్లు, మేకలు ఎత్తుకుపోకట. కంటికి పసందయిన ఆడపిల్లల్ని ఖారాబు జేసుడు. మంచెరువట్టి, నాగలికి పట్టి, దుంపకు పట్టి, గుడిసెకు పట్టి, గడ్డికి పట్టి, మాలగ్గమైనా పట్టే, మేం సచ్చినా పట్టే, పట్టీల పేరుతోని మా ఇండ్లు బోడగజేసి, మా నెత్తురు తాగే మీరు దొంగలు గాకుంటే ఏంది మరి?" అన్నాడు కుర్దు.

పరిస్థితి విషమిస్తోందని గ్రహించిన హవల్దార్ సూరు మెల్లగా అక్కణ్ణించి జారుకున్నాడు.

అధికారుల కంట ఎందుకు పడాలని జంగు గుడిసెలోంచి బయటకే రాలేదు.

కోళ్ళు తిని ఖుషీ చేద్దామని వచ్చిన అరబ్బులకు చెమటలు పడుతున్నాయి. దారమ్మట గుర్రాలమీదనే, తోలు తిత్తుల్లో తెచ్చుకొని తాగిన సారా నిషా దిగిపోయింది.

"ఈల్లు మనుసులు కాదు- గోజలు. అడీల పసిపోరగాండ్లు వంట్లకోసం సెట్లమీద సెయ్యేస్తే సేతులు నరికే రాక్షసులు" అంటూ ఒక ముసలివాడు ఆవేశంతో చెప్పుకొచ్చాడు.

అందరూ తలాఒక మాటంటున్నారు.

పరిస్థితి విషమిస్తోందని గ్రహించిన అమీన్ చివరి ప్రయత్నంగా మళ్లీ ఒకసారి గర్జించాడు.

"మాదర్చోద్! నువ్వేసబే ఈల్ల లీడర్‌వి. హరామ్‌ఖోర్! పదిమందిని కలుపుకొని మా మీదనే బగావత్ జేస్తవా" అంటూ కొమరం భీము అంగరాఖపట్టి ముందుకు గుంజాడు.

భీము విసురుగా చేయి విదిలించాడు. అమీన్ వెళ్లి విసురుగా నేలమీద పడ్డాడు. అమీన్ కళ్లు అవమానంతో, కోపంతో ఎర్రబడ్డాయి.

"ఖబర్దార్... ఇంకోసారి ఈ గూడాల దిక్కు వచ్చినా, ఏ గోండు మనిషిమీద చెయ్యేసినా వాణ్ణి నిలువునా కాల్చి మా పంటలకు ఎరువేస్తాం... తెల్సిందా!" అని కాసేపాగి-

"ఆ సూపేందిబే... దించు ఆ కండ్ల గుడ్లు. నీ తాబేదార్లకు చూపు. నీకు దమ్ముంటే కేసులు పెట్టు. కోరట్ల జూసుకుందాం. ముందిక్కణ్ణించి నడువ్" అని భీము అనగానే ఒక అరబ్బోడు ఆవేశంతో ముందుకొచ్చి, "క్యాబే గీదడ్‌కీ ఔలాద్! బహుత్ జ్యాదా బాతా కర్రా" అంటూ భీముపైకి చెయ్యెత్తాడు.

అంతవరకు పొదల చాటున, కాలిపోగా మిగిలిపోయిన టేకు మొద్దుల మాటున దాక్కున్న గోండు-కొలామ్ యువకులు కర్రలు పట్టుకొని బయటకొచ్చారు.

బాబెఝురి భూముల్లో కర్రలు గాలిలో తిరుగుతున్నాయి. కర్రలు గాలిలో తిరుగుతుంటే తురకల పుర్రెలు పగులుతున్నాయి. ..గిర్దావర్, అమీన్, చౌకీదార్, ఒక అరబ్బోడు కిందపడ్డారు.

కిందపడ్డ అరబ్బోడు వేటకు తెచ్చుకున్న బర్మార్‌ను పేల్చాడు.

అది భీము కుడిభుజంలో నుంచి దూసుకుపోయింది. గోండులు కర్రలు తిప్పడం ఆపి భీమును చుట్టుముట్టారు.

ఇదే అదననుకొని తెల్లబట్టలు, ఖాకీ బట్టలు దుమ్ము రేగిపోగా ఒళ్ళంతా దెబ్బలతో, రక్తంతో బతుకుజీవుడా అనుకుంటూ గుర్రాలెక్కి పారిపోయారు వాళ్లంతా.

★ ★ ★

వారం తిరక్కుండానే ఒకనాడు మందను వెంటేసుకువచ్చారు వాళ్ళు.

అంగట్లో కనిపించిన కుర్దు, యేసు, సుద్దు, జంగు మరికొంతమందిని అరెస్టు చేసుకొని పట్టుకొనిపోయారు.

అడివంతా నరికారనీ, ఇదేమని అడిగితే బందూకుతో బెదిరించారని కేసులు బనాయించారు.

లచ్చు పటేల్ జమానత్‌పై రామచంద్రరావ్ వకీలు మధ్యవర్తిగా భీము తన వాళ్లను విడిపించుకున్నాడు.

జమానత్‌పైన బయటకొస్తున్న కుర్దు, యేసు, జంగులకు జనకపురం సాలె పంతు




లు కలిసి "ఏమయినది, తురకరాజును కలి స్తిరా?" అని అడిగాడు.

మళ్లీ తురకరాజును కలిసి తమ కష్టాలు చెప్పుకోవాలనిపించింది వాళ్లకు. అదేమాట భీముకు చెప్పారు. అందుకు భీము అందరి అభిప్రాయం అడిగాడు.

ఒకసారి కలిసి మన కష్టాలు చెప్పుకుంటే తప్పు లేదనే అభిప్రాయాన్ని వెల్లడించారంద రూ. అందరి అభిప్రాయాలు విన్న తరువాత భీము మహదును ఉత్తరం రాయమన్నాడు.

భీము చెప్తుంటే మహదు రాస్తున్నాడు.

"ఘనత వహించిన నైజాం రాజుగారికి

పదివేల దండాలు,

మేము జనగామ జిల్లాకు చెందిన చనోరా ఇలాకా గోండ్లము. మేము సాగుచేసుకోను భూ ముల్లేక బాధపడుతున్నాము.

మేము ఎక్కడెక్కడికోపోయి గైరాన్ భూమి నరికి, పంటలేసుకుని పాతం చేసుకునేసరికి, ఆ భూములు తమవి, ఆ పంట కూడ తమదే నని పట్టేదార్లు వస్తున్నారు.

గొండోనికి భూమితోనే బతుకు.

మాకు భూమే తల్లి, తండ్రి- అన్నీను.

ఆ భూమే మాకులేదు.

ఆ భూమిల్ల పుట్టి, ఆ భూమిలపెరిగి, ఆ భూమిల కష్టపడే మాకు భూమిలేదు.

ఏనాడూ భూమి అంటే ఏమిటో ఎరగనోడు, నాగలి పట్టనోడు నేడు పట్టేదార్.

వాళ్ళకు వందలు వేలు ఎకరాల్లో భూమి ఉంది. మా భూములన్నీ వాళ్ళవే అంటున్నా రు. వాళ్ళకు వేల ఎకరాల్లో పట్టాలున్నాయి.

మన్ను బుక్కి మన్నులో బతికే మాకు పంట లు పండించటానికి భూముల్లేవు.

మేము మా కష్టాలు ఎన్నోసార్లు కలెక్టరుకు, తాసీల్దార్‌కు విన్నవించుకున్నాము. మాగోడు మీకు చెప్పి మీ ద్వారా న్యాయంచేయించమని వేడుకున్నాం- కాని ఫలితం శూన్యం.

భూమి కావాలంటే తమకు లంచాలియ్యా మంటున్నారు.

లంచాలు ఇవ్వం. అలాంటి దొంగపని మేంచేయం, మేం దొంగలంకాదు, మీరూ దొంగలు కాకంది అని ఎన్నోసార్లు చెప్పాం.

అయినా జంగ్లాత్‌వాళ్ళు లంచాలకోసం మమ్మల్ని వేధిస్తున్నారు.

మా గూడాలమీదబడి దాడిచేస్తున్నారు.

మా గుడిసెల్ని కాలుస్తున్నారు.

మా పంట చేన్లల్లకు పశువులను వదులు తున్నారు.

అడవిలో కాయకసరుకు చెట్టుమీద చెయ్యే సిన పసిపిల్లల చేతులు, వేళ్ళు నరుకుతున్నా రు.

మా ఆడవాళ్ళను చెరుస్తున్నారు.

మా మీద లేనికేసులు బనాయించి మమ్మ ల్ని కోర్టుల చుట్టు తిప్పుతున్నారు.

దయాహృదయంగల మీరు మంచి మన సుతో మా సమస్యలను అర్థం చేసుకుంటారని తలుస్తాము. మా పన్నెండు గూడాల ప్రజలకు దయతో పట్టాలిప్పిస్తారనీ, మీ దాసులమైన మీ ప్రజలు మిమ్మల్ని వేడుకుంటున్నారు.

పన్నెండు గ్రామాల పేర్లు :

జొడెన్‌ఘాట్, పట్నాపూర్, బాబెఝురి, ముర్ కిలొంక, నర్సాపూర్, కల్లెగామ్, ఛల్‌బరిడీ, టొయికన్‌మొవాడం, భీమన్‌గొంది, అంకుసా పూర్, దేమిగూడ, గోగిన్ మోవాడం!"

అని రాయించి, ఆ పన్నెండు గ్రామాల తరపున కొమరం భీము, మెస్రం జంగు, మడావి మహదు, సంతకాలు- వేలిముద్రలు వేసేరు.

ఆ ఉత్తరాన్ని పట్టుకొని ముగ్గురూ హైదరా బాదు వెళ్ళారు- స్వయంగా నవాబును కలిసి, కష్టాలు చెప్పుకొని దరఖాస్తు ఇచ్చి వద్దామని.

కాని అక్కడ వీరినెవరూ ఖాతరు చేయలే దు నవాబు దర్శనమూ కాలేదు. రాసుకున్న దరఖాస్తును అలాగే తీసుకొని ఉట్టి చేతులతో తిరుగు ప్రయాణమయ్యారు.

భీము, జంగు, మహదు హైదరాబాదు నుండి ఇంకా బాబెఝురికి చేరుకోకముందే, జంగ్లాత్‌వాళ్ళు జొడెన్‌ఘాట్‌పై దాడిచేసారు.

గూడానికి నిప్పుపెట్టారు. ఇళ్ళన్నీ కాలిపో యాయి. పశువులను విప్పదీశారు. పంటలన్నీ నాశనమయ్యాయి. మునలివాళ్లను కొట్టారు.

పసిపిల్లలను [illegible].

ఆడకూతుర్లను చెరిచారు.

దొరికిన రైతులను గుర్రాలవెనుక కట్టి లాక్కెళ్లారు.

ఎటు చూసినా - ఏడుపులు, పెడబొబ్బలు.

జోడెన్‌ఘాట్ సర్వనాశనమయింది.

హైదరాబాదు నుండి తిరిగొచ్చిన భీముకు జోడెన్‌ఘాట్ స్మశానమై స్వాగతం పలికింది.

చూసిన భీము కళ్లల్లోంచి నీళ్ళు రాడం [illegible]. అంతవరకు ఉన్న సహనం, శాంతి నశించాయి. ఆ స్థానంలో కోపం, పగ, ప్రతీకారం చోటుచేసుకున్నాయి. తక్షణం పన్నెండూళ్ళవాళ్ళు జోడెన్‌ఘాట్‌లో సమావేశం కావల్సిందిగా ఆజ్ఞాపించాడు.

కాలిన జోడెన్‌ఘాట్‌లోనే అందరూ సమావేశమయ్యారు.

“అన్నలారా తమ్ముళ్లారా! చూసింట్రా సర్కారు మనుషులు జేసిన ఈ ఘోరాలు. మనమింక ఇలాగే ఉంటే ఆల్లు మనని బతకనియ్యరు. ఇసుంటి బతుకు బతికేతేంది, సస్తేంది. మన మిట్లనే నోరుమూసుకుంటే కొన్నాల్లకు ఈ భూమ్మీద గోండు కోలము జాతే ఉండదు. అందుకని మనం బతికితీరాలి. ఈ భూమి, గాలి, నీల్లు, ఈ ఆకాశం, అడవి అందరిది. ఇవి ఒకల్ల సొమ్ముకాదు. మనం ఒకల్లను అడిగే పనిలేదు” అని కాసేపాగి అందరిని గమనించి మళ్ళీ అందుకున్నాడు.

“నేడు ఈ పన్నెండూళ్లేకాదు. ఈ దొంగల రాజ్యం కూలాలంటే మన గోండు కోలము జాతులన్నీ ఒకటిగావాలె. భూమి దున్నేవాళ్లంతా ఒకటి కావాలి. పంట తీసేవాళ్ళంతా ఒకటి కావాల. అడవి నరికేవాళ్లంతా ఒకటి కావాలె. మనం సుఖంగా ఉండాలంటే అందరం ఒకటై యుద్ధంజెయ్యాల. మన యుద్ధంకు ఈ జోడెన్‌ఘాట్ మంచిది. ఎత్తుగ ఉంది. దుష్మన్నుపైనుండీ అనుకున్నట్టు దెబ్బ గొట్టచ్చు. నేటినుండే మనం మన గోండు రాజ్యం కొరకు కొట్లాడుదాం. నేటి నుండి ఈ మన పన్నెండూళ్ళపైన ఎవరి అధికారం నడవదు. ఇక్కడ ఈ మన పన్నెండూళ్ళకు మనమే

[illegible]

జనమంతా ఆవేశంతో, ఆనందంతో “కొమురం భీముకీ జై” అంటూ పెద్ద పెట్టున నినాదాలిచ్చారు.

గోండు రాజ్యస్థాపన కొరకు కొందరు సాము గరిడీలు నేర్చుకోసాగారు. కర్ర తిప్పడం, బడిసెల విసరడం, బరిసెలిసరడం నేర్చుకుంటున్నారు.

గోండు రాజ్యస్థాపనకు జోడెన్‌ఘాట్‌లో చిన్న ఫౌజు కొమురం భీము నాయకత్వంలో తయారు కాసాగింది. మహారాష్ట్ర నుండి ప్రత్యేకంగా గోండు పత్రంగిని, కమ్మరిని పిలిపించి బర్మార్లు, బందూకులు తయారు చేసుకోసాగారు.

కొమురం భీము గోండు రాజ్యం వార్త నైజాం ప్రభువు వరకు వెళ్లింది. మైదాన ప్రాంతంలో తలెత్తిన తిరుగుబాటును సునాయాసంగా అణచివేయవచ్చు. కాని కొంత ప్రాంతంలో తలెత్తిన తిరుగుబాటును అణచటం అంత సులభంకాదు! అయినా నవాబు వెంటనే గోండులని అణచివేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

యూభయిమంది సైనికులు మొదటి ప్రయత్నంగా జోడెన్‌ఘాట్‌ను ఎక్కటానికి ప్రయత్నించి విఫలులయ్యారు. మైదాన ప్రాంతం యుద్ధనీతి ఈ కొండల్లో, రాళ్లల్లో రప్పల్లో పనిచేయలేదు. చావుదెబ్బలు తిని ప్రాణాలతో పారిపోయారు.

* * *

జోడెన్‌ఘాట్ ఎక్కడం చేతకాని సైనికులు కుటిలత్వానికి దిగారు. జోడెన్‌ఘాట్ కిందగల గూడాలపై పోలీసులు, జంగ్లాతువాళ్ళు, సైనికులు, తురకలు దాడులు చేయడం ప్రారంభించారు.

దాంతో జోడెన్‌ఘాట్ కిందగల గూడాల ప్రజలు మెల్లమెల్లగా జోడెన్‌ఘాట్‌పైకి చేరిపోయారు. జోడెన్‌ఘాట్ పోలీసుల, సైనికుల దిగ్బంధంలో చిక్కిపోయింది.

సబ్‌కలెక్టర్ నాజం ను సంధిప్రయత్నానికి పంపాడు నిజాం. అది విఫలమైంది.

సంధి విఫలం కావడంతో నైజాం పెద్దయెత్తున సైనికసిపాయిలను పంపాడు. ఆసంగతి కొమురం సూరుకు ముందు తెలిసింది. వెంటనే వెళ్లి “భీందాదా! నైజాం సర్కారు

సైన్యం గుంపులు గుంపులుగా వచ్చి వెవ్వెం
దగ్గరున్నారు. ఇప్పుడో అప్పుడో ఈ గుట్టెక్కుత
రు" అని భీముకు చెప్పగానే, భీము వెంటనే తుడుం మోగించాల్సిందిగా ఆజ్ఞాపించాడు.

బొగడమీద తుడుం మోగుతోంది.

జనం అన్నివైపులనుండి పరుగెత్తుకొని వస్తున్నారు.

ఆరోజు- సెప్టెంబరు ఒకటి, 1940

ఆదివారం -- ఆశ్వీయుజమాసం -- పున్నమిరోజు.

తాసీల్‌దార్ అబ్దుల్‌సత్తార్ నాయకత్వంలో నైజాం సైనికులు ముందుకు కదులుతున్నారు.

అప్పటికే సైనికులు జోడెన్‌ఘాట్ గుట్ట సగం ఎక్కారు.

అంతవరకు ప్రశాంతంగా ఉన్న జోడెన్ ఘాట్ హఠాత్తుగా చైతన్యవంతమయింది.

ఝుయ్యి ఝుయ్యిమని ఈలలు వినిపించసాగాయి. డప్పులమోత భయంకరంగా ఉంది. కాలీకామ్, తూటుకొమ్ముల మోత ఇంకా ఉధృతంగా ఉంది. తుడుంమోత అలలు అలలుగా వినిపిస్తోంది. జోడెన్‌ఘాట్ గొండులు చేసే వాయిద్యాల చప్పుడుకే, నైజాం సైనికుల గుండెలు బేజారయ్యాయి. ఎక్కడి వారు అక్కడే నిలబడిపోయారు. అంతలోకే బగబర జారుకుంటూ పెద్ద పెద్ద బండరాళ్ళు దొర్లిరాసాగాయి.

"భాగో" అంటే భాగో" అని పరుగెత్తుతున్నారు సైనికులు. పట్టుజారి పడిపోతున్నారు. అరగంట గడిచినా రాళ్ళవర్షం, గుళ్ళవర్షం ఆగలేదు. అయినా సైనికులు ఒకవైపు తుపాకులు పేలుస్తూనే కొండ ఎక్కసాగారు. రాళ్ళవర్షం కురవడం ఆగిపోయింది.

సైనికులు కొండ ఎక్కారు.

కొండమీద ఎవరూ కనిపించడంలేదు.

కాని తుడుం మోగుతోంది ఎక్కడినుండో.

బిత్తరబోయి చూస్తున్న సైనికులను హఠాత్తుగా చుట్టుముట్టారు గొండువీరులు. అందరూ చేతుల్లో గొడ్డళ్ళు, ఈటెలు, బరిసెలు,
ఒడిసెలు, విల్లంబులు, మొద్దుగోలలు పట్టుకుని వున్నారు.

చుట్టుముట్టిన గొండు యువకులమధ్య చిక్కారు నైజాం సైనికులు, కెప్టెన్ మరియు తాసీల్‌దార్ అబ్దుల్ సత్తార్.

భీము అందరికీ హెచ్చరిక చేశాడు.

"మనలో కొందరమైనా బతకాలి. కాని వీళ్లలో ఒక్కడుకూడ ప్రాణాలతో బయటపడనీయద్దు" అని.

తుపాకులు మోగాయి రెండువైపులనుండి.

ఒక తూటా కెప్టెన్ భుజాన్ని రాసుకుపోయింది.

ఒక తూటా మడావి భీమును బలిగొంది.

రఘు నేలకొరిగాడు. ఒక తూటా మేస్రం జంగు చేతికి తగిలింది.

మరికాసేపటికి మత్తునేలకొరిగాడు.

డొంగుర్రావు, బాదు ప్రాణాలు విడిచారు.

దేవుడపల్లి కొమరం మాను, దేవుడపల్లి కొమరం భీము ఇద్దరన్నదమ్ములు ప్రాణాలు వదిలారు. పంగడి భీము, చిర్రకుంట బాపూరావు తూటాదెబ్బకు ఆఖరుశ్వాస వదిలారు. అటు నైజాం సైనికులుకూడా కుప్పకూలారు.

ఒక సైనికుడు పేల్చిన గుండు కొమరం భీము గుండెల్లోనుండి దూసుకుపోయింది.

భీము గుట్టలా నేలకొరిగాడు.

చెట్టులా కూలిపోయాడు.

ఒక తుడుం చైతన్యం పగిలిపోయింది.

గొండుల గుండె చితికి పోయింది.

భూమికోసం, తనవాళ్ళకోసం తుపాకిపట్టిన ఒక గొండువీరుడు నైజాం కర్కశత్వానికి బలయిపోయాడు.

పుడమితల్లి చెరను విడిపించడానికి గతంలో ఎందరో వీరులు నేలకొరిగినట్లే నేడు భీము నేలకొరిగాడు.

అన్యాయం, దోపిడి, దౌర్జన్యం, మనిషి మరో సాటిమనిషిమీద సాగించే దారుణాలు, మారణకాండలు అంతంకావాలంటే ప్రతిపీడితుడు పోయుధుడు కాకతప్పదనే కొమరం భీము వీరుడిలా నేలకొరిగాడు.

ఆ మిట్టమధ్యాహ్నం జోడెన్‌ఘాట్‌పై విషాద మేఘాలు ఆవరించాయి.




కొమరం భీము మరణవార్తతో జోడేన్‌ఘాట్ లోని ప్రతిచెట్టు, పుట్ట, పిట్ట, రాయి, రప్ప మూగవోయినట్టు నిశ్శబ్దం ఆవరించింది.

చైతన్యంతో కదం తొక్కుతున్న గోండు వీరుల కాళ్లు, భీము మరణంతో నిస్సత్తువయి పోయాయి.

కొమరం భీమును చూసి, అదే దారిలో నడుద్దామని నిలబడిన గూడాలెన్నో వెనకడుగు వేసాయి.



8

కొమరంభీము పోయి సంవత్సరం గడవక ముందే నైజాం సర్కారు గిరిజన సంక్షేమశాఖ ప్రత్యేక సలహాదారు హేమన్‌డార్ఫును సర్వే కోసం పంపింది. గిరిజనులు కొమరం భీము నాయకత్వంలో తిరుగుబాటు చేయటానికి కారణాలేమిటో తెలుసుకొని నివేదిక సమర్పించడం హేమన్‌డార్ఫ్ పని. హేమన్‌డార్ఫ్ జర్మన్ దేశస్థుడైన మానవ పరిణామ శాస్త్రవేత్త అతడు రెండేళ్లు తిరిగి తిరిగి సర్వే రిపోర్టు సమర్పించాడుగానీ దాన్ని పట్టించుకున్నవాడు. లేడు.

గోండుల నాగరికత, జీవితంపట్ల ఆసక్తి ఏర్పడిన డార్ఫ్ జనగామ, ఉట్నూరు ప్రాంతాల్లో కొన్నేళ్ళు గడిపాడు. ఉట్నూరుకు దగ్గర్లోగల మార్లవాయిలో మకాంచేశాడు.

కాని అతను వారితో ఉండటంవలనగాని, సర్వే రిపోర్టువలనగాని గోండులకు ఒరిగింది ఏమీలేదు.

కొమరం భీము మరణించి ఏడేళ్ళు గడిచిపాయాయి.

కొమరం భీము సహచరులపై బనాయించిన కేసుల్లో చాలామందికి శిక్షపడింది. వాళ్ళు ఒక్కొక్కరే ఇప్పుడు విడుదలై జైలుగోడలమధ్యనుండి బయటకొస్తున్నారు. కొత్వాలు కొమరం సూరుకు నాలుగేళ్లు జైలైంది. మేస్రం జంగుకు తానేదార్‌ను చంపినందుకు భీము తోడువున్నందుకు అంతా కలిపి పదిహేనేళ్ళు జైలయింది.

ఢిల్లీలో తెల్లవారి పరిపాలనపోయి స్వతంత్రమొచ్చింది.

కొన్నాళ్ళకు తురకరాజ్యంకూడా అంతరించింది.

దేశం మొత్తం స్వతంత్రమయింది.

కాని గోండుల బతుకుల్లో కించిత్తయినా మార్పులేదు.

కాలం ముందుకు పోతూవుంటే గోండుల జీవితాలు వెనక్కిపోతూ దుర్భరమై అథఃపాతాళానికి పోతున్నాయి.

కాలం ఇంకాస్త ముందుకు నడిచింది.

మేస్రం జంగు, దేవుబాయిల కడుపుపంటగా ఒక కొడుకు పుట్టాడు. పేరు తుకారాం. తుకారాంకు వానాకాలం చదువుతో నాలుగు అక్షరం ముక్కలు బురదలా అంటాయి. ఆ నాలుగు అక్షరం ముక్కలకే తుకారాం మేధ వికసించింది. పరిస్థితులతో రాజీపడక, జరుగుతున్నవాటిని తన మేధతో ప్రశ్నించుకుంటున్నాడు. లోపం ఎక్కడుందో తెలియక ఆలోచనలతో సతమతమౌతున్నాడు. తుకారాం బుర్రలో ఆలోచనలు చుక్కానిలేని నావలా తిరుగుతున్నాయి.

దేవుబాయి తమ్ముడు అత్రం సోముకు పెళ్ళయింది. కాని పిల్లలు లేరు. పిల్లలకోసం మరో పెళ్ళిచేసింది తమ్ముడికి, కాని పిల్లలు పుట్టలేదు.

అందరూ కలిసి ఒకేచోట ఉంటున్నా కలిసికట్టుగా కాయకష్టం చేసుకున్నా రెండు పూటలతిండికే కటకటగా బతుకుతున్నారు.

'పరాయి పాలనపోయింది. పక్షపాతపు రాజరికం పోయింది. ఇక ఇప్పుడు రాజులు లేరు. ప్రజలే రాజులు'- అన్నారు నాయకులు.

ఎలక్షన్లొచ్చాయి.

పంచవర్ష ప్రణాళికలొచ్చాయి.

ఇంకా- ఎన్నెన్నో వచ్చాయి.

గంపెడు ఆశతో ఎదురుచూసారు గిరిజనులు.

'ఇక మా బతుకులు బాగయితయి' అని అనుకున్నారు. ఆశతో చూస్తున్నారు.

ఇయ్యాలగాదు రేపన్నరు...

రేపుకాదు, ఎల్లుండన్నరు...

మల్లవచ్చెనెలలో అన్నరు...

మల్ల గింతజల్ది ఎట్లయితది, అచ్చేయేడన్నరు. మల్ల ఇప్పుడెగాదు ఎలక్షన్లయినంక అన్నరు. ఎలక్షన్లయికాని ఇంకేమీ కాలేదు.

గిరిజనులలా చూస్తూనే ఉన్నారు. చూస్తుండగానే-

ఏడాది,

రెండేళ్లు,

మూడేళ్లు...

పదేళ్లు... ఇరవయేళ్లు గడిచిపోయాయి.

కాని

ఈ నింగి మారలేదు

ఈ నేలమారలేదు

ఈ అడవి మారలేదు

ఈ గోండుల జీవితాలు మారలేదు.

ఏ గోండు గుండెను కదిలించినా అది కన్నీటి కథలనే స్రవిస్తుంది.

రాయగలిగితే ప్రతిగోండు కథ ఒక కావ్యమే అవుతుంది.

ఈ స్వతంత్ర దేశంలో గొండు రోజురోజుకి ఎండిపోతున్నాడు. గోండుల జీవితంలాగానే అడవి కూడా పలచబడిపోతుంది. గోండు అడవి నరికితే తప్పు. కానీ 'గొండోడు నరికిండు' అని చెప్పి లారీలకు లారీలు కర్ర, దొంగ రవాణాకావడం ఒప్పయింది.





అడవి పలచబడుతోంది.

అడవి తల్లిని నమ్ముకున్న గిరిజనులు ఎండిపోతున్నారు.

అడవిని అమ్ముకున్న జంగ్లాత్‌వాళ్ళు రోజు రోజుకి బలిసిపోతున్నారు.

'పాత హుకూమత్‌పోయి కొత్త హుకూమత్ వచ్చి ఇన్నేళ్ళయినా ఆ పటేల్లు, పట్వార్లు, గిర్దావర్లు, ముందట్లాగనే ఉన్నరు. జంగ్లాతోల్లు అట్లనే ఉన్నరు. పోలీసులు అట్లనే ఉన్నారు. వాళ్ళు చేసే జులుంలు అట్లనే ఉన్నాయి. మరి అన్నీ అలాగే ఉంటే ''మన''- సర్కారుకు, ''మంది'' సర్కారుకు ఫరకేంది' అని అనుకుంటున్నారు గోండులు.

పాత సర్కారు గోండులకు చేసిందిలేదు చేసినట్టు చెప్పింది లేదు. కాని ఈ కొత్త సర్కారు మేం మీకోసం ఇది చేస్తున్నాం, అది చేస్తున్నాం అంటూ కాగితాలపై రాతలు రాసి చూపుతున్నారు. బాంకుల ద్వారా మేం మీకు ఇది ఇప్పిస్తాం అది ఇప్పిసాం అని ఆశచూపి, వేలిముద్రలు వేయించుకొని లాభాలు తాము పొంది, గిరిజనుల నెత్తికి అప్పులు, వడ్డీలు అంటగడుతున్నారు.

భూమిని నమ్ముకొని బతుకుతున్న గోండుల బతుకులు వెనకబడిపోతే, గోండులను నమ్ముకొని బతకటానికొచ్చిన వాడు ఎవడూ ఇప్పటివరకు చెడిపోలేదు.

పిట్టబొంగారం షావుకారు రాఘవయ్యా ముప్పయేండ్ల క్రితం ముంత చేతపట్టుకొని వచ్చి నేడు నేటికి ఎలా పెరిగిపోయాడో! రాఘవయ్యా ఇప్పుడు పెద్ద మోతుబరి! ఇప్పుడతన్ని షావుకారు అనరు 'సేఠ్‌సాబ్' అంటారు. రాఘవయ్యా- వ్యాపారం చూసుకోను, వచ్చిన డబ్బులు లెక్కపెట్టుకోను ఇరవై నాలుగు గంటలు సరిపోవడంలేదు.

రాఘవయ్యా మచ్చుకొకడు. ఇలాంటి రాఘవయ్యలు ఎందరో! అందరూ బలిసినోళ్లే. అందరూ గోండుల కడుపుకొట్టి సంపాదించిందే.

★ ★ ★

గిరిజనుల చీకటిబతుకులకు 'దీపం' అనుకున్న కొమరం భీము తొందరగానే ఆరిపోయె.

దారిచూపుతాడనుకున్న మానవతా వాది

హెమన్‌డార్ఫ్ దారి చూపకుండానే వెళ్లిపోయె.

వాళ్ళ బతుకులకు ఒక దారి చూపేవాడు. ముందుండి నడిపించేవాడు లేకపోయె.

దారి చూపేవాడులేక వాళ్ళ బతుకులు చెదలు పట్టిన ఈతచాపల్లా చిల్లులుపడి పోయె.

ఇప్పుడు గోండుల బతుకులో ఎలాంటి వెలుగులు లేవు, కోరికల్లేవు ఆశల్లేవు. ఏదో బతుకుతున్నారా అంటే బతుకుతున్నం అన్నట్టుగా ఉంది. వాళ్ళ నోళ్ళు మూగవోయాయి. ఎక్కువ మాట్లాడరు. మనసు విప్పి అసలు మాట్లాడరు. గుండె లోతుల్లోంచి నవ్వరు.

ఎంత గొప్ప చిత్రకారుడైనా ఈ గోండుల బొమ్మగీయలేడు. బొమ్మ గీయాలంటే మనిషి ముఖంలో ఏదో ఒక భావముండాలి. ఏ భావంలేని ఆ కళ్ళను, పెదవులను, నుదుటిని ఏమని గీస్తాడు. వారి ముఖంలో ఇప్పుడే భావమూ కనిపించదు.

కోపం లేదు- నవ్వులేదు- బాధలేదు- భయంలేదు... వెలుగులేదు. సంతోషంలేదు. పగలేదు- ప్రతీకారంలేదు. అసలు ప్రాణమే లేదు.

ఒకప్పుడు జింకలాగ, పిట్టలాగ, గలగల పారేసెలయేర్లలాగ, పూత నిండుగ ఉన్న చెట్ల లాగా నవ్వుతూ, తుళ్లుతూ ప్రపంచానికే ప్రాణంలాగా, జీవంలో చైతన్యంలా ఉండే ఈ మనుషుల్ని-

ఈ నాగరికత

ఈ మనుషులు

ఈ హుకూమత్‌లు- అన్నీ కలిసి ఇప్పుడు ఇలా మార్చేశాయి.

అలా స్తబ్దంగా ఉన్న గోండుల జీవితాల్లో చాలా కాలానికి మళ్లీ కదలిక వచ్చింది. ఎవరో గానీ ఓ క్రొత్తవ్యక్తి వాళ్ల మధ్యకు వచ్చాడు. అతడి పేరేందో ఎవరికీ తెలియదు.

అయినా, పిల్లల దగ్గర్నుంచి- ముసలివాళ్ళ వరకు

అందరూ ఆయన్ను 'అన్న'- అనే అంటారు.

ఆయన మాత్రం అందరినీ వరుసలుపెట్టి పిలుస్తాడు. "అన్న", "తమ్మి", "అక్క", "చెల్లి"- ఇలా ఎవరిని ఎలా పిలవాలో అలా పిలుస్తాడు.

ఆయన పని పొగాకమ్ముడు

అంగళ్ళు తిరిగి, ఊరూరు తిరిగి, జాతర్లు తిరిగి పొగాకమ్ముకుంటాడు. అందుకే అందరూ అతణ్ణి- "తంబాకన్నయ్య" అని కూడా అంటారు.

అంతో ఇంతో చదువుకున్నోడతను.

మంచిచెడ్డా తెలిసినోడు. ఇయ్యాల ఈ ఊర్లోఉంటే రేపు ఇంకో ఊర్లో ఉంటాడు. అట్ల ఊళ్ళు తిరుగుతునే ఉంటాడు. ఎక్కడ పొద్దు గుంకితే అక్కడే పడుకుంటాడు. ఇది నా ఊరు. అది నా ఊరు కాదు అనే మాటేలేదు. అన్ని ఊళ్ళు అతనివే. అందరూ అతని మనుషులే. అతడూ అందరి మనిషే. ఎవరు ఏ పనిచెప్పినా చేస్తాడు.

ఆయన ఏ ఊళ్లో ఉంటే ఆ ఊళ్లో పెద్ద సందడి.

ఎవరేం పెట్టినా తింటాడు. రుచి-పచి తెల్సినోడుకాదు.

సుఖం కావాలనడు. నిద్రొచ్చిందంటే ఎక్కడైనా పడుకుంటాడు. చివరికి చూరు సీడైనా సరే, చెట్టుబందయినా సరే!

ఆ మనిషికి ఈ కోరికలున్నాయి అనే మాటే లేదు. అతను కోరికలు లేని మనిషి. మరి వ్యాపారం ఎందుకు చేస్తాడో ఎవరికీ తెలియదు. పెళ్ళాం పిల్లలు లేరు. పండగలేదు, పబ్బంలేదు. ఇల్లులేదు, ముంగిల్లేదు. మనిషి చూస్తే గింతంత ఉంటడు పోరనిలాగ. ఈ గోండోల్లే కోరికలు చంపుకొని బతుకుతున్నారనుకుంటే, వాళ్లకన్న పెద్ద గోండోడు ఈ 'తంబాకన్నయ్య'. అలా ఊళ్ళు తిరుక్కుంటు పిట్టబొంగారం చేరాడు తంబాకన్నయ్య. అక్కడికి చేరేసరికి చీకటిపడింది. భుజం మీదున్న మూటను పిర్రసావిట్లో దించి బావిమీద ముఖం, కాళ్ళు కడుక్కుంటుంటే చూసి గుర్తుపట్టిన పిల్లలు "అన్నొచ్చిండు" – "అన్నొచ్చిండు" అని అరుస్తూ ఇళ్లకు పరిగెత్తారు పెద్దలకు చెప్పడానికి.

గూడాల ప్రజలు మనసువిప్పి మాట్లాడు

కునే పెద్ద దిక్కు ఈ తంబాకన్నయ్య. ఆయన వచ్చాడంటే అందరూ వెళ్లి ప్రేమతో పలకరిస్తారు.

పీర్లసావిడి ముందు ఇన్ని కర్రపుల్లలు వేసుకొని మంటజేసుకొని కూర్చున్నాడు అన్న మంది ఒక్కొక్కరే రాసాగారు.

అన్నను కలుసుకోవాలని, అన్నమాటలు వినాలని ఆతురతతో గబగబ నాలుగు ముద్దలు మింగి మూతులు తుడుచుకుంటూ పీర్లసావిడివైపు కదులుతున్నారందరూ.

ఈ గోండులపాలిట ఆత్మబంధువు అతడు.

వాళ్ళకు అతడొక వార్తాపత్రిక.

ఒక సలహాదారు.

ఒక మంచి - చెడు చెప్పే పంచాంగం.

ఒక పెద్ద దిక్కు.

అతడు వాళ్ళకెన్నో విషయాలు చెప్తాడు. చరిత్ర చెప్తాడు. పోరాట కథలు చెప్తాడు. కథలు చెప్తాడు. శాస్త్రాలు, పొడుపు కథలు చెప్తాడు. వాళ్ళను నవ్విస్తాడు, తనూ నవ్వుతాడు.

అతడేది చెప్పినా గొండి భాషలోనే చెప్తాడు.

గొండి భాష గొండోళ్ళకన్న చక్కగా మాట్లాడతాడు.

అంతవరకు పిల్లలకు పొడుపు కథలు చెపుతున్నవాడల్లా మేస్రం జంగు రావడంతో కథనాపి, జంగుకు చేతులు జోడించి "రాంరాం" అన్నాడు అన్న.

"రాం రాం... ఏందే అన్న-- ఈసారి శానొద్దులకస్తివి" అంటూ పలకరించాడు మేస్రం జంగు.

"అవునే అన్న... తంబాకు లేకుండె. తంబాకు తేనువోయింటిని. అందుకని ఇంతట్ల రాకడ కాలేదు" అని చెప్పాడు అన్న.

చూస్తుండగానే అత్రం భీము, కనకంబాలు, ఫత్రు, మాదు, సోము, నాగోబా, కొండడు, ముప్పయిమందివరకు గుమిగూడారు. ఒక్కొక్కరిని పేరు పేరున పలకరించి "రాం రాం" చెప్పాడు అన్న.

"ఈయేడు పిట్ట బొంగారంల పంటలెట్లున్నయి" అని ముచ్చట మొదలు పెట్టాడు అన్న.

"ఏంపంటలు! గయెట్లుంటే మనకేంది. గయి మనింటికి అచ్చేటియా ఏంది? ఎంత పండినా ఆ సేట్లు, సావుకార్ల గుమ్ములు గాదెలు నింపేతందుకేనాయే" అన్నాడు అత్రం భీము.

"అదేందే... అన్న గట్లనవడ్తివి కొత్తగా -- ఇయ్యాల్ల" అన్నాడు అన్న.

"కొత్తగా అనేదేముంది అన్న. పాత ముచ్చటనే ఇది. పిల్లాజెల్లా ఇంట్ల నలుగురు పొదుమూకులు రెక్కలిరుసుకొని పగలంతా పనిజేస్తే, రాత్రికి కూటికే ఉండదాయే. నాకైతే ఈ బతుకు తరాసకచ్చింది" అన్నాడు మాధు.

"ఇయ్యేడు అన్నిదిక్కుల పంటలు వోయినయి. ఆనలులేక సెట్లు నిలూనా ఎండిపోయినయి. నేను ఈ పట్టే అంత సూసుకుంటనే అస్తున్నగద! పంటలు వోయినట్టే, ఎట్ల గడుస్తదో ఏమో!" అని విచారం వెలిబుచ్చాడు అన్న.

"మనదని గింత భూముంటే ఎట్లనో అట్ల ఉన్నంతల బతకచ్చు. అదే లేకపోయె. ఉన్న భూమి రెండు హుకూమత్‌ల కాలంల చెయిజారిపోయె. పోంగ మిగిలింది బాకీ కింద, అడ్డీల కిందవాయే-- ఇగేం మిగిలింది" అన్నాడు ఫత్రు నిరాశగా.

"సర్కారోల్లు భూమి లేనోల్లకు భూమి, బావులు తవ్వుకోను పైసలు, మల్ల ఇంజన్లు, ఎడ్లు గొనుక్కోను పైసలు ఇస్తున్నరటగద. మీలు కూడవోయి అడగరాదు"

"ఆఁ... ఆడ ఇచ్చేదేంలేదు. ఉట్టిగ మాటల్జెప్పుడే. పనివడి ఆల్లదగ్గరికివోతే మమ్మల్ని గంత దూరం నిలవెడ్తరు. మాటసుక మంచిగ మాట్లాడరు. అడిగిందానికి ఏం సెప్పరు. మేం జెప్పేది ఇనిపించుకోరు. ఆల్లకు మేమంటేనే రోత. ఆల్లు మాకేంజేస్తరు-- మాకేం ఇస్తరు"

"అట్లంటే ఎట్ల! మీ కష్టాలు సర్కార్‌తోని చెప్పుకోండ్లి. మీకేం గావాల్నో నోటితోని జెప్పి ఒక దరఖాస్తు రాసి ఇయ్యుండ్లి. అడగంది అవ్వ కూడ బువ్వవెట్టది, ఎరికే గద అందరికి"

"మరి మా కష్టం సుఖం తెలిసినోడివి. నువ్వే చెప్పు ఏంజెయ్యాల్నో" అని అందరూ




"ముందు మీ కష్టాలు ఒక్కొక్కరియి జెప్పుండ్లి. విని ఎవరు ఏం జెయాల్నోజెప్త" అని అనేసరికి వరుసగా అందరు తమతమ కష్టాలు చెప్పసాగారు.

"నాకు దున్నుకోను భూమిలేదు. ఒక ఐదెకరాలు పట్టా భూమి ఇప్పిస్తే దున్నుకొని బతుకుతం" అన్నాడు ఫక్రు.

"నా ఎడ్లు ఇందరవెల్లి సావుకారు బాకీకింద గుంజుకుపోయిండు ఎడ్లులేక చేతులిరిగినట్లయి భూమి పడేత్ వెట్టిన-- నాకు ఎడ్లుగావాల" అన్నాడు పైకు.

"నా పట్టా భూమి జంగ్లాతోల్లు మాది అని అంటున్నరు. భయపడి ఇత్తువెట్టిన. సర్కారు పహాని చొప్పున నా పట్టా భూమి ఎక్కడుందో చూపియ్యాల" అన్నాడు జిత్రు.

"నా కొడుకుని గుడిహత్నూర్ మార్వాడి బాకీకింద వట్టుకున్నడు-- ఆన్ని ఇడిపియ్యాల" అన్నాడు భోజు.

ఇలాగే అందరు తమ తమ కష్టాలు చెప్పుకున్నారు.

అన్న తీరిగ్గా అందరికి దరఖాస్తులు రాసి ఏయే ఆఫీసులకు వెళ్ళి కలవాలో వివరాలు చెప్పాడు. అందరికి న్యాయం జరుగుతుందని చెప్పాడు.

ఇదంత అయ్యేసరికి చాలా పొద్దుపోయింది.

ఆకాశంలో సప్తఋషులు మూల తిరిగిపోయారు. పిల్లలకోడి కనబడకుండానే పోయింది. కాలి ఆరిపోతున్న కొర్రాయి పొగలాగ పాలపుంత స్పష్టాస్పష్టంగా కనిపిస్తోంది.

ఆవులించుకుంటూ ఒక్కొక్కరే వెళ్లిపోయారు.

అన్న అక్కడే మంటపక్కన ఇంత గొంగడి పరుచుకొని ముడుచుకొని పడుకున్నాడు.

★ ★ ★

తంబాకన్నయ్య మాట నిజమే అయింది.

ఆయేడు ఎవరికీ పంటలు పండలేదు. తినడానికి తిండి గింజలులేవు. చేయడానికి పనిలేదు. పిల్లాజెల్లతో గూడాలకు గూడాలు ఆకలితో అల్లాడిపోతున్నారు. ఏమైనా చేయాలి. ఎక్కణ్ణుంచైనా ఇన్ని గింజలు సంపాదించాలి. పండినా పండకున్న ఆకలి ఆగేదికాదు.

అందరూ కలిసి మాట్లాడుకొని పటేల్‌సాబ్ ఇంటికిపోయారు. పటేల్‌సాబ్ ఎప్పుడో చచ్చిపోయాడు. ఇప్పుడు పటేల్‌సాబ్ కొడుకున్నాడు. అందరూ ఒకేసారి రావడంజూసి "ఏందిరో... అందరూ కట్టగట్టుకొని ఇట్లస్తిరి" అంటూ అడిగాడు.

"ఏమున్నది పటేల... తినేందుకు తిండిలేదు. గింత ఏదన్న పని జూపించుండ్లి, గిన్ని గింజలు కొలిపించియ్యుండ్లి. ఆకల్తోని మా పిల్లా జెల్లా సచ్చే కాలమొచ్చింది" అన్నారు వీళ్లు.

"పనేమున్నదిర! పంటల హాలత్ మీరు సూడనే జూస్తిరిగద. నిట్టనిలువునా ఎండిపోయె. ఇగ నాదగ్గర పనేమున్నదిరా!"

"అట్లయితే గిన్ని గింజలు కొలిపించుండ్లి. అచ్చేయేటికి ఎట్లన్న కష్టపడి గింజకు గింజ తీర్చుకుంటం" అన్నారు అందరు ఒక్కమాటపై.

"ఇయ్యేడు ఎవల్లకు గింజలు 'నాగులకు' ఇచ్చుడు లేదు. అట్లిచ్చుడు దంద బంద్‌జేసిన. కావాల్నంటే పైసలకు పట్కపొండి. నగద్ ఇయ్యాల, నిలబడి గింజలు కొలిపించుకోవాల"

పటేల్‌సాబ్ కొడుకు దగ్గర పాతర్లలో వందల గోన్ల జొన్నలున్నాయి. కాని, ఒక్క గింజకూడా ఎవరికీ ఈయలేదు. లేవన్న వారంరోజులకే లారీలతో జొన్నలు ఆదిలాబాద్ మార్కెట్‌కు తరలించాడు.

చేయటానికి పనిలేక, తినటానికి తిండిలేక, నోరు తెరిచి, చేతులు చాపి అడిగితే కాదన్న ఆ పటేలు గాదెల్లో, గుమ్ముల్లో, పాతర్లలో నింపుకున్న ప్రతి ధాన్యం గింజ గొండుల చమటతో తడిసిందే. ఆ పటేల్‌సాబ్ వందల వేల ఎకరాల భూముల్ని వారు తమ చమటతో తడిపిదున్నారు. ఎముకల మూలుగుని కరిగించి పంటలు పండించి ఇచ్చారు. ఈరోజు కష్టకాలమొచ్చి నాలుగింజలడిగితే లేవు పొమ్మంటు



న్నాడు.

పిల్లలు, పెద్దలు ఆకలితో అలమటించిపో తున్నారు. ఆ ఆకలితోనే మళ్లీ అడవి తల్లి ఒడిలోకిపోయారు.

కడుపు మంటకు తట్టుకోలేక ఏది దొరికితే అది తిన్నారు. తీగమోదు గడ్డలు, ఎఱ్ఱసెన్నగడ్డలు, భూచక్రం గడ్డలు తిన్నారు.

తెల్లసెన్నగడ్డలు తవ్వి తీసి, తరిగి, నీళ్లలో వూరబెట్టి మళ్లీ ఎండబెట్టి, ఉడికించుకొని తిన్నారు. అట్లా చేసి తినకపోతే ఆ గడ్డలు తిన్నోళ్లకు సామ్మరోగంవస్తుందని భయం.

జంగ్లాత్‌వాళ్ల కంట పడకుండా చెట్ల చాటుగా, పొదల చాటుగా తప్పించుకుంటూ తునికిపండ్లు, ఇప్పపువ్వు, జిబిలిక పండ్లు, ఎలక్కాయలు, మారెడుగాయలు, ఏది దొరికితే అది తిని కడుపు నింపుకున్నారు.

కొందరు దేవదారు ఆకు దూసి, ఎండబెట్టి ఉడుకబెట్టుకొని తిన్నారు.

జీలుగు చెట్ల కల్లు, ఈతచెట్ల గబ్బము తిని ప్రాణం నిలబెట్టుకున్నారు.

గునుగు గింజలు దూసి దంచుకొని అంబలి కాచుకొని తాగారు. అప్పుడు వాళ్లను చూస్తే తెలుస్తుంది- ఆకలి ఎంత భయంకరమైందో.

చేయటానికి పనిలేక, తినటానికి తిండి లేక, దున్నటానికి భూమి లేక గోండులు అలమటించిపోయారు.

'ఊరికె ఉండి ఏం చేస్తాం. సర్కార్ ఎట్లాగు భూమి ఇవ్వదు. మనమే మనిషిగింత అడివికొట్టి భూమి పాతం చేసుకొని నాలుగింజలేసుకుంటే కాలం కలిసస్తే పండే, లేకుంటే ఎండే' అనుకొని అడవి నరకసాగారు గోండులు.

మరునాడే పరిగెత్తుకుంటూ వచ్చాడు చౌకీదార్.

"అరే... అరే ఇదేందిరా! పట్టపగలు గింత మందిగలిసి జంగల్ నరకవత్తిరి. ఇదేం పనిరా?"

"అవ్... జంగల్ కొడుతున్నం. నీతాత సొమ్మేం నరుకుతలేము. పక్కకు జరుగు. లేకుంటే దెబ్బ నీమీద వత్తది" అని బెదిరించాడు మాధు.

"అరే... సావుదలకు పులి ఊరిమీద వడ్డట్టు ఇవేం బుద్ధులురా మీకు. తప్పురా జంగల్ కొట్టుడు... మనిషిని చెప్తున్న ఇనుకోండ్లి. మల్ల పరేషాన్ అవుతరు" అని బెదిరించాడు.

"ఇప్పుడేం సుకంగ ఉన్నమనా, మల్ల పరేషాన్‌గాను కొత్తగ. ఏమయితది - నువ్వు తోకూపుకుంటూ ఆ మీ సేరేదార్‌కు చెప్తవ్. ఆడు పండ్లిగిలించుకుంట మీ అమీన్ దగ్గరికి పోతడు. ఆడు మల్ల ఆపైనున్న దగ్గరికి వోయి, అందరు కట్టగట్టుకుని ఈడికస్తరు... రాని. ఒకసారి గొడ్డలి లేవనే లేసింది. లేసిన ఈ గొడ్డలికి చెట్టయిన, మనిషైన ఒకటే... పో" అని గదిరించాడు వయసులో ఉన్న ఒక కొలామ్ యువకుడు.

"అరే... మీకేమైన పిసవట్టిందా ఏంది? ఇది కానూనన్ తప్పురా. జైలుకువోతర్రా"

"జైల్లన్న గింత తిండి దొర్కుతది. మీ బాధ తప్పుతది - అదే నయంగద"

"అన్నింటికి తెగించిండ్లు మీరు"

"పానాలకే తెగించినమ్... ఎరికెనా?" అన్నాడు మాధు.

ఇక లాభం లేదని గ్రహించి చౌకీదార్ ఉరుకుల పరుగుల మీద పోయి సేరేదార్‌కు విషయం వివరించాడు.

మరునాడు రెండు జీపుల్లో జంగ్లాత్‌వాళ్లు దిగారు.

అప్పటికీ అడవి నరుకుడు పని నడుస్తూనే ఉంది. సుమారుగా పదెకరాల అడవి శుభ్రమైంది.

జీపులను చూసి కూడా గోండులు, కొలాములు జంకలేదు, గొడ్డళ్లు దించలేదు.

అమీన్‌సాబ్, నలుగురు సేరేదార్లు, పది మందివరకు చౌకీదార్లు.... అందరూ గుడ్లప్పగించి చూస్తున్నారు.

ఒక చౌకీదార్ అమీన్‌సాబ్ మాటపై ముందుకొచ్చి మాధు చేతుల్లోంచి గొడ్డలి గుంజబోయాడు.

"అరే! ఈ గొడ్డలి గుంజుడు నీతరం కాదు గాని పక్కకు జరుగు. లేకుంటే మీ పుర్రి పగుల్తది" అన్నాడు మాధు.




ఆ మాటలు విని చేతిలో రూలు కర్ర పట్టుకొని పరుగెత్తుకుంటూ ముందుకొచ్చాడు అమీన్ కోపంగా.

"జంగ్లీ... హరామ్ ఖోర్. మా మీదనే గొడ్డలి లేప్తవ" అని రూలు కర్రతో మాధును కొట్టబోయాడు.

"దాన్ని ఉంచుకో దొర... నీ ఆఫీసుల పనికస్తది. లేకుంటే ఎప్పుడన్న జంగల్ల పులి గని పిస్తే కొట్టేందుకు పనికస్తది ఉంచుకో. లేదంటే ఈ పెయిమీదపడి ఉత్తగనే అది ఇరిగిపోతది" అని మాధు అనేసరికి చుట్టూ ఉన్న గోండులు, కొలాములు ఘొల్లున నవ్వారు.

ఇటు మాటలు నడుస్తునే ఉన్నాయి....

అటు చెట్లు అడ్డంపడుతూనే ఉన్నాయి.

అమీన్‌సాబ్‌కు తమ కళ్లముందే అలా చెట్లు అడ్డంపడుతుంటే రోషం ఆగలేదు.

"పకడ్‌లో సబ్ హరామ్ ఖోర్‌కో" అని ఆజ్ఞాపించాడు.

చౌకీదార్లు, సేరేదార్లు ముందుకు కదిలారు.

"ఆగుండ్లి... ముందుకచ్చి మా పనికి అడ్డంపడితిరో మా పెరుస పెనుకుకు మీ పానాలు బలి అనుకొండ్లి. మీ పెండ్లాం పిల్లల మీద ఏమాత్రం ప్రేమున్న పెనుకకు ఎల్లిపొండి. ఈ జంగల్ మాది. ఈ భూమి మాది. ఈ రెక్కల కష్టం మాది. నడిమిన మీ పెద్దరికం ఏంది... నడువుండ్లి" అని మాధుతోపాటు అందరూ గొడ్డళ్ళు లేపి ముందుకు కదిలేసరికి జంగ్లాత్ వాళ్లు తోక ముడుచుకొని పారిపోయారు. తర్వాత జంగ్లాత్‌వాళ్లు పోలీసులను వెంటబెట్టుకుని తిరిగి వచ్చారు.

పోలీసులను చూసి కూడా గొడ్డళ్ళు కిందికి దిగలేదు.

పోలీసులు గాలిలో కాల్పులు జరిపారు.

అప్పుడు గొడ్డళ్ళు కిందికి దిగాయి.

"ఏందిరా... కండ్లు నెత్తికెక్కినయా! మేమన్నా, మా మాటన్నా భయమే లేకుంటవోయింది. ఈ అడివి మీ తాతదేంబే?" అని అడిగాడు ఎస్.ఐ.

పోలీసుల మాటలకు వాళ్లేం బెదరలేదు.

"ఈ అడివి ఎవల్ల తాతదిగాదు... అందరిది. మాకు భూమిగావాల. సర్కారును అడిగినమ్... ఇస్తలేదు. కుసోని తింటోళ్లకి నూర్లు, ఏయిలు ఎకరాల పట్టాలుండుడేంది, దున్నుకుంటోల్లం మాకు భూమి లేకపోవుడేంది. ఇస్తారు మాకు భూమి జూపియ్యుండ్లి- లేదు కాదు అంటే మా గోండు, కొలామ్‌లకు అడవితల్లి ఉండనే ఉంది. నరుకుతం... దున్నుకుంటం. అంతేగాని తినడానికి తిండీలేక, చేయటానికి పనీలేక, దున్నటానికి భూమీ లేక గొండోడు బతికేదెట్ల. ఇప్పటినుంచి మేం ఉపాసం పండమ్. అడవి నరుకుతమ్. వంటలేస్తం. పండిస్తం. ఒక్కపూటన్న తింటం" అన్నాడు మాధు ఆవేశంగా.

"అడవిని నరికే కానూన్ లేదు మీకు"

"కానూన్ల మాట మాకు జెప్పకు దొర. ఏది కానూనో, ఏది కానూన్ కాదో మాకు ఎరికే. మా భూముల్ని ఇంకోల్లు మానోట్ల, మా పెద్దోల్ల నోట్ల మన్నుగొట్టి గుంజుకున్నప్పుడు ఏ కానూన్ అడ్డమచ్చింది? మా భూముల్ని మీ జంగ్లాత్ భూముల్ల కలుపుకున్నప్పుడు ఏ కానూన్ అడ్డమచ్చింది? మా భూమిని సావుకారు అడ్డీ కింద జమకట్టుకున్నప్పుడు ఏ కానూన్... అడ్డమచ్చింది? కానూన్ జెప్తవ్ కానూన్. మమ్మల్ని బిచ్చగాల్లకన్న అన్యాలం జేసిన ఈ కానూన్లను మేం కాలవెడతం. మాకు మీ బంగ్లాలద్దు, మోటర్లద్దు - గింత భూమి కావాల. అంతే! దానికోసమే ఈ తిప్పలు. భూమికోసం ఇక మేము ఏమైనా చేస్తం. యాల్లవడితే సస్తం కూడ" అన్నాడు మాధు ఆవేశంతో ఊగిపోతూ.

"జంగ్లాతోల్లు చెప్తే ఇనకపోతిరి. మరి మమ్మల్ని సూడంగనే చెట్లు కొట్టుడు ఆపితిరేంరా!" అని ధీమాగా అడిగాడు ఎస్.ఐ.

"మిమ్మల్ని సూడంగనే మేం ఆపలేదు సెట్టుగొట్టుడు. మీ బందూకు సప్పుడుకు ఆగినమ్. జంగ్లాతోల్లు ఉత్తసేతులతోని అచ్చి బెదిరించిండ్లు. ఆల్లయి ఉత్తసేతులుండె. మా సేతుల్ల గొడ్డంల్లుండె, ఆల్లు పారిపోయిండ్లు. ఇప్పుడు మీ సేతుల బందూకులున్నాయి. మీ బందూకుల ముందు మా గొడ్డల్లు ఉత్తసేతులే గద. అందుకని ఆగిపోయినమ్. రేపు మా సేతుల్లకూడా బందూకులుంటయి. అప్పుడు మమ్మల్ని ఎవడాపుతాడో జూస్తం. ఇప్పుడు మీ

సేతుల్ల మేమున్నం నడుంలి" అంటూ మాధు ముందుకు కదిలాడు జీపులవైపు.

అందరూ అతణ్ణి అనుసరించారు.

★ ★ ★

గూడెంలోకి ఈమధ్య తంబాకన్నయ్య రావడంలేదు. కాని తంబాకన్నయ్య పరిచయం చేసిన కుర్రాళ్లు వస్తున్నారు, పోతున్నారు. వాళ్లు ఎక్కణ్ణించి వస్తారో ఎవరికీ తెలియదు. గోండులకు వాళ్ళ ఊర్లు తెలియవు, పేర్లు తెలియవు. వారం పదిరోజులకొకసారి వస్తారు, కష్టసుఖం అడుగుతారు, కొండంత ధైర్యాన్నిస్తారు.

పొద్దుగుంకుతుంటే వస్తారు. మళ్లీ చీకటితెరలు వీడకముందే లేచిపోతారు. గోండోల్లకు తెలియని తోవలున్నాయి ఈ అడవిల వాళ్ళకు. ఎండలేదు, వానలేదు, చలిలేదు - వాళ్ళకు. పేర్లులేని వాళ్ళను గోండులు ప్రేమతో అన్నలని పిలుస్తారు.

★ ★ ★

తినటానికి లేక పట్టపగలే దోపిడీలు జరుగుతున్నాయి. పట్టపగలు యజమాని చూస్తుండగానే వందలసంఖ్యలో జనం వచ్చి పంట కోసుకొని పోతున్నారు. ఇదేమంటే కడుపు చూపుతున్నారు. ఇలా జరిగిన దోపిడీలన్నీ భూస్వాముల, పెత్తందార్ల, సేట్ల, షావుకార్ల కబ్జా భూముల్లోనే.

దోపిడి- దౌర్జన్యాలకు దిగినవాళ్ళను ప్రభుత్వం నిర్బంధంలోకి తీసుకుంటోంది, కేసులు పెడుతోంది. దొరకనివాళ్ళ పేర్న వారంట్లు జారీచేయడంతో, కొందరు అడవులపాలయ్యారు.

అందరి మనసుల్లో ఈ ఆలోచనే - అగ్నిలా మండుతోంది.

గోండుల హృదయంలో, మెదడులో ఎలగడీ పడింది.

అందుకే వాళ్ళ మనసుల్లో మంటలు!

వాళ్ళ కళ్ళల్లో మంటలు!!

వాళ్ళ చేతుల్లో మంటలు!

వాళ్ళ చేతల్లో మంటలు!!

అడవిలో, పల్లెల్లో, గుట్టల్లో, గూడాల్లో, లోయల్లో, లొంకల్లో- ఎటుచూసినా మంటలే.

ఆ మంటలు మెల్లమెల్లగ పాకుతున్నాయి.

పట్టపగలే పంటలను నిలువుకోతలు కోస్తున్నారు. వందల ఎకరాల్లో అడవులు నరుకుతున్నారు. కల్లాలపైనుండి పంటలను తరలించుకుపోతున్నారు. ఇలా జరుగుతుంటే ప్రభుత్వం కలవరపడింది.

నిన్న మొన్నటివరకు గోండులు తల్లడిల్లిపోయారు.

ఇప్పుడు ప్రభుత్వమే తత్తరపడుతోంది.

ఈ హుకుమత్‌లకు, సర్కార్‌లకు, ప్రభుత్వానికి ఐదేళ్లకొకసారి ఓట్లడగటం తెలుసు. అంతే! ఓటేయించుకొని లేవకుండ పడుకోవడం తెలుసు. ఈ సర్కార్లది కుంభకర్ణుడి నిద్ర. ఈ సర్కార్ కుంభకర్ణుడు మళ్లీ ఎలక్షన్ వరకు లేవడు... కాని లేపాలి-- లేపటానికే ఈ చురకల్లాంటి చేతలు.

కాని ఈ సర్కారుది చాలా గట్టినిద్ర. పెద్ద పెద్ద దెబ్బలు కొడితేగాని లేవదు. దెబ్బలేగాదు చురక లు కూడా పెట్టాలి. చురకలుపెట్టి ఒక్కసారి వెలుతురంతా దాని కళ్ళలో నింపాలి. అప్పుడుగాని ఈ నిదురమత్తు వదలదు.

ఇంత పెద్ద సర్కారును లేపటానికి చిన్న చిన్న కుంపట్లు చాలవు. పెద్దమంట కావాలి. ఎలుగడి పడాలి. అందుకని చిన్న చిన్న మంటలన్నీ ఒకటి కావాలి. అప్పుడే మంట పెద్దదవుతుంది. చిన్న దీపాన్ని గాలి ఆర్పేస్తుంది. అదే మంట పెద్దదయితే గాలికూడా తోడయి మంటలు ఆకాశాన్నంటుతాయి.

మంటలు నింగిని, నేలను పునీతం చేస్తాయి. మంట మండినచోట ఏ క్రిమి, కీటకం వుండదు. నేల సారవంతమౌతుంది. అక్కడ చెట్టుపెడితే అది నిక్షేపంగా పెరుగుతుంది - పూస్తుంది - కాస్తుంది... అది ప్రకృతిధర్మం. రేపటి హరితవిప్లవానికి నేటి మంటలు బీజం.

చిన్న చిన్న మంటలు కలిసి పెద్ద మంటయినట్టు- ఎక్కడెక్కడో పల్లెల్లో ఉండే గోండ్లు ఒకసారి అందరూ ఒకచోట సమావేశమై సామూహికంగా తమ కష్టాలు, సుఖాలు ఒకరికొకరు చెప్పుకోవాలనుకున్నారు. తమ కష్టాలకు పరిష్కారంగా కలిసికట్టుగా ఏంచేయాలో నిర్ణ




యించుకోవాలనుకున్నారు. అందుకు స్థలం తేదీ నిర్ణయించుకున్నారు.

ఆ స్థలమే ఇంద్రవెల్లి.

ఆ తేదీ: 1981 ఏప్రిల్ ఇరవయ్యో తారీఖు, సోమవారం.




**అ**ది చారిత్రాత్మకమైన రోజు.

1981 ఏప్రిల్ 20, సోమవారం.

**జ**రిగే సభ పెద్దయెత్తున ఉంటుంది కాబట్టి ఏర్పాట్లు ముందుగానే మొదలుపెట్టారు. ముందుగా మేం సభ జరుపుకుంటాం. దయతో అనుమతినీయగలరని సంబంధిత ప్రభుత్వాధికారులకు దరఖాస్తు పెట్టుకున్నారు. అధికారులు సభ పెట్టొద్దనలేదు, పెట్టుకోండని కూడా అనలేదు. కాబట్టి మౌనం అర్ధాంగీకారం అని భావించి సభ ఏర్పాట్లు బ్రహ్మాండంగా చేసుకోసాగారు.

కరపత్రాలు వేసారు.

వాల్‌పోస్టర్‌లు ఊరూరా, పల్లె పల్లెన, వాడ వాడన, అతికించారు.

సభ జరుపుకునేరోజు దగ్గరపడుతోంది.

అనుమతికోసం పోయిన మనిషి అటే అయ్యాడు.

సభ రేపే!

ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి-- అని అనుకుంటుంటే పోలీసులు వందల సంఖ్యలో దిగారు. ఇంద్రవెల్లిలో నిషేధాజ్ఞలు విధించారు. సభ జరపరాదన్నారు.

'ఇప్పుడు సభ జరపరాదంటే ఎలా-- ఏర్పాట్లన్నీ అయిపోయాయి. ఇప్పుడేం చేయడం' అని ఆలోచనలోపడ్డారు గోండులు.

రేపటిసభను నేడొచ్చి వీలుకాదంటే ఎలా? వచ్చేవాళ్ళు ఎలాగూ వస్తారు. వాళ్ళు కాదన్నా మనం సభ జరుపుకొని తీరాల్సిందే-- అని నిర్ణయించుకొన్నారు, పోలీసుల నిషేధాజ్ఞలను పట్టించుకోకుండా.

ఇందరవెల్లి సభపట్ల పోలీసులు పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నారు అనేవార్త ఇందరవెల్లి నుండి పిట్టబొంగారం వరకు వ్యాపించింది.

ఇందరవెల్లి వరకు వెళ్ళి తరిమికొట్టే తిరిగి వచ్చినవాళ్ళలో తుకారాం కూడా వున్నాడు. తుకారాం గుండెలు ఆవేశంతో, కోపంతో ఎగిరి పడుతున్నాయి.

విషయం తెలుసుకున్న జంగు అగ్నిపర్వతమే అయ్యాడు. దేవుబాయి రుద్రకాళిలా నిలబడిపోయింది ఈటె చేతపట్టుకొని. అత్రంసోము చూరుకు చెక్కి ఉన్న తూటుకొమ్ము ను తీసుకొని ఊదసాగాడు. సోము గొంతు నరాలు బిగుసుకొని, కళ్ళు ఎర్రజీరలతో జ్యోతుల్లా వెలుగుతుంటే తూటుకొమ్ము ధ్వని పిట్టబొంగారం అంతా ఆవరించింది.

మూలకు పడివున్న తూటుకొమ్ములన్నీ ఒక్కసారి మోగసాగాయి. తూటుకొమ్ముల ధ్వనితో పిట్టబొంగారం దద్దరిల్లిపోతోంది.

ఆవేశం పట్టలేని తుకారాం తుడుంను వాయిస్తున్నాడు. ఆ తుడుం చప్పుడులో గోండుగుండె చప్పుడు వుంది.

తుడుం మోత విని... తింటున్నవాళ్ళు తిండివదిలేసి... పాలిస్తున్న తల్లులు బిడ్డనో ట్లోంచి రొమ్ములాగేస్తూ... ముసలివాళ్ళు కర్ర ఆసరాగా నిలబడుతూ..., పడుచువాళ్ళు, ఆడవాళ్ళు, మగవాళ్ళు చేతికి ఏది దొరికితే అది అందుకొని..., పిల్లలు కిందపడిఉన్న రాయి చేతపట్టుకొని... తుడుం మోగిన దిక్కు ప్రవాహంలా కదులుతున్నారు.

''నేడు మనం ఇందరవల్లిల అందరం కలుసుకుని మన కష్టం సుఖం చెప్పుకుందాం అని అనుకున్నాం, కాని ఈ కల్లెసర్కార్, ఈ కల్లెరాజ్యంల మనకు, మన మాటకు ఏం కీమత్ లేదని తెలిసిపోయింది. అయినా మనం ఇనేది లేదు. మనం ఇందరవెల్లిపోదాం. సభచేసుకుందాం. ఎవరడ్డమొస్తరో చూద్దాం.

నడుంలి" అని మేస్రం జంగు అనడంతో, అందరూ పెద్దపెట్టున ఒక్కసారి గొంతు కలిపి "నడుంలి పోదాం" అంటూ ముందుకు కదిలారు.

దేవుబాయి భద్రకాళిలా చేతిలో ఈటెపట్టుకొని ముందుకు కదిలింది. వెంట జంగు ఉన్నాడు. సోము కాలికోమ్ ఊదుతున్నాడు. తుకారాం తుడుం వాయిస్తున్నాడు. మడావి రాము, మడావి జంగు, కనకం సోము, కోస రాము, కొట్నాక ఘగ్రు, పెడ్నకి కొర్దు, పెందూర్ గంగు, సుంగు, సిడాం చిత్రు, నైతం భూమ, మడావి ఎగుడిరావు.... ఒకరేమిటి పిట్టబొంగారమే కదిలిముందుకుసాగింది.

ఎర్రమేఘంలా దుమ్మురేపుకుంటూ ముందుకు కదిలారు జనం.

ఉదయం వందలసంఖ్యలో ఉన్న గోండులు మధ్యాహ్నం వేలలో చేరిపోయారు. ఇంద్రవెల్లిని కిలోమీటరు పరిధిలో పోలీసులు చుట్టుముట్టి ఉన్నారు. ఎవరినీ లోపలికి పోనీయడం లేదు.

జనంబలంతో పోలీసు వ్యూహాన్ని ఛేదించాలనుకున్నారు గోండులు. వేలసంఖ్యలో ఉన్నవారు ఇంకా పెరిగిపోయారు. ఎటుచూసినా జనం... జనం... జనం...

నేల ఈనినట్లు చీమలపుట్ట పగిలినట్టు
చుక్కలన్నీ రాలిపడ్డట్టు

ఇంద్రవెల్లి చుట్టూ ఎటుచూసినా కనుచూపుమేర జనమే జనం.

ఉన్నవాళ్లు చాలరన్నట్టు, తాము రాకపోతే ఎక్కడ సభ ఆగిపోతుందో అన్నట్టు, కాలినడకన పరుగుపరుగున ఇంకా ఇంకా వస్తున్నారు జనం.

అటు పడమటి కొండల్లో భాస్కరుడు నిష్క్రమిస్తుంటే

ఇటు జనచైతన్యం దీప్తితో, తెగువతో ప్రకాశిస్తోంది.

ఆ తెగువ, ఆ వెలుగు, ఆ బలం, ఆ చైతన్యంవైపు సూటిగా చూడలేక సూర్యుడు సైతం పడమటి కొండల్లో కనుమరుగయ్యాడు.

కారుమేఘాల్లా కదిలి వచ్చే జనవాహినిని ఎలా అడ్డుకోవాలో దిక్కుతోచక సతమతమౌతున్నారు పోలీసులు.

కొందరు లాఠీలను ఝుళిపిస్తున్నారు.

కొందరు తుపాకులను సవరించుకుంటున్నారు.

నినాదాలతో, కేకలతో, తుడుం మోతలతో, డప్పుల చప్పుడుతో, కాలికోమ్ ధ్వనితో ఇంద్రవెల్లి పరిసర ప్రాంతాలు దద్దరిల్లిపోయాయి.

ఆవేశంతో పోలీసుల వలయాన్ని ఛేదించుకొని ముందుకురికారు గోండులు. లాఠీచార్జీ-దెబ్బలు, పెడబొబ్బలు.

క్షణక్షణానికి పరిస్థితి విషమించసాగింది.

కొందరు అప్పటికే తుపాకులతో సహా పక్కనున్న మామిడి చెట్లు ఎక్కికూర్చున్నారు ఏక్షణం 'ఫైర్'అని ఆర్డర్ వచ్చినా కాల్చటానికి వీలుగా. ఆ జనసంద్రంలో తుపాకి చేతబట్టి కూడా నిలబడి ఎదుర్కోలేమని గ్రహించిన పోలీసులు ఎవరికి దొరికిన చెట్టు వాళ్ళెక్కుతున్నారు.

ఎలాఎలా పొద్దుకుంకుతుందో అలాఅలా జనం పోలీసులను నెట్టుకుంటూ, వాయిద్యాల హోరుతో నినాదాలు చేస్తూ ఒక్కో అడుగే ముందుకేస్తున్నారు.

సూర్యుడు వేడితగ్గి పడమటి కొండల్లో దిగుతున్నాడు. గోండులు ఆవేశం హెచ్చి సభావేదికవైపు ఉరుకుతున్నారు. పోలీసులు అటకాయించిన కొద్దీ వాళ్లఆవేశం జోరు పెరుగుతోంది. పరిస్థితి పూర్తిగా అదుపు తప్పింది.

చూస్తుండగానే ఒక పోలీసు కానిస్టేబుల్ గోండుల ఆవేశానికి బలయ్యాడు.

"ఇక లాభంలేదు... మీరింక ఫైరింగ్‌కు ఆర్డర్ఇవ్వాలి. లేకపోతే పరిస్థితి చేయిదాటిపోతుంది. ఈ జనం ఆగరు. పోలీసులూ మిగలరు. మనమూ మిగలం. ఆలోచించి లాభంలేదు. ఫైరింగ్‌కు పర్మిషన్ ఇవ్వండి" అనడిగాడు ఎస్.పి.

ఆర్.డి.ఒ వెనకాముందు ఆలోచిస్తున్నాడు. పరిస్థితి అదుపు తప్పుతున్న మాట వాస్తవమే. కాని ఈ జనంలో ఫైరింగ్ చేస్తే ఎంతో ప్రాణనష్టమవుతుంది... అది ఆయనకు ఇష్టంలేదు. ఎలాగైనా పరిస్థితిని అదుపు చేయొచ్చేమోననే ఆశతో ఉన్నాడు.




జనం పూర్తిగా అదుపు తప్పారు.

ఆర్.డి.ఓ. కు ఫైరింగ్ ఆర్డర్ ఇవ్వక తప్పలేదు.

'ఫై...ర్' అనే రెండేరెండు అక్షరాలు క్షణంలో అక్కడ ప్రళయాన్ని సృష్టించాయి.

తుపాకులు నోళ్ళు తెరుచుకున్నాయి.

గుళ్ళవర్షం కురువసాగింది.

రౌండ్స్‌పై రౌండ్స్ కాల్పులు జరుగుతున్నాయి. చూస్తుండగానే ఇంద్రవెల్లి మరో 'జలియన్‌వాలాబాగ్' అయింది.

ఒక తూటా వెళ్ళి దేవుబాయి ఎడమకాలిలో దిగబడింది. దేవుబాయి అక్కడే కూలబడిపోయింది.

ఆ ప్రదేశమంతా తుపాకి గుళ్ళ చప్పుడుతో మారు మ్రోగుతోంది. గోండులు పిట్టలా ప్రాణాలు వదిలి, నేలకొరుగుతున్నారు.

మడావి రాము కణతలోంచి ఒక తూటా దూసుకుపోయింది.

ఒక తూటా మండాని జంగు గుండెల్లో దిగబడింది.

కనకం సోము చాతీ తూటాలతో తూట్లుపడింది.

కోవరాము పొత్తికడుపులోంచి తూటా దూసుకుపోయింది.

మండాని జంగు, కొట్నాక గఘ్రు, సెద్మకి కొర్ధు, పెందూర్ గంగు, పెందురు సుంగు, సిడాం చితు, ఆర్కకమ్ముసైతం భూమ, మడావి ఎగుడిరావు.... ఇలా ఒక్కరేమిటి ఎందరో నేలకొరిగారు.

ఒక్క పిట్ట బొంగారం గ్రామంనుండి వచ్చిన వాళ్ళే పదమూడు మంది ప్రాణాలు కోల్పోయారు. అలాంటి ఎన్ని గూడాల వాళ్ళు వచ్చారో...? ఎంత మంది చచ్చారో....?

సాక్ష్యం చెప్పటానికి సూర్యుడు కూడాలేడు.

దెబ్బతిన్నవారు తగలనిచోట తగిలితే అక్కడికక్కడే నేలకొరుగుతున్నారు. తూటా తగిలి ప్రాణమున్నవారు సత్తాకొద్ది పరుగెత్తుతున్నారు.

జనం పరిగెడుతుంటే వెనకనుంచి కాల్పులు వినిపిస్తూనే ఉన్నాయి.

చూస్తుండగానే 'ఇంద్రవెల్లి' పీనుగులపల్లి అయింది. ఇప్పుడక్కడ చచ్చిపడిఉన్న శవాలు, తూటాలు తగిలి కదలలేని స్థితిలో ఉన్నవారు, పోలీసులు తప్ప ఇంకొకరులేరు.

ఆ పరిసరప్రాంతమంతా రక్తంతో తడిసిముద్దయింది.

సభాస్థలం పీనుగుల పెంటయింది.

అక్కడ గుండుదెబ్బ తిని ఆ పొలిమేరలు దాటి చచ్చినవాళ్లు ఎంతమందో! ఆ లెక్క ఎవరికీ తెలియదు.

చచ్చిపడినవాళ్లందరూ దిక్కులేని పీనుగులే అయ్యారు. 'ఈ పీనుగ మావోనిది' అని ఎవరు ముందుకు రాలేదు. వస్తే ఏంచేస్తారో, మళ్లీ ఏమౌతుందోనని భయపడి ఊరుకున్నారు.

మరుసటిరోజు లారీల్లో పదమూడు శవాలను పోస్ట్‌మార్టమ్‌కు తీసుకెళ్తుంటే కూడా ఎవరూ ముందుకురాలేదు.

చచ్చినవాళ్ల భార్యలు, పిల్లలు, తల్లిదండ్రులు అందరూ అంతదూరం నుండి శవాల్ని చూస్తూ కన్నీరు కళ్లలోనే మింగి నిలబడ్డారు.

ఆదిలాబాద్‌లో రైల్వే పట్టాల పక్కన పదమూడు శవాలకు సామూహికంగా శవసంస్కారం చేస్తున్నప్పుడు కూడా ఈ శవం నా కొడుకుది, ఈ శవం నా భర్తది, ఈ శవం మా అన్నది అని చెప్పుకోడానికి ముందుకురావటానికి లేక బతుకుభయంతో వెనక నిలబడ్డారు.

సర్కారు అంతమందిని కాల్చి, లేస్తున్న జ్వాలలను తుపాకిగొట్టంతో ఆర్పేశామనుకుంటోంది. కాని వాళ్లకుమాత్రం తెలియదా ఆ తుపాకిగొట్టం రవ్వలతోనే ఒకపుడు ఈ గోండు గుండెలు అంటుకున్నాయి.

గోండు గుడిసెలూ అంటుకున్నాయి.

గోండు గూడాలూ అంటుకున్నాయి.

ఆ మంటలను ఇప్పుడు ఆర్పాలని చూస్తే, అవి అడవిల పడుతున్నాయి.

ఇప్పుడిక అడవే అంటుకుంది.

ఆ మంటలనార్పడం ఎవరితరం.

ఆ మంటలకు

ఆ అడవి కాలుతుంది.

ఈ పల్లెలు కాలతాయి.



ఈ ఊళ్లు కాలతాయి.

ఈ నగరాలు కాలతాయి.

ఈ హుకూమత్ కాలుతుంది.

ఈ భూమే నలసల కాలుతుంది.

సలసలకాగి ఆరిన ఈ పుడమి రేపు పురిటి నొప్పులతో కొత్తసృష్టికి నాంది పలుకుతుంది.

అంతవరకు ఈ భూమి ఇలాగే కాలుతుంది.

అవును మరి... ఇది అడవి.

ఇది అంతర్ వైరుధ్యాల చైతన్యచిత్రం. అన్ని నాగరికతలకు, చరిత్రలకు స్తన్యమిచ్చి లాలించిన తల్లి.

ఈ అడవి తోడయి నిలబడిననాడే రాముడు రావణున్ని గెలిచాడు.

ఈ అడవి కరుణించి ఒడి చేర్చుకుంటేనే పాండవులు బతికి బట్టకట్టారు.

ఈ అడవి ఒక 'సిద్దార్థు'ని 'బుద్దుణ్ణి' చేసింది.

ఈ అడవే ఒక 'రామరాజు'కు పోరాటం నడక నేర్పింది.

ఈ అడవే ఒక 'రాంజీ'కి తోడయి నిలిచింది.

ఈ అడవే ఒక 'కుమరం భీము'కు పోరాటం నేర్పింది.

ఈ అడవి ఒక నక్సల్‌బరిని--

ఒక శ్రీకాకుళంను--

ఒక ఇంద్రవెల్లిని కన్నతల్లి.

ఎక్కడ అడవి ఉంటుందో అక్కడ పోరాటం, సంఘర్షణ ఉంటాయి. 'అడవి' అంటేనే ప్రకృతి.

నాగరికత ముసుగులో నేడు 'నగరం'-- ప్రకృతి అయింది. అడవి వికృతయింది.

అందుకే నేడు ఈ అడవి తిరగబడుతోంది

రేపటి పచ్చదనంకోసం...

చెదలుపట్టిన ఈ వ్యవస్థను సమూలంగా తుడిచివేయటానికి...

ఈ అడవి ఆత్మాహుతి చేసుకుంటోంది. అడవి చేసుకునే ఈ ఆత్మాహుతిలో పల్లెలు, పట్నాలు, నగరాలు కాలిపోక తప్పదు.

అడవి ఆత్మాహుతితో పునీతమైన యీ నేలతల్లి కడుపులోంచి, కొత్త వ్యవస్థ మొలకెత్తుతుంది, కొత్త జీవితం విచ్చుకుంటుంది, కొత్తమనిషి జీవించనారంభిస్తాడు. ★



# చతుర ప్రపంచం

## శునకభోక్త

'విదిశ' భోపాల్‌నుంచి 54 కిలోమీటర్ల దూరంలో వుంది. వాల్మీకి, కాళిదాసులుసైతం తమ కావ్యాల్లో ఈ విదిశానగరాన్ని వర్ణించారంటే ఆ నగరం ఎంత ప్రాచీనమైందో దీన్నిబట్టే మనం ఊహించుకోవచ్చు. విదిశా నగరం అశోకచక్రవర్తికి ఎంతో ఇష్టం అని చరిత్రకూడా చెబుతోంది.

విదిశకు నలభైకిలోమీటర్ల దూరంలో (బరెరాన్ అనే గ్రామానికి దగ్గర్లోనే) 'రావణ' అనే గ్రామం ఉంది. ఇది చాలా చిన్నఊరు. ఆ ఊరి ప్రజలు కట్టుకున్న ఓ గుళ్ళో ఎర్రని ఇసుకతో, రాతితోచేసిన రావణుని విగ్రహం వుంది. దాని తల గుండ్రంగా ఉండి మీసాలుమాత్రం చైనా వారి మీసాల్లా వుంటాయి. ఆ ప్రతిమచేతిలో రెండు కుక్కలబొమ్మలున్నాయి. ఆకలితో రావణుడు వాటిని తినబోతున్న ఫోజులో ఉంది ఆ విగ్రహం. ప్రత్యేకమైన సిద్ధులు పొందటానికి రావణుడు కొన్నిసార్లు శునకాల్ని భోంచేసేవాడని కొన్ని ప్రాచీనగ్రంథాల్లో వుంది. పదునైన కాలిగోళ్ళున్నాయతని విగ్రహానికి.

అదే గుడిలో మరోపక్కన శివుని పూజిస్తున్న రావణాసురుని ప్రతిమ వుంది.

ఆ గ్రామీణులు సందర్శకుల్ని విగ్రహాన్ని తాకటంగానీ, ఫొటోలు తీయటంగానీ చేయనివ్వరు. ఇరవైనాలుగ్గంటలూ ఆ విగ్రహందగ్గర ఎవరో ఒకరు కాపలావుంటూ వుంటారు. ఆ విగ్రహంకింద నిక్షేపాలు ఉన్నాయని వారి నమ్మకం.

స్థానికుల నమ్మకాలెలావున్నా ఆ విగ్రహం మాత్రం పదమూడవ శతాబ్దంనుండీ నేటివరకు దేశంలోని పర్యాటకుల్ని విశేషంగా ఆకర్షించటం విశేషం.



## సూపర్‌టాయిలెట్లు

ఆరోగ్యమే మహాభాగ్యమన్నారు. దాన్ని సదా కాపాడుకోవటం అంటే పోషకవిలువలున్న ఆహారం తీసుకోవటం, అవసరమైనన్ని విటమిన్లను సమతూకంగా చూసుకోవటమే కాదు, అనారోగ్యహేతువులైన పరిసరాలశుభ్రత కూడా చాలాచాలా అవసరం. పరిసరాలంటే ఇళ్లేకాదు. రోడ్లూ, ఆఫీసులూ, ఆసుపత్రులూ, హెూటళ్ళూ, రైళ్లు అన్నీనూ.

అందుకే జపానీయులు పరిసరశుభ్రతకి అధికప్రాధాన్యం ఇస్తారు. వాళ్ళు దేవాలయాల్నీ, రెస్టారెంట్లనీ ఎంత శ్రద్ధతో పరిశుభ్రంగా ఉంచుతారో, అందుకోసం ఎంతసమయం, డబ్బూ ఖర్చుచేస్తారో పబ్లిక్‌టాయ్‌లెట్లకి కూడా అంతే వెచ్చించి పరిసరాల్లో అశుచిత్వం కన్పించకుండా జాగ్రత్తవహిస్తారు. మరుగుదొడ్లు ఎంత చక్కగా ఉంటాయంటే బోర్డుచూసే వరకూ వాటిని పబ్లిక్‌పాయిఖానాలనే ఎవరూ గుర్తించలేరు. వారి మరుగుదొడ్ల పరిశుభ్రతా బాధ్యత జపనీస్ టాయ్‌లెట్ అసోసియేషన్‌ది. ప్రస్తుతం "లక్సరీ లావెటరీ"లని వీధివీధికీ కట్టించే ప్రయత్నంలో ఉంది జపాన్ టాయ్‌లెట్ అసోసియేషన్. ఇలాంటి 7 సూపర్‌టాయ్‌లెట్లని కట్టించింది. అందులో 6 సాంప్రదాయకమైన "టీరూం" స్టయిల్లో, చిన్న చిన్న గార్డెన్లతో, మెట్లతోకూడి వున్నాయి. అవెంత చక్కగా ఉంటాయంటే యాత్రికులు తరచుగా వీటిఫొటోలు కూడా తీస్తూ వుంటారు. దేశం అంతటా ఇలాంటివి ఇదివరకే వున్నా వాటి సంఖ్యను ఇంకా పెంచి, పరిశుభ్రతే ప్రధానమైన లగ్జరీ టాయిలెట్లనీ, సూపర్‌టాయిలెట్లనీ కట్టించే ప్రయత్నంలో ఉన్నారు 'జపనీస్ టాయిలెట్ అసోసియేషన్' నిర్వాహకసభ్యులు.

రోడ్లని దుర్గంధమయంచేసే గోడలు, వాడలుగల మన అందమైన నగరాలను స్లోగన్లకే పరిమితం చేయకుండా జపాన్లోలాగే పరిశుభ్రత పెంచి, మరుగుదొడ్లను శుభ్రంగా చేయించడం ఎప్పుడోగదా!

## అతని దిగులు

బొంబాయిలోని అంధేరి కో-ఆపరేటివ్ హౌసింగ్‌కాలనీలో గత పదిహేనేళ్ళుగా నివసిస్తున్నాడు గంగాధర్‌కాలే. ఆ కాలనీలోగల 580 కుటుంబాల్లో ఏ ఇంట మృత్యువు కాటేసినా గంగాధర్‌కాలే తన అనుచరులతోకలిసి చురుగ్గా అంత్యక్రియలకు తగిన ఏర్పాట్లు చేస్తాడు. ఆరోజు మొదలు 13వ రోజువరకు జరపాల్సిన కర్మకాండలన్నీ సలక్షణంగా





జరిపిస్తాడు. పదమూడురోజుల కార్యక్రమాలన్నీ ముగిశాక ఖర్చుల వివరాల పద్దురాసి ఆ ఇంటివారికిస్తాడు. వాయిదాల పద్ధతిలో ఆపైకం వసూలుచేసుకుంటాడు.

ఎక్కడ శవదహనమైనా అక్కడ హాజరుకావటం చిన్నప్పటినుంచీ 'కాలే'కి చిత్రమైన అలవాటు. వీరసావర్కర్ ప్రభోదంతో ఉత్తేజితుడై జాతికి తను ఏవిధంగానైనా ఉపయోగపడాలనీ, తగిన సేవలందించాలనీ నిశ్చయించుకున్నాడట. కాలనీవాసులు అక్కడకాపురం పెట్టిన తొలిరోజుల్లో ఆడిటోరియం గురించీ, ప్లేగ్రౌండుగురించీ, స్కూలుగురించీ ఆలోచించటంతప్ప ప్రతివారికీ ఏదో ఓరోజున అవసరపడే శ్మశానవాటిక గురించి ఆలోచించకపోవటం అతనికి ఆశ్చర్యం కలిగించింది. తనే పూనుకుని నిర్వహించాలనుకుని నిశ్చయించుకుని అందరిళ్ళకూ వెళ్ళి, తన సంకల్పం వివరించి ఇంటికొక రూపాయిచొప్పున విరాళం సేకరించాడు. ఆరోజున 270 రూపాయలు పోగవగా ప్రస్తుతం ఆ సొమ్ము 2130 రూపాయలకి పెరిగింది. ఆ నిలవున్న పైకాన్నే 'కాలే', అతని మిత్రులు అంత్యక్రియలు జరపటంకోసం వాడుకుంటారు. ఆ తరువాత శవంతాలూకు వారివద్ద వసూలుచేస్తారు.

'కాలే', అతని మిత్రులు కలిసి రబ్బరు చక్రాలున్న ఓ కూరగాయలబండీని తెచ్చారు. దానికే అల్యూమినియం స్ట్రెచర్ బిగించారు. వర్షాకాలంలో బండి లోపల ప్లాస్టిక్ గుడ్డను పరుస్తారు. శవాన్ని దహనవాటికవరకూ ఈ బండిలోనే పడుకోబెట్టి తీసుకువెళ్తారు - ఇందుకోసం అయ్యే ఖర్చు అయిదురూపాయలే. బండిబదులుగా కారుగానీ, వ్యానుగానీ కొనమని ఎవరైనా అతనికి సలహాఇస్తే, కొనటానికి ఏ బ్యాంకువాళ్ళో రుణాలిచ్చినా శవం చేరవేత ఖర్చు 150 నుండి 200 వరకు పెరుగుతుందని చెబుతాడు కాలే. చనిపోయిన వ్యక్తి కుటుంబసభ్యులతో అనవసరంగా ఎక్కువ ఖర్చు పెట్టించటం ఎందుకని అదేబండిని వాడుతున్నానంటాడు. ప్రతి శవాన్ని 'దహనం'కోసం దించాక బండినీ, స్ట్రెచర్‌నీ శుభ్రంగా కడుగుతారు.

చనిపోయిన వ్యక్తి తాలూకు కుటుంబసభ్యులు కోరితే శాస్త్రోక్తంగా అంత్యక్రియల్నిసైతం తనే చేస్తాడు కాలే. మతపరమైన లాంఛనాలతో శవం పడుకోబెట్టినచోట పదమూడు రోజులవరకూ పూజలు నిర్వహిస్తాడు.

'కాలే' పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్స్‌లో వుద్యోగంచేసి గత సంవత్సరమే రిటైరయ్యాడు. "ఈ బండి నా శవాన్ని మోసుకువెళ్ళాక ఈ విధిని ఎవరు నిర్వహిస్తారు? ఎవరు కొనసాగిస్తారు" అంటూ దిగులుపడుతున్నాడు కాలే.

# అరాజకీయం




"మీ శిష్యపరమాణువుల్లో పనికొచ్చే ఘటం ఒక్కటి కూడా లేదు. గుదిబండల్లాటి యాభైమంది మంత్రులు ఉండటంకన్నా చాకుల్లాంటి మంత్రులు పదిమంది ఉంటేచాలు... నేను గద్దె ఎక్కాలంటే మీరు దిగటం ఒక్కటే మార్గం అయితే ఏం చేస్తాం... అలాగే జరుగుతుంది మరి. మీరు పడిపోవాలని కాదుగానీ నేను మాత్రం గద్దె ఎక్కే ప్రయత్నం చేస్తూనేవుంటాను. నేనే మిన్న అని నిరూపించుకుంటాను... చూస్తుండండి" ఛాలెంజ్ చేసింది ముఖ్యమంత్రిగారి భార్య తన భర్తతో. ఆడది అనుకోనేకూడదు... అనుకుందంటే సాధించలేనిది లేదనే సంగతి తెలిసిన అతను భయపడ్డాడు ఓ క్షణం!!

ఈ స్పర్థలకు కారణమైన 'గద్దె' మహాత్మ్యం, దాని లీలలూ, అది చేయించగల పనులూ సవిస్తారంగా వివరించారు రచయిత పాలకోడేటి సత్యనారాయణరావు తమ నవల "అరాజకీయం"లో. 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొంది, మార్చి నెల 'చతుర'లో మీ ముందుకు వస్తున్నది. చదవండి... మీ స్నేహితులతోనూ చదివించండి!

**చతుర** రెండున్నర రూపాయలే

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd No. H/HD /4